# తెలుఁగు కావ్యాదర్శము

TELUGU KAVYADARSAMU

Ed

A Subramania Sastri

ఆంధ్రీకర్త

హరి సుబ్రహ్మణ్యశాస్త్రి

శతావధాని

# తెలుగు కావ్యదర్పము



TELUGU KAVYADARSAMU

దణ్డిమహాకవి కృతమైన కావ్యాదర్శమను
అ లం కా ర గ్రం థ ము న కు
తెనుఁగు లఘు టీకా సహితము



ఆం ధ్రీ క ర్త
కీ॥ శే॥ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి
శ తా వ ధా ని

ద్వితీయ ముద్రణము
వేయి ప్రతులు



## కృతజ్ఞత

సాహిత్య ఎకాడమీ, న్యూఢిల్లీ- వారి అర్థిక సహాయముచే ఈ గ్రంథము ముద్రింపబడినది. వారికి మా కృతజ్ఞత-

ప్రకాశకులు.

---

వెల రు 3=50 న. పై

---

ప్రకాశకులు
శ్రీమతి కొలచలమ సుబ్బలక్ష్మి
C-65 E type
*MotiBagh* I (*South*)
**New Delhi**

ముద్రణ :
[illegible]
ముద్రాలయము
పవరుపేట.
ఏలూరు.

Tel. 1401

శ్రీ మహాగణపతయేనమః

శ్రీ మహాసరస్వత్యైనమః

# గ్రంథకర్త జీవితచరిత్రము

కీ॥ శే॥ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి మహోదయులు, పండిత కవులుగా, శతావధానులుగా, విద్వదాశుకవులుగా, అలంకారాది శాస్త్రవేత్తలుగా, అద్భుత బోధనా చతురతగల ఆచార్యవర్యులుగా, ప్రఖ్యాతి వడయుటయే గాక, సచ్ఛీలము నందును, నిరంతర సత్కర్మానుష్ఠాన నిరతియందును, ఆదర్శ ప్రాయమైన జీవితమును నడపుచు, భాష్యశాంతిఁజేసి బ్రహ్మవేత్తలై విలసిల్లిన మహనీయులు.

వీరు, గుంటూరుజిల్లా, బాపట్ల తాలూకా, కొమ్మూరు నొద్దగల, గార్లపాడు అనుగ్రామమున అవ్వారివారి వంశమున, మహాలక్ష్మమ్మ, రామయ్య అను పుణ్యదంపతులకు, ఇద్దరు సోదరులకుఁ దమ్ముడుగను, ఇద్దరు సోదరులకును, ఒక సోదరికిని అగ్రజుడుగను, క్రీ॥ శ॥ 1883 సంవత్సరమునకు సరియగు స్వభాను సంవత్సరమున, నాషాఢమాసమున జన్మించి, సన్నిహిత సగోత్రులును, కొమ్మూరు వాస్తవ్యులును నగు, లక్ష్మీదేవమ్మ, వెంకటప్పయ్య అను దంపతులకు దత్త పుత్రులుగ నేగిరి.

## బాల్యము, విద్యాభ్యాసము

శాస్త్రిగారికి బంధువులై, వారితోఁబాటు చిన్నప్పుడు కవితా సంచారము చేసిన శ్రీ ఆచార్య రాయప్రోలు సుబ్బా

రావుగారు, కవిగారి బాల్యమును గురించి యిట్లు వ్రాసిరి. "సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చిన్నప్పుడుకూడా అందరుపిల్లలు వలె, ఆట పాటలలోనికి వచ్చేవారుకాదు. ఏదో సుదీర్ఘమైన గభీరచ్ఛాయ వారిముఖాన తొంగి చూస్తూఉండేది. ఆగంతుకముగా వచ్చిన ఒక మధ్వ బ్రాహ్మణునికి భోజన భాజనాది సౌకర్యాలు, తమ యింటనే అమర్చి, పుత్రుల చదువుకై వీరి జనకులు నిలిపిరి. ఆ పంతులుగారు కొంత ఇంగ్లీషు, కొంత సంస్కృతము చదివినవాడు. ఆయనకు యింతో అంతో కవిత్వమల్లడముకూడా అలవాటు ఉండేది. వారి దగ్గరనే వీరి సోదరులందరికి బడి చదువు పూర్తి అయినది. అనంతరము, బ్రహ్మశ్రీ బొడ్డుపల్లి సుబ్బరాయశాస్త్రిగారి (బాపట్లయొద్దగల వెదుళ్ళపల్లి కాపురస్థులు) వద్ద సంస్కృతము నభ్యసించిరి. కాళిదాసత్రయము పాఠము చెప్పడములో శ్రీ సుబ్బారాయుడు శాస్త్రిగారు పేరుమోసిన బోధకులు." అటుతరువాత కొలదికాలముననే ఇంటిలోఁజెప్పకుండ శాస్త్రిగారెచటికో విద్యాభ్యాసమునకై యేగి, అందు స్థిరత కుదిరిన పిమ్మటనే యింటికి తెలియఁజేయుట తటస్థించినది. మొదట తెనాలిలో శ్రీ ముదిగొండ చంద్రమౌళీశ్వరశాస్త్రిగారియొద్దను తరువాత కోడితాడిపర్రులో శ్రీ జమ్ములమడక సుబ్రహ్మణ్యశాస్త్రిగారియొద్దను, ఆతరువాత జంపనిలో విఖ్యాత తర్కపండితులు కొలచలమ నృసింహశాస్త్రిగారియొద్దను విద్యాభ్యాసము సాగినట్లు తెలియవచ్చుచున్నది. 1909 ప్రాంతమున, అనగా సుమారు 25 సంవత్సరముల వయసున కోనసీమలో

శాస్త్రిగారు చదువుకొనుచున్నట్లును, తాము తమ మొదటి కావ్యమును వ్రాసిపంపగా, శాస్త్రిగారు దానిని కొంత సవరించినట్లును, శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారివలన తెలియవచ్చుచున్నది. ఆతరువాత శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సహాధ్యాయిత్వమున తార్కికాగ్రణులగు శ్రీ అద్దేపల్లి సోమనాథశాస్త్రిగారివద్ద, కృష్ణాజిల్లా, చల్లపల్లిలోను, అప్పటికే ఆంధ్రదేశమంతటను ఆశుకవితాశతావధాన ప్రదర్శనములను వెదజల్లి, అనేక బిరుదములనంది తెనుగుభాషకొక నూతనోత్తేజమును కల్పించుచుండిన శ్రీ తిరుపతి వెంకటకవులలో నొకరగు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారివద్ద బందరులోను శాస్త్రాధ్యయనము సాగినది. అంతటితో విద్యాభ్యాసములోని మొదటిఘట్టము పూర్తియై, సంస్కృతముతో ప్రారంభించి, దిటమగు పాండిత్యమును సంపాదించిన సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, తెనుగు కవిత్వమువైపు దృష్టిమరల్చి, గురువుల యడుగుజాడలలో నడుచుచు, నవధానాదికమునకు గడంగి, పండితకవులుగా తాము కీర్తివడసి, గురువులగు తిరుపతి వెంకటకవులకును కీర్తిఁదెచ్చునంతటివారైరి. వీరి విద్యాభ్యాసమును గుఱించి శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారిట్లు వ్రాసిరి. "ఒక్కవిషయము నిశ్చయము. గురుముఖముగా నభ్యసించిన గ్రంథముకంటె స్వయముగా చదివి సాధించిన శాస్త్ర సాహిత్య పాండిత్యమే అధికము శాస్త్రిగారికి." ఈ భావమునే వెలిబుచ్చుచు, గురువులు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు వ్రాసినది.

"అస్మదాచార్య కతయేమి ! యఖిలవిద్య
లీశుడు స్వయంకృషినె గ్రహించె !"

## అ వ ధా నా శు క వి త్వా ది క ము

శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, గురువులగు శ్రీతిరుపతి వెంకటకవులవద్దనుండి గ్రహించి, వారి ప్రోత్సాహమున మిక్కిలి కృషిచేసి మెరుగులు దిద్దికొనినది ఆశుకవిత్వ ప్రదర్శన శక్తి. గంటకు వందలకొలది పద్యములు నిర్దుష్టమై, రసవంతమై, పండిత రంజకమైన శైలిలోఁ జెప్పి, 'ఆశుకవి తిలక' 'విద్యా దాశుకవి' మున్నగు బిరుదముల నార్జించిరి. కొప్పరపు కవులతో గురువులకు గల్గిన వివాదములో, శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు శతావధానములోవలె, వీరాశుకవితా ప్రదర్శనమున పలుచోట్ల బోటీకి నిలిచి, విజయమునొంచి గురువుల మన్ననకుఁ బాత్రులైరి. గుంటూరుజిల్లాలోని వేమవరమను గ్రామములో జరిగిన తిరుపతి వెంకటకవుల శతావధానానంతరము, గురువులచే నాదేశింపఁబడి, సుబ్రహ్మణ్యశాస్త్రిగారత్యాశువుగఁ బ్రదర్శింపగా, సమితానందమొందె. ఇరువురు గురువులు చెప్పిన రెండుపద్యములు వారి 'నానారాజసందర్శన' మనుగ్రంథమును నేటికిని అలంకరించుచున్నది.

'అన్నం బెక్కడనో భుజించితివి, విద్యాన్నాకడన్నేర్చి, తెం
దున్నీయందు లపంబు గాననుసుమీ దోషమ్ము! దుశ్శాస్త్రవుల్

నన్నునే మూర్ఖాన, వారి యాశువుల చందంబెల్ల నవ్వారి సు
బ్బన్నా! చూపి ఋణమ్ము దీర్చితివిసుమ్మా! శిష్యచూడామణీ!

(శ్రీ వేంకటశాస్త్రిగారు)

'ప్రకటిత రాశుధారను సభాసదులందరు మెచ్చుచుండ, నా
యకమణి సంతసింపగ నయారె రచించినవాడవీవు! వా
రక యరవింద సుందరమరంద ఝరంబు స్రవించుచుండు నీ
సుకవితఁగాచుకోదగవె! సుబ్బనశాస్త్రి! జగద్ధితమ్ముగన్!

(శ్రీ తిరుపతిశాస్త్రిగారు)

వీరి యష్టావధాన, శతావధాన, ఆశుకవిత్వ ప్రదర్శన వివరములు, పూర్తిగా లభింపలేదు. కాని, సికిందరాబాదు, గద్వాల, ముక్త్యాల, పెద్దాపురము, కందుకూరు, కావలి, నెల్లూరు, బుచ్చిరెడ్డిపాలెం, కనిగిరి, వేమవరం, నాగులవరం, నందివెలుగు, మొదలగు ననేకచోట్ల నిట్టి ప్రదర్శనములు జరిగినవని తెలియ వచ్చుచున్నది.

శ్రీ ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు కవితా సంచారంలో శాస్త్రిగారికి, తనకు గల సంబంధమును గూర్చి వ్రాయుచు, ఆశుకవిత్వధోరణి యెట్లు ప్రారంభమైనదో యీ క్రింది విధముగా వ్రాసిరి.

"తరువాత శ్రీశాస్త్రిగారు ఆశుకవిత్వ కలాపం ప్రారంభించారు. గార్లపాడు చెరువుకట్టమీద వృద్ధ వటవృక్ష మున్నది – ఇప్పటికి కూడా. ఆ చెట్టు చల్లని నీడలలో ఆశువుగా

వాచాధోరణి సాగింది, నన్ను పిలిపించి వెంట ఉండమన్నారు. అక్కడక్కడ 'అందుకోరా' అనేవారు. ఏదో నేనుకూడా అనుసరించేవాడిని.

"తరువాత, శ్రీశాస్త్రిగారు, అవధాన, ఆశుకవితా దీక్షతో బయలుదేరిరి. నన్ను వెంటరమ్మన్నారు. మొట్ట మొదట కావలిలో దిగినాము. అక్కడ అష్టావధానం జరిగింది, మరునాడు ఆశుకవితా సభకూడా సమకూర్చారు, సహృదయులు. ఒక సువర్ణ పతకముతో 'కవితిలక' అనే లాంఛనమిచ్చి బహూకరించారు.

"అక్కడనుండి నెల్లూరు వెళ్ళాము. శ్రీ తూములూరి శివరామయ్యగారి యింట మా విడిది. దాదాపు మూడు నాలుగు వారములు దినవిందుగా - ఏనాటి చుట్టరికమో - జరిగినది. నెల్లూరులో అవధానసభ, ఆశుకవితాసభ రెండుగా జరిగినవి. ఆశుకవితా సభకు శ్రీవావిలకొలను సుబ్బారావుగారు అధ్యక్షత వహించారు. 'ప్రభావతీ ప్రద్యుమ్నము' ఆశువుగా చెప్పమన్నారు. అది ఆశువులో రక్తి కట్టుతుందా? క్లిష్టకల్పనకు, అక్లిష్టకల్పన కుదిరించి ఆ కావ్యంలో - ఆ ప్రగల్భ వృత్తాన్ని, శతపాది గీతాలలో లాగి పారేస్తే బాగుంటుందా? అసలు మాకు మనసు వస్తుందా? సభ నీరసంగా ముగుస్తుందని శంక తగిలింది. శ్రీశాస్త్రిగారు ధ్యానాదికం జరిపి, నెల్లూరి రసిక జనానికి స్వాగత పద్యాలు చెప్పుతున్నారు. ఇంతలో నేను ఒక పద్యం కూర్చాను.

“పింగళి సూరనార్యుని కవిత్వమె మిక్కిలి ప్రౌఢ! మంములో
నం, గడు సుందరమ్ములు పెనంబడగా రచియించె నీ ప్రభావతీ
మంగళ సూత్రధారణము, మంజు రసోచిత కల్పనా కథా
సాంగములైన కావ్యములు సాధ్యమె పాడగ నాశుధారణిన్!

అని లేచి చదివాను, సభ సందడించింది. మహాకవి గణం పోయిందన్నారు. హఠాత్తుగా శ్రీశాస్త్రిగారు అందుకొని

పింగళి సూరనార్యుని......................
............పెనంబడగా నడిపెన్ ప్రభావతీ
.....................................

అని అద్భుతధారణతో చదివారు. సభలో హర్షం ధ్వనించింది.

“అక్కడనుండి బుచ్చిరెడ్డిపాలెం వెళ్ళాము. అవధాన సభ అత్యంత జయప్రదంగా జరిగింది. మరునాడు ఆశుకవిత్వ సభలో నేను మూర్ఛపడడంతో ఆశాభంగం కలిగింది. అక్కడనే ‘జననీ! యేమిటికింక ఆశుకవితా సన్యాస మిప్పింపవే!” అనే పద్యం నేను వ్రాశాను. తరువాత తిరిగి యింటికి వచ్చాము. ఈ యాత్రలో నాకు గలిగిన మహత్తరలాభం- ఉత్తర రామచరిత్ర వారి పాఠం లభించినది - అనంతరం వారు సికింద్రాబాదు వెళ్లారు. సికింద్రాబాదులోనే వారి అవధానాదులు అఖండంగా జరిగినవి.”

సికింద్రాబాదులో జరిగిన సభలనుగూర్చి, పండిత కవులును, వయోవృద్ధులును, ‘దివ్యవాణి’ పత్రికాధిపులైన,

నేటికిని సికింద్రాబాదు నగరము నలంకరించుచున్న బ్రహ్మశ్రీ చివుకుల వెంకటప్పయ్యశాస్త్రిగారు అడిగినంతనే శ్రమయనక వ్రాసి పంపిన వ్యాసమిాక్రింద బొందు పరుపబడినది.

"సికింద్రాబాదు నగరమునకు శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 1913 ప్రాంతమున (అనగా కవిగారికి దాదాపు 30 సం॥ ల వయసు వచ్చినప్పుడు) వచ్చిరి. వచ్చిన కొలది దినములలోనే, మార్కెట్ వీధిలోనున్న జంపడ్ హాలు నందొక యాశు కవిత్వ సభ పౌరులు సమావేశ పరచిరి. ఆ మహా సభలో (శ్రీ) శాస్త్రుల వారొక చరిత్రను గైకొని యాశువుగా వివిధ వృత్తములతో, నలంకారములతో, సాభిప్రాయముగా గవిత్వము జెప్పి సభ్యులఁ బరమానంద భరితులఁ గావించిరి. నాటి సభ నలంకరించి యానందించిన (శ్రీ) చారుగొండ నరహరిగారు పోగాకు బజారులోని ధర్మ సత్రమున నొక శతావధాన సభ నేర్పాటుచేసిరి. అందు శ్రీ చివుకుల అప్పయ్య శాస్త్రి, శివపురపు వీరభద్రపాకయాజిగారు, కార్యద్రష్టలుగా నుండి 100 మంది పృచ్ఛకుల నేర్పాటుచేసిరి. శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మహా సభలోని పృచ్ఛకులడిగిన వృత్తములు, అభిప్రాయములు, అర్థాంతరములు, అలంకారములు, సమస్యలు, దత్తాక్షరి, వ్యస్తాక్షరి, సైతము అడ్డులేకుండ, పండిత పామరులు చిత్రపడునట్లు, కవితను జెప్పి, యెల్ల పద్యములను, తు, చ, తప్పకుండ నొప్పజెప్పి, తమ ధారణాశక్తిని జూపించి ప్రశంస్యులైరి.

"అటు తరువాత, లాలాగుడి హాలులో నొక యస్థావ

ధాన సభ గావింపబడెను. ఇందు సమస్యలు, వివిధ వృత్తములు, దత్తాక్షరి మున్నగునవియేగాక, తొంబదియారు యక్షరములు వ్యస్తాక్షరికి సభ్యు లిచ్చిరి. అష్టావధానమని పేరేగాని, 20 మంది పృచ్ఛకులు కూర్చుండిరి.

"తరువాత తిరిగి మార్కెటువీధిలోనుండు జంపడ్ హాలులో మరియొక అష్టావధాన సభకూర్పఁబడెను. ఇందు మామూలు వృత్తములు, ఎక్కువగా స్రగ్ధర, మహాస్రగ్ధర వృత్తములతో, సమస్యాపూరణములు, దత్తాక్షరి, వ్యస్తాక్షరి మున్నగునవి యమోఘముగా కవితాప్రౌఢిమ ప్రదర్శించుచు బూర్తిజేసి ధారణాశక్తిని బ్రదర్శించి, సభాసదులను చిత్రపడునట్లు జేసి సన్మానితులైరి.

"తరువాత మఱియొక ఆశుకవితా సభ గావింపఁబడెను. ఇద్దానికి శాస్త్రుల గణపతిశాస్త్రిగారధ్యక్షత వహించిరి. శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు నలచరిత్రను గైకొని, సంస్కృత భాషలో ఆశుకవిత్వము చెప్పిరి. పిమ్మట సన్మానసభ గావించి అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి 'విద్వదాశుకవి' అను బిరుదము నొసంగి, యొకబంగారుపతకమును, 116 రూపాయలు పారితోషికముగాను సమర్పించిరి. పండితులు, కవులు శ్రీ అవధానిగారిని ప్రశంసించినమీదట రెండుగుఱ్ఱముల బండిపై ఆశీనులఁగావించి, పూలవానఁ గురిపించుచు, పురముఖ్య వీధులలో మహావైభవముగా నూరేగించి, ధన్యాత్ములమైతిమని పౌరులు తలఁచిరి. వీరు చేయు సభలన్నిటికినీ గూడ, శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రి, శివపురపు వీరభద్రపాకయాజిగార్లు

కార్యదర్శులుగానుండి నిర్వహించిరి. వీరి సికింద్రాబాదులో శ్రీ అనుముల్లి దత్తాత్రేయశర్మగారి గృహమున నివసించిరి. ఇక్కడనుండి గద్వాలసంస్థానమునకు శ్రీ అవధానిగారు పయనించిరి. పురప్రముఖులు రైలుస్టేషనుకుగూడాపోయి వీడ్కోలిచ్చిరి. (ఇది జ్ఞాపకమున్నంతవరకు వ్రాయబడినది.)”

శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారే ఆ రోజులలోనే ముద్రింపించి ప్రకటించిన శ్రీ శాస్త్రిగారి ‘సికింద్రాబాదు శతావధానము’నకు ప్రతిలభింపగా అందుండి మచ్చునకు, కొన్ని పద్యము లీ క్రింద నుదహరింపఁబడినవి.

1. పాఠము చదివిన, చదువని విద్యార్థులు - శుక్ల కృష్ణపక్ష దినరాత్రి సామ్యము :—

“చదువంగానది యేమి భాగ్యమదియే చాలంగగల్గన్ వలెన్
గద”యంచున్ బలుసోమరుల్ తమవిరాగంబెల్లఁ బాఠంబు లం
ద, దిటంబందగ నేగుదెంత్రు; పెఱతేతద్భిన్నులే తెంత్రు, వీ
రిదెసల్ రెండును కృష్ణశుక్లదినరాత్రీ సామ్యముల్ స్థాళ్ళలో!

2. సమస్య :— నిద్రాదేవత నిన్ను బూనెగదరా! నిర్భాగ్యదామోదరా!

ఆద్రాఘిష్ఠతపోభరంబునకు నాహ్లాదంబుఁ జెందెన్ వరం
బుద్రేకంబుగఁ బద్మజుండొసఁగ, నీయుద్యోగమొంతేనియున్
రౌద్రప్రక్రియగాంచు భాగ్యమెపుడున్ రాకుండ నీరీతిగా
నిద్రాదేవత నిన్ను బూనెగదరా! నిర్భాగ్యదామోదరా!

3. 'అనాఘ్రాతం' అనుశ్లోకమును మందాక్రాంతం లోనికి మార్చుట

శ్లో॥ నైవాఘ్రాతం కుసుమ మభవన్నైవ లూనం కిసాలం
నైనా విద్ధో మరణిపినవాఘ్రాత సారాచ మార్ధ్వీ!
అస్తోకం తద్భవతి ఫలితం భాగ్యరీతేస్సు రూపం
కస్యాద్భోక్తా చతుర చతురాస్యాశయో నైవజానే॥

4. 'సౌమిత్రే ననుసేవ్యతాం' అను శ్లోకమునకు తెలుఁగు

"ఆవృక్షంబును జేరుమోయనుజ! చండాంశుండు బాధించెడిన్"
"ఏవార్తల్ వచియింతు పీనిశగలండే సూర్యుడింమండితం
డోవంద్యా!" "యిదియెట్లెటింగితి?" "కురంగో ద్భాసితుండౌటచే
"హా! వామాక్షి! ధరాత్మజా! యెటుల నీయాలోకముల్
వీడుటల్"

గద్వాలలో జరిగిన సభలు సన్మానములను గుఱించి ఈ క్రింది వివరములుమాత్రము తెలియవచ్చినవి. శాస్త్రిగారు దెంచిన మొదటి సంవత్సరమున, శ్రీ సీతారామ భూపాలవర్యులు "మీరు వ్రాసుకొనివచ్చిన పద్యములు వినిపింతురా? ఆశుకవిత్వము చెప్పెదరా?" అని ప్రశ్నింప, సుబ్రహ్మణ్యశాస్త్రిగారు "మీ యిచ్చవచ్చినట్లు చేయగల" నని చెప్పి, వెంటనే సాయంత్రము 5 గంటలకు ప్రారంభింప బడిన సభలో ఆశుకవితా ప్రదర్శన మత్యద్భుత ప్రతిభతో సాగింపగా, సభ రాత్రి 11 గంటల వఱకు జరిగి, జయ జయ

ధ్యానములతో మునిగినదట! ప్రభువు మహానంద మొంది శాస్త్రిగారిని కొన్ని దినము లచ్చట నిలుపుకొని, వేయినూట పదార్లు, శాలువలు యిచ్చి పంపిరట. అటు తరువాత మఱొక మారు శాస్త్రిగారు గద్వాల వెళ్ళగా, ప్రభువు దర్శనమున కాలస్యమై, ఇంట నొక నైమిత్తిక ముండుటవలన, గద్వాల విడిచి వెళ్ళిరట. తరువాత ప్రభువు లా సంగతి తెలిసికొని చాల కించపడి, పదే పదే వారిని గూర్చి యడిగిరట.

నాగులవరములో జరిపిన ఆశుకవిత్వ ప్రదర్శనములో నెక్కువగాఁ బాదాంతమును, 'అవ్వారిగాగ' అని చెప్పి, చివరకుఁ జమత్కారముగా

'త్వరగ జెప్పుచు నుండెడి పట్టులందు
సారె సారెకు మాయింటి పేరువచ్చు!"

అని చెప్పిరట.

గుంటూరు వాస్తవ్యులు, అవధాని శిరోమణులు, ప్రస్తుతాంధ్ర రాజ్యాస్థానకవులు, మధ్వ శ్రీకాశీకృష్ణాచార్యుల వారు తమ వద్దశాస్త్రిగారు కొన్ని తర్కగ్రంథములు రెండు మూడు మాసములు చదివినట్లును, వారి ధీ సంపన్నత యత్యద్భుతమని యనిపించినట్లును, ఆ సమయముననే యిద్దరు కలిసి తెనాలి సమీపముననున్న నందివెలుగు గ్రామములో నొక ఆశుకవిత్వావధాన ప్రదర్శనము జరిపినట్లును, శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారి నాటి కవితాశక్తి సభ్యులను ముగ్ధుల నొనర్చినట్లును జెప్పిరి.

శతావధాని శ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రిగారి పద్మ పురాణ పీఠికలో నీ క్రింది యంశములు పేర్కొనబడినవి:—

'సుప్రసిద్ధాశుకవి, శతావధాని శ్రీఅవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారును, వీరు (శ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రిగారు)ను గలసి కొన్నిసభలు గావించిరి. అట్టి సభలలో యాదగిరి నృసింహస్వామి దేవాలయమున జరిగిన యష్టావధానసభ యొకటి. ఆ సభలో అవ్వారివారి యాశుకవితా కౌశలము, చిదంబరశాస్త్రిగారి యవధాన నైపుణ్యము, సభ్యుల నానంద వార్ధి నిమగ్నులఁ గావించినవి. మరునాడు (22-11-1914) వీరిరువురును గలిసి యాశుకవితాసభఁ గావించిరి. ఆసభలో యిరువుర యాశుకవనములు సమానధాటిలో నడచినది. ఒకరి నొకరు మీఱలేకపోయిరి. అయ్యద్భుతాశుకవితాసభను సభ్యులే కాక, దేవస్థానాధికారులును, మిగుల మెచ్చుకొని, యా జంటకవులకుఁ జెఱి నూటపదాఱులు, పట్టువస్త్రములు, సత్కరించిరి...శాస్త్రిగారును అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారును కొలఁది కాలము మాత్రమే యిట్లు కలిసి సభలు చేయుట సంఘటిల్లినది. ఐనను దానివలన జిదంబరశాస్త్రిగారి యాశుకవితా ధాటి మిగుల వర్ధిల్లినది.'

## అధ్యాపకత, వేదాంతశాస్త్ర పరిశీలన, గ్రంథరచన.

శాస్త్రిగారాశుకవిత్వావధాన ప్రదర్శనములఁ జేసు గాంచు నప్పటికి వయస్సు ముప్పది సంవత్సరములు మాత్రమే. ఆ యాడుననే, అనగా, 1914 సం॥ ప్రాంతమున, తెనాలి అద్వైత వేదాంత శిరోమణి కళాశాలలో నధ్యాపకులుగ

నియమింపఁబడి, తెనాలిలో 3, 4, సంవత్సరములు పెంపుడు తల్లితోను, ఆలుబిడ్డలతోను నివసించిరి (అప్పటికి వారికిద్దరాడ పిల్లలు గలరు.) కళాశాల ప్రిన్సిపాల్ నోరి సుబ్రహ్మణ్యశాస్త్రి గారి ప్రత్యేక మన్ననకు పాత్రులైనట్లు వారిచ్చిన యోగ్యతా పత్రము వలన తెలియుచున్నది. (లభించిన యోగ్యతా పత్రములలో శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిగారు, శ్రీ విన్నా అప్పారావుగారు ఇచ్చినవి గలవు.) తెనాలిలో నివసించు నీ సమయముననే, తన యేకైక సోదరి భర్త చనిపోగా, దురపిల్లుచు, ఆమె తన యిద్దరు పిల్లలతో నివసించుట కొక గృహము నిర్మించుటలో నిమగ్నులైరి. నాటివారి సహాయము, సోదరప్రేమ, దయ, మఱపునకు రానివని సోదరి కొలచలమ రామమ్మగారు తెలియఁ జేయుచున్నారు.

ఆ రోజులలోనే, మహారాష్ట్ర దేశమున జన్మించి, బాపట్ల పురికి వేంచేసియుండి, సిద్ధపురుషులని ప్రసిద్ధి వహించిన శ్రీ బ్రహ్మానందతీర్థ యతీంద్రులు, అనేక విధములుగా పరిసర ప్రాంత జనుల నుద్ధరించుచు, భక్తి ప్రచారము చేయుచు, వేదాంతశాస్త్ర బోధనల సల్పుచు నుండిరి. స్వాములవారి చర్యలు స్వభావము, పాండితి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి పూర్తిగా నచ్చినవి. త్వరలో వారి శిష్యులై, వారి బోధల ననుసరించి, తెనాలి కళాశాలాధ్యాపకత మానివేసి బాపట్లకు విచ్చేసి, స్వాములవారివద్ద ప్రస్థానత్రయమును జదువుచు, అచటి శ్రీ శంకర విద్యాలయమున నిరపేక్షోపాధ్యాయులుగాఁ బనిచేయుచుండిరి. ఇల్లు ప్రారంభింపఁబడి, దాదాపు

జీవితమంతయు సాగుచునేయున్న, వేదాంత శాస్త్ర పరిశీలన, సుబ్రహ్మణ్యశాస్త్రిగారి విద్యాభ్యాసమున రెండవ ఘట్టమనవచ్చును. వేదాంతమున శ్రీ బ్రహ్మానందతీర్థ యతీంద్రులే కాక, ప్రకాశానందనాథ పాద, వేంకటరమణ బుధులును తమకు బోధ గురువులుగా ఈ శాస్త్రాధ్యయనముననే శాస్త్రిలవారు సూచించి యున్నారు. శ్రీ బండ్లమూడి గురునాథ శాస్త్రిగారియొద్దకూడ వేదాంతశాస్త్ర పఠనము జరిగినట్లు తెలియవచ్చుచున్నది. బాపట్లలో శ్రీ బ్రహ్మానందతీర్థస్వామి వారివద్ద చదువుచున్నప్పుడే, శ్రీ మల్లాది హనుమచ్ఛాస్త్రిగారు సహాధ్యాయులుగానుండుట తటస్థించినది. శ్రీ హనుమచ్ఛాస్త్రి గారు కొంతకాలమున శాస్త్రమున్స్వీకారము చేసి, తెనాలిసమీపమున నున్న అనంతవరములో నివసించుచు నాచుట్టుపట్ల మిక్కిలి ప్రసిద్ధికెక్కిరి. ఈ స్వామివారు తమ యుపన్యాసములలో గురువులగు బ్రహ్మానందతీర్థులవారి నామముతో బాటు తరచు శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి పేరుగూడ స్మరించి యుగ్గడించెడివారు. వారి శిష్యపరంపరలోనివారుగూడ నేటికిని సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని తీర్థస్వామివారి ముఖ్యశిష్యులలో నొకరుగ స్మరించుచుండుట కలదు.

బాపట్లకువచ్చిన ఒక యేడాదిలోపుననే శాస్త్రిగారికి భార్యావియోగము సంభవించినది. దీనితో విరక్తి, వేదాంత శాస్త్ర పరిశీలన మఱింత ప్రబలినవి. దాదాపు పదిసంవత్సరముల వరకును ద్వితీయ వివాహముమాట వినబడనీయలేదు. ఈమధ్య మొదటికుమార్తెకూడ మృతినొందుటయు, గురు

వర్యులు తీర్థస్వామివారు కాశీకచేరి సిద్ధినొందుటయు తటస్థిం చెను. భార్యావియోగులై యున్న నీ సమయమున నే, బందరు హైస్కూలునుండి పిలుపురాగా గురువులు చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారలంకరించిన స్థానము నాక్రమించుటకై వెళ్ళి రెండు సంవత్సరములకుపైగా పనిచేసిరి. అప్పుడే ఇంగ్లీషు వారి ప్రాధాన్యమీయఁబడి విద్య నేర్పఁబడు బడులలో తెనుఁగు భాషకుగల యిక్కట్లను వర్ణించుచు "ఆంధ్రభాషా విలాపము" అను దీర్ఘమైన గీతపద్యమునొకటి వ్రాసి, అచ్చొత్తించి పంచి పెట్టించిరి.

ఇంగ్లీషుబడియందధ్యాపకతవలన బందరులో వేదాంత శాస్త్ర పరిశీలన కుంటుపడ లేదు. కీ. శే. వాగ్గేయకారరత్న హరినాగభూషణముగారు మొదలగు పురప్రముఖులు కొందరికి శాస్త్రిగారిరోజులలో గీతాభాష్యప్రవచన మొనర్చిరి.

ఇంతలో గాంధీజీ ప్రారంభించిన సహాయ నిరాకర ణోద్యమము దేశమందంతటను వ్యాపించుకొనగా ఖద్దరు స్వీకరించి హైస్కూలు అధ్యాపకతకు రాజీనామానిచ్చి, శాస్త్రిగారు బాపట్లకు వచ్చివేసిరి. ఇట్లు దేశభక్తిపరులై నాడు స్వీకరించినఖద్దరు ఆమరణాంతము శాస్త్రిగారు వీడ లేదు. గాంధిజీతో కొన్ని విషయములలో నేకీభవింపక పోయినను, కొల్లాయి సైతము ఖద్దరులోనే చిట్ట చివరవఱకును ఉండినది. ఇది వీరి దేశభక్తికే కాక, పట్టుదలకు, దీక్షాపరతకును దార్కాణము. వీరి దేశభక్తి, యావేశపరులై వీరు వ్రాసిన 'శిథిలాంధ్ర వైభవము' అను పద్యసంపుటిలోనను స్పష్టముగా గానవగును.

అంత బాపట్లలో నొక పర్ణశాలను నిర్మించుకొని, నిరాడంబరముగ జీవించుచు, నిత్యకర్మానుష్ఠానపరులై, వేదాంతశాస్త్ర పరిశీలన నిత్యాధికముగ సాగించుచు, శిష్యులకు కొద్ది మందికి పాఠములు సెప్పుచు, నాలుగైదు సంవత్సరములు గడపిరి. ఈ కాలముననే కొంత గ్రంథరచనముగూడ సాగినది. ఇంకను మొదట చెప్పవలసినది, స్కాందపురాణాంతర్గతమగు 'శివతత్త్వ సుధానిధి' అను వేదాంత గ్రంథమును శ్లోకములను సవరించి, తాత్పర్యములను వ్రాసి ప్రకటించుట, దీనికొఱకై తంజావూరు సరస్వతి మహల్ గ్రంథాలయమునకు స్వయముగా శాస్త్రిగారు వెళ్ళియుండిరన్న వారి కార్యదీక్ష యెంతటిదో, పూర్వవేదాంత గ్రంథములను బయల్పరచుటలో గల యాసక్తి యెంతటిదో గ్రహింపవచ్చును. ఈ 'శివతత్త్వ సుధానిధి'ని 'ఉపాసనాభాగము', 'జ్ఞానభాగము' అని రెండు భాగములుగా శాస్త్రిగారు ప్రకటించిరి. రెండవ రచన, 'దైవబలము' అను నొక చిన్న పద్యకావ్యము. స్కాంద పురాణాంతర్గతమైన ఒక కథను గైకొని, హైస్కూళ్ళలోని పైతరగతి విద్యార్థులకు పాఠ్యగ్రంథముగా నుపయోగపడు నట్లుగా నిది వ్రాయబడినది. అప్పటి పాఠ్యగ్రంథ నిర్ణేతృసంఘము వారచిర కాలములోనే దీనినామోదించుటయు, కొన్ని స్కూళ్ళలో నిది స్వీకరింపబడుటయు గూడ తటస్థించినది. ఈ పొత్తము నందలి పద్యములే శాస్త్రిగారి కవితాపటిమకు, హృద్యమైన పద్యశైలికి, వారి యలంకార ప్రియత్వమునకు నిదర్శనములుగా నిలిచినవి.

ఈ కాలముననే 'భారతి' పత్రికచే సంప్రార్థింపఁబడి విమర్శపూర్వకమైన యనేక వ్యాసములు శాస్త్రిగారు వ్రాసి 'భారతి' సంచికల నలంకరింపఁ జేసిరి. ఈ వ్యాసములనే కొంత కాలమైన పిదప పుస్తకరూపముగా ప్రకటించి దానికి 'కావ్య నాటకాది పరిశీలనము' అని పేరు బెట్టిరి. ఇందు ముఖ్యమైన వ్యాసములు (1) ఉత్తరరామచరిత్ర, వ్యాసుడు, భవభూతి (2) ఉత్తరరామచరిత్ర, రసవిచారణ (3) కనిష్ఠికాధిష్ఠిత కాళి దాసు (4) చింతామణి సూచన (5) శ్రీ హర్షనైషధము, శృంగారనైషధము (6) ద్రౌపదిరోషము–భారత కవియౌచితి (7) బమ్మెరపోతరాజుకవి దృష్టి, మొదలగునవి. ఈ పొత్త మును మద్రాసు విశ్వ విద్యాలయమువారు, విద్వాన్ పరీక్ష కును, ఆంధ్ర విశ్వ విద్యాలయమువారు 'భాషా ప్రవీణ'కును పాఠ్య గ్రంథముగా కొన్ని సంవత్సరములు నియమించిరి.

'భారతి'లో ప్రకటింపఁబడిన వ్యాసరాజములలోనే, 'మేఘము' అను శీర్షిక క్రింద రెండు మూడు సంచికలలో ప్రకటింపఁబడిన పద్య కావ్యమును, 'శిథిలాంధ్ర వైభవము' అను శీర్షిక క్రింద, దేశభక్తి పూరితులై శాస్త్రిగారు వ్రాసిన పద్య సముదాయమును గలవు. ఇందులో 'ఎండ్లూరు'ను గూర్చి వ్రాసిన పద్యములనే శ్రీ మధునాపంతుల సత్య నారాయణశాస్త్రిగారు, తమ 'ఆంధ్ర రచయితలు' అను గ్రంథమున నుదహరించి యుగ్గడించి యున్నారు.

ఇవిగాక 'సీత' అను వచన గ్రంథమును, 'మాఘ పురాణము' అను గద్య పద్యాత్మకమైన గ్రంథమునుగూడ

రచించినట్లు తా మెరుగుదుమని శాస్త్రిగారి మేనల్లుడు, అల్లుడునునగు శ్రీ కొలచలమ సుబ్బావధానిగారనుచున్నారు. ఈ రచనలు శాస్త్రిగారిచే నచ్చొత్తింపబడక పోవుటచే, నవి యిప్పుడు కానవచ్చుటలేదు. గ్రంథ ముద్రణకు వలయు ధనమునకై ధనికుల నెవ్వరినైన నాశ్రయించుటగాని మాట మాత్రము మిత్రులతో చెప్పుటగాని శాస్త్రిగారెన్నడు నెఱుగరు. ముద్రింపించిన గ్రంథములన్నియు, సంవత్సరమునకు నాల్గు వందలు మాత్రము వచ్చు పిత్రీయమైన భూవసతి ఆదాయము లోననే, సొంతఖర్చుమీాదనే, శాస్త్రిగారే ప్రకటించియుండిరి.

బాపట్లలో నీ సమయమున శిష్యులకుఁ బాఠములు చెప్పుపద్ధతుల వివరములు కొన్ని తెలియవచ్చినవి. పంచ కావ్యములు చదువవలెనని వచ్చిన శిష్యునకు; మొదటనే కాళిదాసువంటి మహాకవి రచనముతో ప్రారంభించుట కిచ్చ గించక, జీవనోపాధికిని పనికివచ్చునని 'బృహజ్జాతకము'ను ప్రారంభించెడివారట. ఇక్లేబందరులోని సంస్కృతపాఠశాలలోఁ గూడ వీరి ప్రోద్బలముననే, రఘువంశముతోగాక, గౌతమ ధర్మసూత్రములతో సంస్కృతపాఠములు ప్రారంభింపబడు చుండెడివని వినికిడి.

ఈ సమయముననే, అనగా, 1925 ప్రాంతమున, పెంపుడు తల్లిగారి యొక్కయు, సోదరులయొక్కయు ప్రోద్బల మునను, పెంపుడు పోయిన తనకుఁగల కొన్ని ధర్మములను పురస్కరించుకొనియు, శాస్త్రిగారు ద్వితీయ వివాహముచేసి కొనిరి. ఆ తరువాత కొలది కాలముననే కుమార్తె వివాహ

మును గూడ జరిపిరి! శాస్త్రిగారికి ద్వితీయభార్య, లక్ష్మీ నరసమ్మగారియందు సంతానము కలుగలేదు. ప్రథమ భార్యయందు గలిగిన కుమార్తెలిద్దరిలో యిప్పుడు ఒక్కతె మాత్రము సౌ॥ వెంకటసుబ్బమ్మ (సుబ్బలక్ష్మి) అను నామె కలదు. ఆమె పైతృష్వస్రీయులును, ఎం. ఎ. పట్టభద్రులును నగు శ్రీ కొలచలమ సుబ్బావధానిగారిచే కీయబడి, పుత్ర పుత్రికా సంతానము వడసి, శాస్త్రిగారిని దౌహిత్రసంతానవంతులుగా నొనర్చినది.

వివాహమైన రెండు సంవత్సరములకు, అనగా 1927 సం॥న, పశ్చిమగోదావరిజిల్లా, కొవ్వూరు ఆంధ్రగీర్వాణ పీఠాధ్యక్షులు, కీ॥ శే॥ తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు తమ వేదసంస్కృత పాఠశాలలో నధ్యాపకులుగాఁ బనిచేయుటకు వీరినిఁ బిలువనంపిరి. కొవ్వూరులోని గోపాద క్షేత్రమున నిత్యము గోదావరి స్నానము ముక్తిసాధనమని శాస్త్రిగారు మరల నుద్యోగమును స్వీకరించి, 1935 లో తాము పరమ పదించువఱకును నచటి పాఠశాలలో నుభయభాషాగ్రంథ బోధన మొనర్చుచునుండిరి. తల్లాప్రగడ సూర్యనారాయణగారి నిర్యాణానంతరము, పాఠశాల నిర్వహణము కీ॥ శే॥ శ్రీవల్లూరి సూర్యనారాయణరావుగారి చేతులలోఁ బడినది. వీరి సంస్కార ణాభిలాష అందరెరిగినదే కదా! వీరికిని, శాస్త్రులవారికిని యనేక విషయములలో భేదాభిప్రాయము లుండెను. కాని వీరిద్దరికిని ఒకరియెడ నొకరికిఁగల భక్తిగౌరవములు, పరుల కాశ్చర్యమును గలిగించుచుండెను. నిజమునకిది యా

యిద్దరి మహనీయుల విశాలదృష్టికిని, సహనస్వభావము నకును తార్కాణము. మొదట నిచ్చిన స్వల్ప వేతనము కూడ కొంతకాలమైన తరువాత తగ్గింపఁబడెను. అట్టి పట్టులలో శాస్త్రిగారి వైఖరి పాలకవర్గమువారి కష్టనిష్ఠుర ములను గ్రహించు నట్టిదియై, పాఠశాల పురోభివృద్ధికి తోడ్పడునట్టిదియై యుండెను. కొలదికాలము శాస్త్రిగారు కళాశాల ప్రధానోపాధ్యాయులుగా కూడ పనిచేసిరి.

కొవ్వూరు నివాస మేర్పడిన కొలదికాలమునకే 'కావ్యాదర్శము' రచించుట పూర్తియాయెను. మొదటికూర్పు 1929 లో శాస్త్రిగారే సొంత ఖర్చుతో ప్రకటించిరి. పీఠిక వ్రాయుటకు, విమర్శకాగ్రేసరులై, పెద్ద పదవుల నాక్రమింప కుండియు, సారస్వత సేవలో నగ్రగణ్యులై నాడు వెలయు చుండిన కీ॥ శే॥ మానవల్లి రామకృష్ణకవిగారి నెన్నుకొన్న, సుబ్రహ్మణ్యశాస్త్రిగారి గుణ గ్రహణపారీణత యెంతయు మెచ్చుకొనదగినది. పీఠికలో దండి మహాకవి కాలము నిర్ణ యింపఁబడుటేగాక, అలంకారికులలో దండి ప్రత్యేకత బాగుగా విశదీకరింపఁబడినది. ఆంధ్రీకరణ ప్రాశస్త్యమును గూర్చి రామకృష్ణకవిగారు పీఠిక చివర భాగములో రచించిన వాక్యములకంటె ఘనమైన మాటలు చెప్పుట కష్టము. ఈ కావ్యాదర్శమును మద్రాసు విశ్వవిద్యాలయమువారు తమ 'విద్వాన్' పరీక్షకు పాఠ్యగ్రంథముగా ఒకటి రెండు సం॥లు నియమించిరి.

'కావ్యాదర్శము నేగాక' ఆనంద వర్ధనుని 'ధ్వన్యాలోకము'నుగూడ శాస్త్రిగారు పద్యకావ్యముగ తెనిగింపఁ బూని, ధ్వని భాగమును మాత్రము 'ఆంధ్ర ధ్వని' అని పేరునఁ బ్రకటించిరి. 'ఆలోకము'నఁ గొంత భాగమైనను తెనిగించినట్లు తెలియవచ్చుచున్నది. కాని యింతవఱకును నది లభింపలేదు.

శాస్త్రిగారి బోధనాశక్తి వికసించి పరిమళించినది, కొవ్వూరు కళాశాలాధ్యాపకతలోననే. మామూలు అర్థములను విద్యార్థులనింటివద్దనే చూచుకొనిరమ్మని చెప్పి, తాను రచనలోని అర్థాలంకార శబ్దాలంకారములను వివరించుటలోను కవిని సమకాలికులతోను, పూర్వకులతోను పోల్చి యాతని ప్రత్యేకతను బయల్పరచుటలోను, నిమగ్నులయ్యెడివారు. నానార్థములు వచించుటలో శాస్త్రిగారందె వేసిన చేయి. ఇక, రసము, ధ్వని విషయములలో రచనలో లేనివానినిగూడ వెదకి యెట్లో సాధించెడివారన్న నతిశయోక్తిగాదు. అధునాతన కవుల గ్రంథములు కొన్ని పాఠములుగా జెప్పెడిపట్ల, లోపములు చూపవలసివచ్చినప్పుడు పరుషముగా మాట్లాడక, 'భాష కేమి ! హృదయము ముఖ్య'మని సర్దుకొనిపోవుచుండెడి వారు. ఇట్లు సమర్థతతో, విశాలహృదయముతో నత్యున్నతముగ పాఠములు చెప్పుచు, అరుదగు శిష్యవాత్సల్యమును జూపుచు, సచ్ఛీలము, శమదమాది సద్గుణసంపత్తి, సత్కర్మానుష్ఠానము, అతిథిపూజ మొదలగువానిలో నాదర్శజీవియై కొవ్వూరునందు మెలగిన సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వసేవకులు,

పశ్చిమగోదావరిజిల్లావాసులు, నేటికిని స్మరించి, ప్రశంసించు చుందురన్న నాశ్చర్యమేమి ?

కొవ్వూరులో బనిచేయుచున్నప్పుడే, శాస్త్రిగారచట నివసించుచుండిన రిటైర్డు డెప్యూటీ కలెక్టరు శ్రీ శాయన్న పంతులుగారికి మధ్వాచార్యభాష్యమును బాఠములుగా జెప్పు చుండెడివారు. ఇట్లు వీరు భాష్యశాంతి జేయుటయేగాక, త్రిమతభాష్యములందును బాండిత్యమును సంపాదించిరి. జిల్లా విద్యాధికారి ఉద్యోగమును విరమించిన పిదప కొవ్వూరులో నప్పుడు నివసించుచుండిన హరిపేరయ్యశాస్త్రిగారుకూడ వీరి ముఖ్యస్నేహితులలో నొకరు. వీరిద్దఱుకలసి కొన్ని తరగతుల వఱకును, తెనుగున బాఠ్యగ్రంథముల వ్రాసినట్లు శ్రీ కొల చలమ సుబ్బావధానిగారికి తెలియును. శాస్త్రిగారు చనిపో యిన కొలదికాలముననే పేరయ్యశాస్త్రిగారుకూడ మృతి నొందుట తటస్థించి, అప్పటివఱకును నాగ్రంథములు ప్రక టింపఁబడకయుండుటచే తరువాత నాగ్రంథములేమైనవో తెలియవచ్చుటలేదు.

ఉపన్యాసధోరణి.

'ముక్త్యాల నృపుచెంత మోహసంబగు ను
పన్యాసధోరణి వరలఁజేసి'

అని కావ్యాదర్శమున నిష్టదేవతా స్తుతియందు శాస్త్రిగారు ప్రస్తావించుటకుగల కారణ మా యొక్క యుపన్యాసమే జరుగుటకాదు ముక్త్యాలలోనాడు (1926 లో) జరిగిన సన్మానము మిక్కిలి ఘనమైనదనియు, చాల విలువగల

రెండుజతల పట్టువస్త్రములు పోస్టుద్వారా వచ్చుట తనకు జ్ఞప్తియున్నదనియు వారి కుమార్తె చెప్పుచున్నారు. కాని సన్మానములతో నిమిత్తము లేకుండ 'భక్తి' 'సంస్కృత భాషాబోధ' మొదలగుసంశములపై తెనుగునఁనేకాక, సంస్కృతమున గూడ వీరొసగిన యుపన్యాసములు పలుచోట్ల శ్రోతల నానందమయులుగా నొనర్చినట్లు తెలియవచ్చుచున్నది. బందరుకు వీరెప్పుడు విచ్చేసినను, కీ॥ శే॥ హరినాగభూషణము గారు, శ్రీ రాళ్ళభండి సీతారామశాస్త్రిగారు (ప్రస్తుతము విద్యాశంకరస్వామివారు) మొదలగు పుర ప్రముఖులు వెంటనే కరపత్రముల నచ్చొత్తించి, నాగేశ్వరస్వామి ఆలయమున నుపన్యాసము నేర్పాటుచేసి, సగము తెనుగునను, సగము సంస్కృతమునను చెప్పించి యానందించెడివారట. ఉపన్యాసము లెక్కువగా జరిగినచోట్లలో వీరి గురువుగారగు బ్రహ్మానంద తీర్థస్వామి వారి వర్ధంతి ఏటేట జరుగుచోటు, బాపట్ల సమీపమున నున్న మట్టిపూడియను గ్రామము పేర్కొనదగియున్నది. ఆయూరి పెద్ద లిప్పటికిని శాస్త్రిగారి పేరు చెప్పి కంట తడి పెట్టుచుందురు. అట్లే, అనంతవరము (తెనాలి సమీపమున నున్నది) అను గ్రామమునను జాలసార్లు జరిగిన వీరి భాగవతోపన్యాసములును పేరు పొందినవి. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవము బందరులో జరిగినప్పుడు మొదటి యుపన్యాసమిచ్చుటకు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు నియోగింపబడి గొప్పసమర్థతతో గురువులకు భక్త్యంజలి సమర్పించిరి. కొవ్వూరులో నుండగా రాజమహేంద్రవరమున కనేకసార్లు శాస్త్రిగారాహ్వానింపబడి, యుపన్యాసములనిచ్చి యెల్లర

నొసంగిదపరచినట్లు వారి నిర్యాణ సందర్భమున రాజమహేంద్ర వరమున జరిగిన సభలో శ్రీ జయంతి గంగన్నగారు మొదలగు వారు నుడివిరి.

శాస్త్రిగారొకసారి కీ॥ శే॥ కట్టమంచి రామలింగా రెడ్డిగారిని బెజవాడలో చూచినట్లును, వారి సంభాషణాదికముతో మిక్కిలి సంతుష్టులై, రెడ్డిగారు వారిని సత్కరించి తమ కారునిచ్చి పంపినట్లును ఈ సంగతి రెడ్డిగారే తనతో చెప్పినట్లును, శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు వ్రాయుచున్నారు.

## ప్రవర్తన

సుబ్రహ్మణ్యశాస్త్రిగారరుదైన, యపూర్వమై సద్గుణ సంపత్తి కాటపట్టుగా నుండెడి వారనుటలో నతిశయోక్తి యొంతమాత్రమును లేదు. మేనల్లుడు, అల్లుడు, నగు శ్రీ కొలచలమ సుబ్బావధానిగారు తమ 'స్మృతి గీతము'లో నిట్లు వ్రాసిరి.

'ఏ మహామహుఁ దలచుచు నెన్నరాని
నిర్భరానందమున మున్గి నిలచుచుంటి!
ఎవని సంపూర్ణ పురుషుగా నెంచి నాదు
జీవితాదర్శముగ భక్తిఁ జేసికొంటి!

'చెంతనున్నట్టి సేవకు చేతగాని
జేరవచ్చెడి బాంధవ శ్రేణి చేత

గాని పూజ్యత వడయుట కష్టమంద్రు !
అట్లుగాకే సుకృతి పూజ్యు డందఱకును !'

వీరిలో ముఖ్యముగా గమనింప దగియుండిన యంశ ములు, రసజ్ఞత, గుణ గ్రహణపారీణత, నిరాడంబరత, భూత దయా పరత, గురుభక్తి, నిత్య నైమిత్తిక కర్మాచరణాసక్తి, నిరంతరాధ్యాత్మిక, యాముష్మిక చింతన.

కొవ్వూరు కళాశాలలో దాదాపు ముప్పది సంవత్సర ములు అధ్యాపకులుగా నుండియున్న శ్రీ కందుకూరి బసవ రాజుగారీ విధముగ వ్రాయుచున్నారు.

"కీ॥ శే॥ సుబ్రహ్మణ్యశాస్త్రిలవారు, సనాతన నాధునా తన సాహిత్యపద్ధతులను పూర్ణముగా నాకళించుకొనినరసజ్ఞులు. వ్యాకరణాలంకార శాస్త్రములందు కూలంకష పాండిత్యము కలిగియుండి, సువిమర్శజ్ఞానముతో శిష్యులకు బోధించుట యందుత్తమోత్తమోపాధ్యాయులుగా పేరుపొందిరి. నా యదృష్ట వశమున ఆం. గీ. విద్యాపీఠావరణలో నొకయింటిలో నిరుగుపొరుగులను 8 సం॥ పైగా నివసించితిమి.

"ఆ బాల్యప్రవర్ధమానమైన కవితా స్రవంతి, పాండిత్య ప్రతిభచే అగాధమై, అవధాన గ్రంథరచనాదుల మూలమున బహుముఖమై, రసజ్ఞతా పాటవముచే సర్వ జనాస్వాదనీయమై, బహుజనాంతేవాసి సత్వ జీవనాధారమై, పొంగి పొరలెత్తి, ఆధ్యాత్మిక శాంతి సముద్రగామియగు చుండిన చరమ దశగా శాస్త్రిలవారి ఆం. గీ. విద్యా పీఠ మున అధ్యాపక దశను వర్ణింపవచ్చును.

"శాస్త్రులవారి ననేక కారణములచే పండిత సామాన్య వర్గములో లెక్కించుట కవకాశము లేదు. వీరి జీవితాదర్శము శాస్త్రవిజ్ఞానము, ప్రతివాదజయము, ప్రతిష్ఠ, ధన, పదవీ సంపాదన కాదు..............శాస్త్రవిషయములందభిలాష చేతను, సిద్ధాంతవిషయములను తెలిసికొను కోరికతోడను, కొందరుపాధ్యాయులు, పండితులు వచ్చి, తమ సందేశములను వెలిబుచ్చునప్పుడు, శాస్త్రులుగారాభిముఖ్యము చూపక, 'ఏ శాస్త్రములో నెంతకాలము చర్చించినను, ఏ పండితుని సిద్ధాంతమైనను, స్థిరముగా నిలిచియున్నదా ? అల్పప్రజ్ఞను అధికప్రజ్ఞ యధిగమించుటయే ఫలము. నే నీ రోజున చెప్పిన సిద్ధాంతమును రేపు మరొకరు నిరాకరిస్తారు. చదివినకొలది నేడునచ్చిన సిద్ధాంతము రేపు మీకే అసంబద్ధముగా తోచును. కాబట్టి యీ చర్చాసిద్ధాంతములను నమ్మకో కూడదు. అందుకనే నేను దేనిని సిద్ధాంతమని చెప్పను. చెప్పితే ఒప్పుకోను. అంటే సంశయాత్మ కాదుసుమండీ! అన్నీ సిద్ధాంతాలేఅంటాను. అని యుక్తిగా తప్పుకొనేవారు .........తృణీకారమును సహించుట, అల్పజ్ఞతను ప్రకటించుట పండిత విరుద్ధలక్షణమని చెప్పి, పండితులను "బోద్ధారో మత్సర గ్రస్తాః" అని భర్తృహరి వర్ణించినాడు. ఆ లక్షణములు వీరిలో మచ్చునకైనను కానుపించెడివి కావు.

..................................................

"ఇంకొక గొప్పస్వభావము శాస్త్రులవారిలో నిరంతరాచరణలో కనుపించేది. వీధిలోని కడుగుపెట్టినతర్వాత,

అన్నాతురుడుగా యెవరైనా కనుపించితే, పిలిచి వానియవస్థ తెలిసికొని, యింటికి తోడితెచ్చి, అన్నమో, తగినంత బిచ్చమో, మరొక ఆహారపదార్థమో పెట్టి పంపేవారు. గోదావరి రేవులో స్నానంచేసేవారిలో ఆగంతకులు, శ్రోత్రియులునగు బ్రాహ్మణులదగ్గరకుపోయి, ఊరు పేరులడిగి, ఆతిథ్యానికి పిలిచి, తనకు కలిగినంతలోనే మృష్టాన్నము సాదరముగా పెట్టి పంపుట నిత్యకృత్యంగా నడిచేది. తన గృహకృత్యంలో రాగభోగములు లేకుండ, అవసరమైనంతమట్టుకే భోజనాదికములను నడుపుకొనేవారు..............కుటుంబ నిర్వహణలో ఆత్మనిగ్రహము, ఆతిథ్యంలో ఆదరము, దీనదయాళుత్వము, శాస్త్రులవారిలో మూర్తీభవించి ఉండేవి. స్వవిషయంలో లోభిత్వం నిగ్రహమని, పరులవిషయంలో యథాశక్తి దానం పురుషార్థమని ఆయన ప్రబోధం.

"ఆయన నిర్మల నిశ్చల కర్మరుడు. శ్రోత్రియుడు కాని 'బుద్ధిజాడ్య జనితోన్మాదుడు' కాడు. నిత్యనైమిత్తికములలో నలసత్వమెన్నడును చూపలేదు. కాని దేశకాల పాత్రౌచితిని గమనించే చేసేవారు..............గణపతి నవరాత్రోత్సవములలో ఒకనాడొక పండితుడు - ఎవరో సరిగా చెప్పలేను - బ్రహ్మసూత్రములలోని విషయముల నుపన్యసించుచున్నారు. శాస్త్రిలుగారొక మూల నొదిగి కూర్చుండి వినుచున్నారు. సాయం సంధ్యాకాల మాసన్నమయింది. బ్రహ్మజ్ఞాన బోధక మైన ప్రసంగమును వదలిపోలేక, సంధ్యావందన కాలాతిక్రమణ దోషమున కిష్టములేక, కొంత తట

పట పడుతూ 'వెళ్లొస్తాను' అన్నారు. నేను, నా అలవాటు ప్రకారం "ఆ పరవాలేదు లేద్దురు. ప్రాయశ్చిత్తార్ఘ్యం విడిస్తే సరిపోతుందికాదూ!" అన్నాను. ఆయన బుర్ర అలవాటు ప్రకారం చేతితో తడువుకొంటూ, "అబ్బే! మానివేసి ప్రాయశ్చిత్తమేమిటండి!" మరల కొంచె మాలోచించి "సరే! ఆలాగేలేండి, గోవింద, గోవింద!" అని కూర్చుని, పూర్తిగావిని, మరీ వెళ్ళారు. తరువాత నేను "ఏమండీ! శాస్త్రిలుగారు! నాలాగే, మీరూ, ప్రాయశ్చిత్తార్ఘ్యం వదిలినారన్నమాటేనా?" అని హాస్యంగా అన్నాను, స్నేహ బలంకొద్దీ. "ఆహా! మీరు మంచి సలహాయే చెప్పారు. అన్నిపాట్లు, బ్రహ్మజ్ఞానానికేకదా! మహాఫలంకోసం, అల్ప దోషం చేసినా తప్పులేదు. ఆలాగు సదుద్దేశ్యంతో చేసిన దోషానికే ప్రాయశ్చిత్తం" అన్నారు. .........

"ఇట్టి వింకెన్నేని గలవు. నాకాయన సాహచర్యము, మైత్రి, సుమారు ఎనిమిది సంవత్సరములు మాత్రము...... పూర్వపుణ్య పరిపాకము లేనిదే అట్టి సత్సాంగత్యము కలుగదు. ఈ మహనీయుని సాహచర్యానుభవానందములను స్మరించు టకు తగిన యవకాశము నిచ్చిన గ్రంథముద్రణ కర్తలకు నా ధన్యవాదములు."

సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వదాన్యతా విషయమునఁ బేర్కొనఁ దగిన యంశములు రెండు మూడు గలవు. మొదటిది తమకున్న కొలది వసతి సంపాదనలోనే, 500 రూప్యములను గురువర్యులు బ్రహ్మానంద యతీంద్రులు వృద్ధిలోనికి

దెచ్చిన బాపట్ల శ్రీ శంకర విద్యాలయమున కొసంగ నెంచి దానిమీద వచ్చువడ్డీని ప్రతి సంవత్సర మిచ్చుచుఁ జివరకు దానిని మాగాణి భూమి రూపముగాఁ బఠశాలకిచ్చి వైచిరి. రెండవది తమ యభిజన గ్రామమున, మహాలక్ష్మీ దేవికిఁ గల మృద్వేదికను, శిలావేదికగా మార్పఁ బునాదివేయించి దానికి ధన సాహాయ్యముచేసిరి. శ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రిగారి కొక ధార్మిక వ్యవహారమున ధన సాహాయ్యమొనర్చి, వారిచేఁ బాదాభివందన రూపమగు మంగళ చరణ మొనర్పఁబడుటకు హేతువైరి. ఇంకను పండిత సత్కారాము లిట్టివెన్నియో యుదాహరింపఁ దగినవి గలవు.

## గురుభక్తి

శాస్త్రిగారి గురుభక్తి వర్ణనాతీతము. దీనికి కావ్యాదర్శ పీఠికలోని బ్రహ్మానందతీర్థ యతీంద్రులఁగూర్చియు, శ్రీ తిరుపతి వెంకటకవుల గూర్చియు వ్రాయఁబడిన పద్యరత్నములే తార్కాణము. తీర్థ స్వాములవారు కాశిలో సిద్ధి బొందిన నప్పుడు "అవతారమ్ము సమాప్తిఁ జేసితివె బ్రహ్మానంద తీర్థ ప్రభూ !" అనే మకుటంతో వ్రాసిన పద్యములు ఆ సంవత్సరపు ఆంధ్రపత్రిక సంవత్సర సంచికలో 'సిద్ధపురుషులు, బ్రహ్మానంద తీర్థస్వామి' అను శీర్షిక క్రింద వ్రాసిన వ్యాస రాజము, శ్రోతల మనసుల కరుగఁజేయునవిగా నున్నవి. శ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రిగారి నిర్యాణ సందర్భమున వీరు వ్రాసిన పద్యములును నిట్టివే. శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు కొవ్వూరు విచ్చేసినపుడెల్ల తన యనుష్ఠానమును సైతము కట్టిపెట్టి, గురువు

గారి సపర్యలో నిమగ్నులై, వారి భోజనానంతరము తన యనుష్ఠానము నారంభించి, మిక్కిలి ప్రొద్దుపోయి భుజించెడి వారు. ఈ వ్యాసము చివర నొసగబడిన పద్యములలో వెంకట శాస్త్రిగారు వీరి గురుభక్తిని వర్ణించినారు.

## ఉద్యోగ విరమణ: మృతి

ఏబది సంవత్సరముల వయసు వచ్చినప్పటినుండియు శాస్త్రిగారి కేలనో ఉద్యోగము విరమించి తిరిగి బాపట్ల లోని తమ పర్ణశాలకు జేరవలెనని సంకల్పము గలిగెను. ఒక కారణము భాషాసేవ నితోధికముగ సాగించి తెనగు భాషా చరిత్ర యొకటి వ్రాయవలెనని యుండెనని శ్రీ సుబ్బావధానిగారు చెప్పుచున్నారు. తుదకు 1935 సం॥ జులై నెలలో ఒక సంవత్సరకాలము ఉద్యోగమునకు శెలవు పెట్టి, సామానులన్నియు బాపట్లకు పంపి, కుటుంబము, తాను తెనాలి చేరిరి. శాశ్వతముగ ఉద్యోగమును విరమించు తలంపేయున్నదని యాప్తులతో నుడివిరి. ఆగస్టు నెలలో బ్రహ్మానందతీర్థస్వామి వారి వర్ధంతి యుత్సవము పొన్నూరులో జరుగుచుండగా నచట నుపన్యాస మిచ్చుటకై యేగి, జ్వరమురాగా బాపట్లకువచ్చి, అచట వారమురోజులు మాత్రము సామాన్యముగా బాధపడి కొవ్వూరునుండి వచ్చిన సామానుల పేటికలను విప్పకుండగనే ఆప్తులైన వారు దగ్గర లేకుండగనే శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 1935 సం॥ ఆగస్టు 15 వ తేదీ (శ్రావణ బహుళ విదియ) రాత్రి 3 గం॥లకు

భౌతిక దేహము చాలించిరి. అనగా వీరు జీవించినది 51 సం॥లు మాత్రమే.

అప్పుడాంధ్ర దేశములోని యశేషపండితులును, పత్రికలును, సానుభూతిసభలు, సంపాదకీయముల ద్వారా తమయను తాపమును వెలిబుచ్చుచు, "మూర్తీభవించిన సంస్కృత భాషయే మృతినొందినదా ?" అన్నట్లున్నదని చింతిల్లిరి.

1940 సం॥న ఓలేటి వెంకటరామశాస్త్రిగారు యశశ్శేషులైన సందర్భమున శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు "మున్నే దేశికుడొంటివోయెఁ బలుకంబూబోడి సాన్నిధ్యమా బన్నంబారకమున్నె తాను జనె సుబ్రహ్మణ్యధీగణ్యుఁడు..." అనియు మన కవితాకుటుంబ యోగక్షేమాదులు "అవ్వారితోడ జెప్పుమయ్య" అనియు వ్రాసి, కవితాకుటుంబములోని తమ యగ్రజులనుగా సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని కీర్తించియుండిరి.

ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రమువారు, 17-8-1960 తేదీన, అనగా దాదాపు శాస్త్రిగారి 75 జన్మదిన సందర్భమున, "అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ప్రతిభ" అను ప్రసంగమును, 'దివ్యస్మృతి' యను శీర్షిక క్రింద ప్రసారము చేసియున్నారు.

తెనుగు విజ్ఞాన సర్వస్వములో శాస్త్రిగారి అన్న కుమారులు విద్యాప్రవీణ అవ్వారి వాసుదేవశాస్త్రిగారు సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని గురించి వ్రాసిన వ్యాసము గాననగును.

భారత సాహిత్య ఏకాదశమీ వారును, శాస్త్రిగారి యందు భక్త్యాదరములు సవిశేషముగా గలిగిన శ్రీ కేశిరాజు వెంకటనృసింహ అప్పారావుగారును ముక్తేవి లక్ష్మణదాసు గారును, ఈ విధముగా మరల నీ తెనుగు కావ్యాదర్శమునకుం బునర్ముద్రణ ప్రచారావకాశములు కల్పించినందులకు వారి కనేక ధన్యవాదముల నర్పించుకొనుచున్నాము.

శాస్త్రిగారి నిర్యాణ సందర్భమున కొవ్వూరులోను, రాజమహేంద్రవరము లోను జరిగిన సానుభూతి సభలలో శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు శిష్యుని గూర్చి చదివిన పద్యములలో కొన్నింటిని మాత్రమిచట నుదహరించి, యీ వ్యాసము నింతటితో ముగించుచున్నాము.

## కొ వ్వూ రి స భ లో

నను మానసమ్మున కొంకక మూరయిన విన్నాణంపు సద్భక్తితో
గన నేతెంచెడి శిష్యసత్తముడు నిక్కంబైన విజ్ఞాని, యెం
దనృతంబన్నది లేని నాల్కగలవాడాచార్యు డిచ్చోటు, పా
వను డవ్వారికులుండు లేడు మన సుబ్రహ్మణ్యు డెందేగెనో!

పెడికరంబు శిష్యుడని పెంచుకొను టొప్పకపోదు కాని కై
వారము గాదు నా కతడు వారక దేశికువంటివాడె, నే
డీ రహి నోరుజారగలనే అతడే యిట నుండెనేని, ని
స్సారవు దైవ మిట్టొడల సాయము నాకొనరించె నిట్టిదై!

వైశ్వ దేవంబొనర్చి సర్వహితబుద్ధి
బాహ్య శాంతింబొనర్చి స్వభావనమ్ర
మంతరింద్రియ బహిరింద్రియముల పట్ల
జయముగలకోట, అవ్వారి ఛాత్రు బాట!

## రాజమహేంద్రవర సభలో

గోపురి కొజ్జయా కతన 'గో'పురి వారి 'కవారి' సూరిపై
యావిరి పుట్టు టొప్పగు! సహా! యని రాజమహేంద్రపట్టణం
బీవిధి సానుభూతి వెలయింపగనేమికతమ్ము! దీనిచే
స్థావర జంగమాత్మకము సర్వ 'మవారి'కి ప్రేమ భూమియే!

బ్రహ్మణ్యుడైన సుబ్రహ్మణ్యుఁగూర్చి వి
　　చారమందనివాఁడు లేదు జగతి!
అల్పాయువౌఁగాక, యధికాయువౌఁగాక,
　　ఇతఁడు సార్థకజన్ముఁడెల్లగతుల!
కాలమంతయును జక్కని గోష్ఠితో పరో
　　పకృతి పట్టు సవ్యయపరచె నితఁడు!
ప్రాజ్ఞపీనమ్ములన్ పక్షపాతము లేక
　　మంచిత్రోవలు సమ్మతించె నితఁడు!

అస్మదాచార్యకతయేమి? యఖిలవిద్య
లితఁడు స్వయంకృషినె గ్రహించె! సుకవి
యయ్యు కర్మిష్ఠి! యీ సమానాధికరణ
తావిశేషమ్ము కష్టసాధ్యమ్ముగాదె!

# పీఠిక

## (మానవల్లి రామకృష్ణకవిగారిది)

కావ్యాదర్శమను నలంకారశాస్త్రము ప్రాచీనగ్రంథములలోఁ బ్రసిద్ధి వడసినది. దీనిని రచించిన కవి ప్రఖ్యాతుఁడగు దండి, "కవిర్దండీ కవిర్దండీ కవిర్దండీ నసంశయః" అని భోజుని సభలోఁ బ్రశంస గన్నవాఁడని యైతిహ్యము కలదు.

త్రయోఽగ్నయస్త్రయో వేదాస్త్రయో దేవాస్త్రయో గుణాః।
త్రయోదండి ప్రబంధాశ్చ త్రిషు లోకేషు విశ్రుతాః॥

అని ప్రఖ్యాతికలదు. కావ్యాదర్శము, దశకుమారచరితము దండికృతములుగా నెగడుచున్నవి. మూఁడవకృతియేదియని శంకించి కొందఱు ఛందోవిచితియనియు, "పిషల్" అను పాశ్చాత్యమహాశయుఁడు మృచ్ఛకటికమే దండికృతమనియు వ్రాసిరి. ఇతని దేశకాలములేవి? భామహాలంకారమునకంటెఁ గావ్యాదర్శము ప్రాచీనతరమా? అను సందియములు కలుగును. ఇటీవలఁ గొన్నిగ్రన్థములు కేరళదేశమునఁ దాళపత్రముల లభింపఁగా వాని పరిశోధనమునఁ బైయంశములు కొంతవఱకుఁ బరిష్కృతి చెందెను. కావ్యాదర్శమను పేర మఱియొక యలంకారగ్రన్థము కలదు. దానిలో క్షేమేంద్రుని మతముద్ధృతమగుటచే నది యర్వాచీనమనుటకు సందేహము లేదు. మన గ్రన్థము దాండికృతమే యనుటకు నభినవగుప్తాదులగు ప్రామాణికులు యథాహదండీ, "యథా చిరంతనా!" యని యుదాహరించిన శ్లోకములిందుఁ గానవచ్చుచుండుటయే నిదర్శనము. భట్టగోపాలుఁడు కావ్యప్రకాశవ్యాఖ్యారంభమున.

శిక్షయన్న ద్భుతాం రేఖాం కావ్యాదర్శలిపిక్రమే।
మధ్యే మధ్యే మహాచార్యో దణ్డీభిషయతే కవీన్॥

అని చెప్పెను. కావున నిది దండిప్రోక్తమనుట నిస్సంశయము.

దీనిపైఁ బెక్కులు వ్యాఖ్యలు కలవు. అతి ప్రాచీనమయినది వాది ఘంఘాలదేవు నిశ్రుతానుపాలిని. అతఁడు క్రీ. శ. 950 కాలములోనుండెడి

గంగరాజు నాస్థానకవి. తరుణ వాచస్పతి, యామునేయుఁడు, మతికొండ ఱుమ వ్యాఖ్యాతలైరి. తరుణవాచస్పతి "పంచవర్ణాహ్వాయపురే- అష్టవర్ణాహ్వాయాన్నృపాః" అన్న శ్లోక వ్యాఖ్యలో కాంచీపురమనియుఁ బల్లవరాజు అనియుఁ బ్రహేళిక నర్థము చెప్పెను. వాది ఘంఘాలుఁడు నట్లేవివరించెను. దండి కాంచీపుర వాసియనియుఁ బల్లవరాజాశ్రితుఁడనియు నూహింప వచ్చును.

శ్రవణబెళగుళమను జైనమఠములోని శిలాశాసనముల శ్రీవర్ధదేవుం డను జైనాచార్యుని ప్రశస్తిలో (శాసనముసంఖ్య 54-క్రీ-శ. 1128) య ఏవముపశ్లోకితో దండినా—

> నహోన్నః కన్యాం జటాగ్రేణ బభారపరమేశ్వరః ।
> శ్రీవర్ధ దేవ సంధత్సే జిహ్వాగ్రేణ సరస్వతీమ్॥

అని లిఖింపఁబడియున్నది. శ్రీవర్ధదేవుఁడే వైద్య వ్యాకరణాదులఁ బ్రసిద్ధిగాంచిన పూజ్యపాదుఁడు. అతఁడు క్రీ. శ. 650 కాలమున నుండెను. దండియు నప్పటివాఁడని తెలుసు. భోజదేవుఁడు శృంగారప్రకాశముఁ దొమ్మిదవ ప్రకాశమున "దండినో ధనంజయస్య వాద్విసంధానం" అని కథాద్వయ సంవిధానమున కుదాహరణముగాఁ జెప్పి ద్విసంధానే.

> ఉదారమహిమా రామః ప్రజానాం హర్షవర్ధనః ।
> ధర్మప్రభవ ఇత్యాసీత్ ఖ్యాతో భరత పూర్వజః ॥

అని యుదాహరించెను. అది ధనంజయద్విసంధానముఁ గానరా కుండుటచే దండికృతమగు ద్విసంధానమున నుండునేమోయని సందేహము కలుగుచున్నది. ఈ శ్లోకమున ముద్రాలంకార లక్షితముగా హర్షవర్ధనుని పేరుగలదు. దండి యతని యాస్థానమునకుఁ బోయియుండవచ్చును. దండి మూడవగ్రంథము ద్విసంధానమను రాఘవపాండవీయమని యూహింపఁ దగు. అతని దశకుమారచరిత్రము పూర్వపీఠికయనియు నుత్తరపీఠిక యనియు రెండుభాగములై యొక్కొక్కటిలో నాశ్వాసవిభాగముకలదై వచనరూపముగా నున్నది. ప్రాచీనవ్యాఖ్యలన్నియు నుత్తర పీఠికపై మాత్రమే కలవు. పూర్వ పీఠికలు పెక్కు తెలుఁగుల నాశ్వాససంఖ్య మాత్రమే కాక కథా సరణినిన్ భేదించుచు బహు కవి కృతములగు- భిన్నగ్రన్థములవలెఁ గాఁ

వచ్చుచున్నవి. కేతన యను సాంధ్రకవి తెనిఁగించిన దశకుమారచరిత్రమును సంస్కృతములోఁ బోల్పఁ బూర్వ పీఠికలలో నొక్కపాఠము మూఁడాశ్వాసములవఱకు మక్కికి మక్కి యనువాదమగుచున్నది. ఉత్తర పీఠికలో కథామాత్ర స్వారస్య ప్రధానముగాఁ దెనిఁగింపఁబడియె. కర్ణాట కానువాదమునఁ బూర్వపీఠికా కథ లబ్ధ గ్రంథభాగములకు భిన్నముగా నున్నది. ఉత్తర పీఠికమూలమునకు సరియైనదే. మఱియుఁ బూర్వోత్తర పీఠికలలో శైలి భేదిల్లుచున్నది. ఉత్తర పీఠిక ప్రౌఢతరము. కావునఁ బూర్వ భాగము దండికృతము కాదు. ఒకపాఠము కేతన దశకుమార చరిత్రమును జూచి పూర్వ పీఠిక యెవ్వరో సంస్కృతమున లిఖియించిరని తోఁచును. లాక్షణికు లెవ్వరు దీనిలోనుండి యుదాహరింపరైరి.

ఇటీవల నవంతి సుందరీకథయనియు నవంతి సుందరీకథాసారమనియు రెండుగ్రంథములు కేరళదేశమున లభించినవి. వానిఁ బరిశోధింపఁగా నవంతీసుందరీకథయే దండిప్రోక్తమగు నాఖ్యాయికయనియు దానికి సంక్షేప రూపముగాఁ దత్సారము నెవ్వరో రచించిరనియు దండి కాంచీపురాధీశ్వరు లగు పల్లవరాజులు యొద్ద నుండెననియుఁ దేలినది.

> అస్త్యానన్దపురం నామ ప్రవేశే పశ్చిమోత్తరే ఆర్యదేశ శిఖారత్నం తత్రాసన్ బహవో ద్విజాః తతో౽భి విస్సృతా కాచిత్కౌశిక బ్రహ్మసన్తతిః బ్రహ్మలోకాది వాయాస్తి పుణ్యతీర్థా సరస్వతీ నాసిక్యభూమావాత్సక్యాన్మాలదేవ నివేశితామ్ ప్రాప్యాచలపురం నామపురీ మధివసత్యౌతస్యాం నారాయణస్వామినామ్నా నారాయణో దరాత్ దామోదర ఇతి శ్రీమానాదిదేవ ఇవాభవత్ సమేధావీకవిర్విద్వాన్నారవిః ప్రభవోగిరామ్ అనురుధ్యాకరోత్మైత్రీం నరేన్ద్రైర్విష్ణువర్ధనైః॥

> ఇతిశ్రుత్వా మహీపాల స్తదాలోకనలోలుపః అనేక శ్రీముఖాకృష్ట మకరోదముమాత్మసాత్ నృపనిర్బంధనిర్దిష్టే ప్రకృష్టవిభవే గృహే వహతః. పైతృకీంవృత్తింతస్యాసీ త్తనయత్రయమ్. మనోరథాహ్వయ స్తేషాంమధ్య మోజంశివర్ధనః తత స్తనూజాశ్చత్వారః సప్తి శ్రేవా ఇవా భవన్ శ్రీవీరదత్త ఇత్యేషా ముత్తమస్తత్త్వవేదినామ్ యవీ

యానస్య చ శ్లాఘ్యా గౌరీనామాభవత్ప్రియా తతః కథంచిత్తాం గౌరీద్విజాధిపశిఖామణేః కుమారం దణ్డినామానం వ్యక్తశక్తిమజీజనత్ స బాల ఏవ మాత్రా చ పిత్రా చాపి వ్యయుజ్యత అయుజ్యత గిరీశస్యాసరస్వత్యా శ్రుతేన చ స విశ్రియే పురే తస్మిన్ పరచక్రోపరోధతః సచచారు సుఖాచారః సర్వాయుర్వీయుదారధీః అథాత్రైమేవ్వధీయానః శాస్త్రేషు చక్షుశ్శ్రమః పశ్యన్ పుణ్యాన్యరణ్యాని వ్యవసద్దినసాన్ బహూన్ మిత్రాణి మాతృదత్తాద్యాః కేంశేభ్యోద్విజోత్తమాః॥ భారవిని బిలిపించినవాఁడు కాంచీపురాధీశుఁడగు సింహవిష్ణువు.

పై శ్లోకములవలన దండి భారవికి మునిమనుమఁడనియు నతఁడు సింహవిష్ణువు యాస్థానమునందుండెననియు నందుచే దండి నరసింహవర్మ కాలమునందుండియుండుట యసంభవము కాదనియు స్ఫురించుచున్నది. అవంతిసుందరీకథలోని కథాంశము దశకుమారచరిత్రములోని కథాభాగమే. శైలి యతిరమణీయమై ప్రౌఢమై బాణాదికవుల రచనాగాంభీర్యము ననుకరించియున్నది. కావున దశకుమారచరిత్రమే గవిక్రుత నామధేయమవంతిసుందరీకథయనియు ప్రసిద్ధ దశకుమారచరిత్ర పూర్వపీఠికయే యిప్పుడు లబ్ధమగు నవంతీసుందరీకథాభాగము కానోపుననియుఁ దద్గ్రంథపఠనమువలనఁ దేలినది. దండి తండ్రి వీరదత్తుఁడు, తల్లి గౌరి, మిత్రులు రామశర్మ, మాతృదత్తుఁడు భజనానందుఁడు మొదలగువారు. కాంచీపురము చాళుక్యరాజగు విక్రమాదిత్యునిచేఁ బండ్రెండు సంవత్సరములు ముట్టడింపఁబడఁగా దండి తత్కాలమునఁ గేరళాది నానాదేశములు సంచరించి కాంచీపురనిరోధము గడచిన పిదప మగిడివచ్చెననియు దానిలోనే కలదు. కావున నితఁడు క్రీ. శ. 630—40 ప్రాంతములోఁ గాంచీపురమున నుండెననుట నిక్కము. ఇతని పూర్వులుత్తరదేశమున నానందపురవాసులయ్యుఁ గ్రమముగా దక్షిణదేశవాసము వీరికలవడియె. దండి రచించిన మూఁడు గ్రంథములు దశకుమారచరితమను నవంతిసుందరీకథయుఁ గావ్యాదర్శము, ద్విసంధానమును గాఁ బర్యవసానము దేలును. అనామయ స్తోత్రమను శివస్తుతి యితఁడు రచించెను. వైయాకరణులితని స్మరించుటచే నితఁడు మహాభాష్యమునకు వ్యాఖ్య వ్రాసియుండునేమోయని సందేహింపవలసియున్నది.

చిరంతనాలంకారికులలో దండియు నొక్కఁడనుటకు వివాదములేదు. భామహుఁడను గ్రంథకారుఁడితనికిఁ బ్రాచీనుఁడో లేక సమకాలికుఁడో సుప్రసిద్ధుఁడొకఁడున్నవాఁడు. అతఁడు కావ్యాలంకారమను నొకగ్రంథము రచించెను. దానిలోని కొన్ని యంశముల కిందు ఖండనము కలదు. అతిప్రాచీన వ్యాఖ్యాతయగు వాదిఘంఘాలదేవుఁడును దండియాఖ్యాయికాశబ్దనిర్వచనమున కవతారిక వ్రాయుచు భస్మహామతమాక్షిపతియని భామహునిఁ బూర్వునిగా నూహించెను. భామహుఁడు రామశర్మకృతమగు నచ్యుతోత్తరములోనుండి దోషము లుద్ఘాటించెను. రామశర్మ దండి మిత్త్రుఁడగు తన్నామధేయుఁ డగునేమోయని శంకింపవలసి యున్నది. గౌతమసూత్ర భాష్యకారుఁడగు మస్కరి తాను భామహుని శిష్యుఁడని చెప్పకొనెను. భామహుని కావ్యాలంకారమునఁ జతుర్థపరిచ్ఛేదమున దిఙ్నాగధర్మకీర్తుల మతములు నిరసింపఁబడుటచే భామహుఁడు ధర్మకీర్తితో సమకాలికుఁడైనఁగావలయు. ధర్మకీర్తి క్రీ. శ. 620 లో నుండినందున ధర్మకీర్తి భామహదండి భాణభట్టనారాయణాదులు సమకాలికులని యూహింపఁదగు.

దండి పూర్వాచార్యుల గ్రన్థముల సంగ్రహించెనని చెప్పచున్నాఁడు. వ్యాఖ్యాతలు వారు కాశ్యపబ్రహ్మనంది బ్రహ్మదత్త ప్రభృతులని వివరించిరి. కాశ్యపుఁడెవ్వఁడో శిల్పసంగీత నాట్యవైద్యజ్యోతిష ధనుః కావ్యాలంకారాదుల గ్రన్థములు రచించెను. వానిలో శిల్పము మాత్రమే కానవచ్చుచున్నది. దానికే యంశుమద్భేదమని నామాంతరము. బ్రహ్మనంది వ్యాసుల బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యాత. ఆ వ్యాఖ్యాన మిప్పుడు లభింపదయ్యె. బ్రహ్మదత్తుఁడును మీమాంసావేదాంత గ్రన్థకారుఁడు. వీరల కృతు లుత్సన్నములగుటచేఁ గావ్యాలంకారమున వీరిమతములేవో కనుఁగొన సాధ్యము కాదు.

మనకు లభించు కావ్యాలంకారగ్రన్థములలో నగ్నిపురాణభాగము కావ్యాదర్శముకంటె 'ప్రాచీనతరము' భరతుని నాట్యశాస్త్రమున నలంకారశాస్త్రములోని యంశములు పెక్కులు గలవు.

అలంకారశాస్త్రమున సామాన్యముగా 1. కావ్యస్వరూపము, 2. వృత్తిలక్షణము, 3. గుణదోషప్రకరణము, 4. శబ్దార్థాలంకార వివేచనము, 5. రస

భావనిరూపణము, 6. నాయక నాయికా గుణావస్థానిర్ణయము, 7. దృశ్య శ్రవ్య కావ్యభేదము, 8. రూపకపరిభాషాంగప్రశంస, 9. కథాశరీర సంవిధానము, 10. కవిప్రేక్షక నటధర్మ సముదాయాది ప్రకీర్ణక విమర్శము, అనునంశములు విశదీకరింపఁబడు. అలంకారశాస్త్రములు సాధారణముగా రెండుతెగల నొప్పారు. మొదటి నాలుగు విషయములు నొక్క తెగగాను తక్కినవి రెండవ తెగగాను శాస్త్రకారులు గ్రహించిరి. భామహాలంకారము (620 క్రీ. శ.) దండికావ్యాదర్శము (640 క్రీ. శ.) రుద్రటుని కావ్యాలంకారము (700) వామనుని కావ్యాలంకారసూత్రవృత్తి (800) ఆనందవర్ధనుని ధ్వన్యాలోకము (840) ఉద్భటుని కావ్యాలంకార సంగ్రహము (840) వాగ్భటుని కావ్యాలంకారము (900) రాజశేఖరుని కావ్యమీమాంస (930) మహిమభట్టు వ్యక్తివివేకము (1000) భట్టనాయకుని హృదయదర్పణము (950) కుంతలకుని వక్రోక్తిజీవితము (900) భోజదేవుని సరస్వతీకంఠాభరణము (1050) మమ్మటుని కావ్యప్రకాశము (1150) రుయ్యకుని సహృదయలీలయు అలంకారసూత్రములు (1180) ను మంఖుకు యలంకారసర్వస్వమును సాహిత్యమీమాంసయు (1180) హేమచంద్రుని కావ్యానుశాసనము (1150) విద్యానాథుని ప్రతాపరుద్రీయము (1320) విద్యాధరుని యేకావళియు (1350) విశ్వనాథుని సాహిత్యదర్పణమును (1.50) అలంకారసుధానిధి (1380) చమత్కారచంద్రిక (1350) మొదలుగాఁగలవి మొదటితెగకుఁ జేరినవి. రెండవతెగయగు రసభావనిరూపణ ప్రముఖగ్రంథజాలములో భరతుని నాట్యశాస్త్రము (అధ్యాయములు 6, 7, 18, 19, 20, 21, 22, 23, 24) రుద్రుని శృంగారతిలకము (700) తౌతాచార్యుని కావ్యకౌతుకము (970) అభినవగుప్తుని యభినవభారతియు, నాట్యలోచనము (1000) భోజదేవుని శృంగారప్రకాశము (1060) శారదాతనయుని భావప్రకాశము (1150) ధనంజయుని దశరూపకము (1000) జగద్ధరుని నాట్యసర్వస్వము, రామచంద్రుని నాట్యదర్పణము (1180) త్రిలోచనుని నాట్యలోచనము, రసార్ణవసుధాకరము (1350) కుంభకర్ణుని సంగీతమీమాంస (రసపరిచ్ఛేదము) 1150, రసవివేకము, రాజరాజీయము రసమీమాంస రసకల్పద్రుమము, శృంగారమంజరి, మొదలగునవి చేరియున్నవి.

వీనిలో భామహదండ్యానందవర్ధన భట్టనాయక కుంతలక మహిమ భట్ట భోజులు మొదటితెగలోను, భరతనందిరుద్రాభినవగుప్తభోజాదులు రెండవతెగలోను నూతనప్రస్థానములు స్థాపించి తక్కినవారికి మార్గదర్శులైరి. పైవిభాగమునఁ గొందఱు గ్రంథముల రెండుతెగలయంశములును గలసియో యానుషంగికముగ సూచింపఁబడియో యుండును. కావ్యాదర్శమునఁ గావ్యస్వరూపమునను నలంకారవివేచనమునను దండి చాలశ్రమించి సూక్ష్మభేదముల నెలకొల్పె. అయినను దదలంకారభేదజాత మంతయుఁ దర్కశాస్త్రపరిష్కృతముగాక చాలకాలముండఁగా విద్యానాథాదుల కాలమున కనఁగా శిరోమణి భట్టాదుల మణిదీధితి విజృంభణమునకుఁ బిదప సకలశాస్త్రములకు వలెనే దీనికిని న్యాయశాస్త్రనికషోపలంబున నొరయికతగిలి ప్రాచీనులనిర్వచనములన్నియుఁ బునఃపరిశోధితములై రసగంగాధర సాహిత్య రత్నాకర కావ్యదర్పణసాహిత్యసారాది నవీనగ్రంథముఖముల నుత్తేజితములై వెలుఁగుచున్నవి. అయినను మాయభిప్రాయమున నర్వాచీనగ్రంథములు నిరుక్తిపరిష్కారసమర్థములై సూక్ష్మాంశపరిబోధకములగుట సత్యమైనను సర్వాంశప్రౌఢిమమునఁ బ్రాచీనకృతులకు సరిగా నేరవు. కావ్యాదర్శాదులు కావ్యప్రకాశరసగంగాధరాదులకుఁ దీసిపోవచ్చును. గాని ప్రౌఢిమగాంభీర్యముల మించుచుండును. ఈయంశము కావ్యప్రకాశకారాదులకుఁ బూర్వుఁడగు వాదిఘంఘాలుని కావ్యాదర్శవ్యాఖ్యచే విశదమగును.

ఈ గ్రంథము ప్రౌఢగంభీరార్థకమగుటచేతను దెనుఁగున నలంకారశాస్త్రమున నిర్దుష్ట గ్రంథములు లేకుంటచేతను దెనిఁగించుట మిక్కిలి కష్టము. కావ్యాలంకారచూడామణిలో దండిలక్షణశ్లోకములు పెక్కులాంధ్రీకరింపఁబడియె వానిఁబరిశీలించినచో విశ్వకోట పెద్దన్నకు సంస్కృతభాషాపరిచయము లేదని కాని యలంకారశాస్త్రగ్రంథముతెఁ డెఱుఁగఁడని కాని చెప్పవలసి వచ్చును. భట్టుమూర్తి నరసభూపాలీయము నిట్టిదే. తర్కశాస్త్రవాసనలేని వీరు మహాగ్రంథములఁ దెనిఁగింప దొరకొనుట హాస్యభాజనమ్మగుటయే కాక భామహునగౌరవము ప్రతిపాదించిరి ధ్వనితత్త్వమును గవిలోకమునకు మొదట ప్రసాదించిన యానందవర్ధనునట్టి వాని గురించి జయంతుఁడు న్యాయవార్తికమున.

(2)

యమన్యః పండితమ్మన్యః ప్రపేదే కంచన ధ్వనిమ్
విధేర్నిషేధావగతిర్విధిబుద్ధిర్నిషేధతః॥

మానాంతరపరిచ్ఛేద్య వస్తురూపోపదేశినామ్
శబ్దానామేవసామర్థ్యం తత్రతత్రతథాతథా॥

అథవా నేదృశీచర్చా కవిభిః సహశోభతే
విద్వాంసోఽపివిముహ్యంతి వాక్యార్థగహనేఽధ్వని॥

అని పండితంమన్యుఁడనియు నశాస్త్రజ్ఞుఁడనియు దూషించెను. ఈ వాక్ప్రహారము కేవల మానందవర్ధనునకే కాక ధ్వనివాదమునకుఁ బరమాచార్యుఁడగు భర్తృహరికిఁ గూడఁ దగులుచున్నది. ఇట్లుండ భట్టుమూర్తి ప్రభృతులేమగుదురు? ఈ గ్రన్థమును యథామూలముగాఁ దెనిగించి పరిభాషలను వాక్యార్థవిశేషములను విపులమగు వ్యాఖ్యవ్రాయుటచే నాంధ్రులకు మూలగ్రన్థప్రౌఢిమము తెలియునగుఁగాని స్వమనఃప్రవృత్తికి దగినట్లు తెనిఁగించుట యంత లోకోపకారకము కానేరదు. బ్రహ్మశ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిలవారు దీని నతిశ్రమచేసి యథామూలముగాఁ దెనిఁగించిరనుట నిస్సంశయము. తెనిఁగింప నసాధ్యములగు సభంగశ్లేషముల నితఁడు శ్రమించి తత్తుల్యముగా నాంధ్రమున వాక్యజాలము కల్పించి లక్షణములకుదాహరణము లిచ్చిరి. అట్టి చోటులు వీరి పాండిత్యప్రకర్షమును జాటుచున్నవి. భాషలో నలంకారగ్రన్థములులేని న్యూనత వీరు కొంతవఱకుఁ దొలఁగించినందులకు నెల్లరు కృతజ్ఞులుగాదగు. ఇది శాస్త్రగ్రంథము కావున వ్యాఖ్యానసాపేక్షమనుట యచ్చెరువుకాదు. ఇది పాఠ్యగ్రన్థకోటిలో నిర్ణీతమగునేని కాలక్రమమున సువ్యాఖ్యలు దీనిపై వెడలుననుట దురభిలాషము కాజాలదు.

# అభిప్రాయాలు

బ్ర॥ శ్రీ॥ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రులుగారాంధ్రీకరించిన కావ్యాదర్శమును జదువు భాగ్యము నాకు లభించినది. మహాకవి దండిరచించిన కావ్యాదర్శమును వీరు చక్కఁగాఁ దెనిఁగించిరి. భాషాంతరీకరణమున మూలనమునఁగల రసము పోషింపఁబడినది. పద్యములు హృద్యములుగ నున్నవి. శైలి సలక్షణము. సులభము నమటుస్వభావోక్తియే గాని యతిశయోక్తి కాదని నావిశ్వాసము. వీరిట్టి పరిశ్రమ మొనరించి యాంధ్రభాషకు మహోపకార మొనరించిరి. అందందు మూలమునకు బ్రవర్తనమునకుఁ గల సంబంధమును బరికించితిని. తృప్తినొందితిని. ఈ గ్రన్థము పండితాదృతింగాంచి విద్యార్థులకు మహోపకార మొనరించి కృతికర్తకు శాశ్వత యశస్సును సంపాదింపఁ గలదని నమ్ముచున్నాఁడను. వీరింక నిట్టి యలంకార గ్రన్థములఁ బరివర్తన మొనరించి యాంధ్రభాషాజనని నలంకరింతురుగాక యని వారిని కోరుచున్నాడను. సాహిత్యదర్పణమును గూడ నచిరకాలమునఁ దెనిఁగింతురనియు నేనాశించుచున్నాఁడను. ఈ గ్రంథమును బ్రాచ్యపరీక్షలకుఁ బఠనీయగ్రంథముగా నునిచి గ్రంథకర్తకుఁ బ్రోత్సాహము కలిగింతురని నమ్ముచున్నాడను.

కడప<br>2-4-29

ఇట్లు విన్నవించు సుకవిజనవిధేయుఁడు<br>**జనమంచి శేషాద్రిశర్మ.**

శ్రీ శ్రీ శ్రీ

బ్ర॥ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మృదుమధుర శైలితో నాంధ్రీకరించినారు. నేను మూలముతో సరిమాచుచుఁ గొంతభాగము చదివితిని. తెనిఁగింపు చక్కగానున్నది. ఇది పాఠశాలలలో జదువు విద్యార్థులకును, కవులకును, సులభగ్రాహ్యమై మిక్కిలి యుపయోగించును.

**శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.**

# విషయసూచిక

## ద్వితీయపరిచ్ఛేదము

## తృతీయపరిచ్ఛేదము

### శబ్దాలంకారములు

## ఆంధ్రీకరణము

ఈకావ్యాదర్శమును దెనిగించు నేను దండిగభీరాశయవ్యక్తికి లోపము వాటిల్లునను భయమున నాంధ్రీకరణమైకల్యము నేఁ బరిగణింపక దండిమాటలనే పలుచోట్ల వాడుకొనినాను. దుష్కరశబ్దచిత్రములలో దండిపద్యము లయ్యైలక్ష్యములుగాఁ దెనిగింప శక్యములుగాని కతమున సొంతకవనములల్లినాను. దండిమహాకవి కబ్బమును దెనిగింపఁ సాహసించిన నాయీచాపలమును అపచారమును క్షమింపఁ బండితుల నభ్యర్థించుచు నతిశతము నర్పించుకొనుచున్నాను.

## గ్రన్థవిషయములు

ఈకావ్యాదర్శము మొదటిపరిచ్ఛేదములోఁ బ్రధానముగా వివరింపఁబడినవి గుణములు.

**గుణములు** భామహాదులివి మూఁడందురు. భోజాదులివి యిరువదినాల్గందురు. వామనాదులవలె దండియుఁ బది

యనె. వామనుఁ డర్థగతములుగా శబ్దగతములుగాఁ జూపె. దండి కొన్నిటినర్థగములను గొన్నిటిని శబ్ద గములను నొడివె.

అ—ప్రసాదము, ఔదార్యము, కాంతి, మాధు ర్యము, అర్థవ్యక్తి. శ - శ్లేషసమతాసౌకుమా ర్యౌజస్సమాధి మాధుర్యార్థవ్యక్తులు.

అర్థాలంకారాలు — ద్వితీయపరిచ్ఛేదమందలివి యర్థాలఙ్కారములు దండిమతమున నివి (35). "తేచాద్యాపి వికల్ప్యంతే కస్తాన్ కార్త్స్న్యేన వక్ష్యతి - భేదములు పరిశీలించినకొలదిఁ బొడము. ఇన్ని యని చెప్పలేము. అనెను.

యమకాలు — తృతీయపరిచ్ఛేదమున — మొదట యమకములను లాతిశబ్దచిత్రములను జూపి శబ్దాలంకారము అపారము లనియె.

ప్రహేళికలు — పిదపఁ జూపిన ప్రహేళికలు (16). అర్థము దెలియరామిని (14) ప్రహేళికలను దుష్టములనె. భోజాదులు వీనిని వివరించిరి. ఇవి చమత్కారపుఁ బద్యములతోఁ గాలయాపనము సేయువారికిని బదుగురున్నచో రహస్యము మాటాడఁ గొనువారికిని ఇవి యెఱుఁగని యితరులను వ్యామోహపెట్టుచు నర్మాలాపములు సేయు వారికిని బనికివచ్చు నుడికారఁపు సొంపుల

లోలురై యాదరించెడి సరసులైన నైశ్వర్య వంతులు గల్గి దేశము సంపన్నమై యుండునప్పు డిట్లు వాఙ్మయము రసికానందదమై పెక్కు తెఱంగులఁ బెరుగుట సాజము. "రాజీవనేత్ర నీ రాజ్యమెక్కడనన్న" మొదలయిన తెల్గు పద్యము లీ తెగకుఁ జెందినవే.

దోషములు

చివర దోషములను బదిగా సంగ్రహించె. ఇవి ప్రతాపరుద్రీయమునాటికి (59) యై పద గతములు, వాక్యగతములు, అర్థగతములుగా వేఱుసేయఁబడె. దండిపై (6) అర్థదోషములును (4) వాక్యదోషములునయ్యెడి. దండి దోష ములు కొన్ని సందర్భములలో గుణములగు నని యుదాహరించె. ఇది యుపయుక్తమైన యంశము.

విధేయుడు

అప్పారి సుబ్రహ్మణ్యశాస్త్రి

# ఇష్టదేవతా స్తుతి

క. శ్రీవిలసత్సకలకలా
శ్రీవిద్యాహృద్య భావసిద్ధవివేక
శ్రీవిషయానందకలా
శ్రీవిమలానందభూమ శ్రీఁనొసగుఁతన్.

సీ. లష్కరునగరి కెల్లప్పసత్రంబున
షష్ట్యవధానంబు సంతరించి
గద్వాలనగరున విద్వత్సభనశీతి
లేఖినీకవన మల్లింపఁజేసి
ఆత్మకూరునగరి నాశుకవిత్వ లీ
లాస్ఫూర్తి రాజవాల్లభ్య మొసఁగి
ముక్త్యాలనృపు చెంత మోహనంబైనయు
పన్యాసధోరణి వఱలఁజేసి

తే. గీ. తగఁగఁబలుచోట్ల నష్టావధానసభల
నాశుధారాకవిత్వ మహత్త్వమిచ్చి
నన్ను మనుచు మాతల్లి మనఃప్రమోద
దానసంతానవల్లి మతల్లిఁగొల్తు.

# గురుస్తుతి

సీ. పరిపూర్ణవిజ్ఞాన గరిమకుఁ గాణాచి
యమనియమాదుల కాటపట్టు
చిరతపోబల సమార్జిత సమాధికిఁ దావు
వైరాగ్యశక్తికిఁ బట్టుకొమ్మ
విలసిలు యోగ సిద్ధులకునుపఘ్నంబు
సర్వజ్ఞతకును విశ్రాంతిగృహము
సమధికజ్ఞాననిష్ఠకునుఁ బెట్టిన పేరు
సద్భక్తిహారి వశ్యమునకిరవు

గీ. మానముదాత్తవిభూతికి మందిరంబు
బ్రహ్మవర్చసమునకుఁ దార్కాణమగుచుఁ
జెలఁగి బాపట్లపురికి వేంచేసియున్న
దివ్యమహిము బ్రహ్మానందతీర్థుఁదలఁతు.

తే. గీ. ఎందుఁబరిపూర్ణ పరసుఖానందనాథ
దివ్యబోధామృతలహరిఁ దేలుచుండు
బోధగురుఁ బ్రకాశానందనాథపాదుఁ
బ్రస్తుతించెద వేంకటరమణబుధుని॥

సీ. అష్టావధాన శతావధానముల కాం
ధ్రమునఁ బూర్ణప్రచారంబు నొసఁగి
విషమపరీక్షా వివేచనాప్రౌఢులౌ
సంస్థానపతుల సంశయముదిద్ది

భిన్నభిన్నరుచి ప్రభేదముల్ గల్గు లో
కులనెల్ల నొక్కమేకున బిగించి
అన్యుల యనుపమయశము సహింపని
దోషైకదృక్కులం దూలనాడి

తే. గీ. అఖిలదిక్కుల జయమై జయంతి కావి
జృంభణమున మున్ముందుం గై సేసియుంచు
పూర్వపుణ్యోల్ల సత్కృతి పూర్తిం బొల్చు
గురులం దిరుపతి వేంకటేశ్వరులం గొలుతు.

సీ. ఆంధ్రదేశావస్థితాశేష భూమిభృ
త్కోటీరమణిఘృణిం గూడియాడి
కవితాకృతానేక గణనీయపూర్వపు
ణ్యాతిశయంబుల జోతలంది
గోదావరీతీర కూలంకషోదార
పాండితీప్రథకు జీవంబువోసి
కమనీయరచనా ప్రకార కారణ కీర్తి
సీమ న్నిలీలాస్య శేషమరసి

తే. గీ. సరసరపుష్టి నెవ్వారి సత్ప్రబంధ
బంధబంధుర కవితాప్రవాహ మొలయు,
వారి శతవధానాచార్యవరులం బరు
గురులం దిరుపతి వెంకటేశ్వరుల గొలుతు.

శ్రీ

# తెలుఁగు కావ్యాదర్శము

## ప్రథమ పరిచ్ఛేదము

### సరస్వతీస్తుతి.

కం॥ శ్రీనెగడుచుండి చతురా
స్యాననవనజవనహంసియై బహిరంత
స్థానసితయౌ సరస్వతి
మానక రమియించుఁగాత మచ్చిత్తమునన్.

### పీఠిక

తే॥గీ॥ శాస్త్రములఁ బురాతనముల సంగ్రహించి
కబ్బములలోనఁ గల ప్రయోగము లెఱింగి
యస్మదీయ సమర్థత కనుగుణముగ
సంతరించెదఁ గావ్యలక్షణము నేను. 2

కం. శిష్టులగువారిచే నను
శిష్టములగు నుడులుఁ దదవశిష్టోక్తులునుం
బుష్టిగఁ గలిమింజేసియె
సృష్టినిటుల లోకయాత్ర చెల్లుచునుండున్. 3

తే॥గీ॥ అంధతమసంబు లోకత్రయంబునందు
నావరించియె యుండెడి నన్నియెడల

జగమునందెల్ల వ్యాపించి శబ్దమనెడి
పేరుగలిగిన వెలుఁగు దీపింపదేని. 4

తే॥ ధరణివాఙ్మయమనెడి యాదర్శ మొంది
యాదిరాజవరేణ్య విఖ్యాతిబింబ
మప్పురుషుల యసాన్నిధ్యమందు సైత
మంతమందకయుండు స్వయముగఁ గనుము. 5

తే॥ బాగుగఁ బ్రయుక్తమైన శబ్దంబు కామ
దోగ్ధ్రియౌ గోవనుచుఁ బల్కుదురు విబుధులు
తప్పుగఁ బ్రయుక్తమైన శబ్దము "ప్రయోక్తృ
పశు"వనెడి మాటఁ జెల్పుఁ బ్రపంచమునకు. 6

తే॥ కాన యెట్లుగనైనను గావ్యదోష
మల్పమేని నుపేక్షించు టనుచితంబు
చక్కని శరీరమేనియు నొక్క శ్విత్ర
ముండినన్ దుర్భగత్వంబు నొందుచుండు. 7

కం॥ ఇది దోషం బిది గుణమను
నది మనుజుఁడెఱుంగఁ గలుగునా? శాస్త్రములం
జదువవిచో; రూపంబుల
భిదలెఱుఁగఁగ నంధుఁడుం బ్రవీణుండగునే? 8

తే॥గీ॥ కానప్రజలకు వ్యుత్పత్తిగలుగఁగోరి
చిత్రమార్గములగు సుభాషితముల రచ
నావిధినిబంధనములవొనర్చినారు
వివిధకావ్యరహస్యకోవిదులు బుధులు. 9

## కావ్యలక్షణము

కం॥ వారలు గావ్యమ్ములకు శ
రీరంబిదియనుచుఁ దెలిపిరి యుపస్కృతులన్
బేరుకొనిరి తనువగుఁ బద
వారం బిష్టార్థముల వ్యవచ్ఛిన్నంబై. 10

## కావ్యభేదములు

తే॥గీ॥ కావ్యమిది పద్యమనఁగను గద్యమనఁగ
మిశ్రమనఁగను ద్రివిధమై మెలఁగుచుండుఁ
బద్యమున నాల్గుపాదముల్ పరఁగుచుండు
వృత్తమన జాతియన నది ద్వివిధమగును. 11

*తే॥గీ॥ ఆ విశేషంబులెల్ల ఛందోవిచితియ
నంగఁ దగు గ్రంథమందుఁ జూపంగఁబడియెఁ
జాల గంభీరమౌ కావ్యజలధినీదఁ
దలచువారి కవ్విద్య పోతమగుచుండు 12

---

* పాఠాంతరము - ఆ విశేషంబులెల్ల ఛందోవిచితిని
ప్రోక్తమయ్యె నిదర్శనపూర్వకముగ

ఛందోవిచితియను పుస్తకములో సంస్కృత వృత్త లక్షణములు చెప్పఁబడె. తెలుఁగు వృత్తముల గణములనుగూడ దానఁ దెలియనగు.

*తే॥గీ॥ కులకము క్తక సంఘాతకోశములను
దాదృశంబగు పద్యవిస్తరముఁ గూడఁ
జెప్పవైతి నంగంబులై చెలఁగునవియు
నా వచించెడి సర్గబంధమునయందు. 13

## మ హా కా వ్య ము

సీ. అవనిమహాకావ్యమనఁబడు సర్గబం
ధము. దానికిఁజె లక్షణమువచింతు
ఆశీస్సొ వస్తునిర్దేశమో ప్రణతియో
దానికి ముఖముగాఁ దనరవలయు
నితిహాసకథనుండి యేర్పడినదిగాని
యుత్తమాశ్రితము వేఱొకటిగాని
కలితచతుర్వర్గఫలము వృత్తమ్ము వ
ర్ణ్యము చతురోదాత్తనాయకమ్ము

తే॥గీ॥ పురగిరిసరస్వదృతుచంద్రమోదినకృదు
దయరతోత్సవమధుపానతనయజనన

---

* కులకము-ఒకవాక్యముగ నన్వయించెడి యైదుపద్యములు.

ముక్తకము-అన్యశ్లోకాపేక్ష లేని యొకశ్లోకము.

కోశము-పరస్పరాపేక్ష లేని పద్యసమూహము.

సంఘాతము-మేఘదూతమువలె ప్రత్యేక పరిసమాప్తార్థములైన పద్యముల సమూహము.

వారికేళి వివాహోపవన వియోగ
యానమంత్ర దూతాజినాయకజయయుతి. 14

తే॥గీ॥ ఉక్తవస్తువర్ణనలతో నొప్పుచుండి
రసములను భావములను నిరంతరమయి
సంగృహీతముగాక యాశ్చర్యకర మ
హోజ్వలాలంకృతిస్ఫూర్తి నొప్పవలయు. 15

తే॥గీ॥ శ్రవ్యవృత్తంబులగుచు సుసంధులగుచు
భిన్నవృత్తాంతముల నతివిస్తృతములు
నైన సర్గంబులంబొల్చి యఖిలలోక
రంజకంబగు కావ్యమాపర్ణయవర్తి. 16

తే॥గీ॥ వీనిలో నెవ్వియేని లోపించినంతఁ
జెడదుకావ్యం బుపాత్తముల్ చేవగల్గి
కావ్యహృదయజ్ఞులౌ విచక్షణులమదికి
సంతసంబు నొసంగంగఁ జాలునేవి. 17

తే॥గీ॥ నాయకగుణాళి మొదట వర్ణనమొనర్చి
యతఁడు దుష్టశాత్రవుల మహాపరాక్ర
మౌద్ధతి నిరాకరించెనటంచు వర్ణ
నంబొనర్చుట ప్రకృతి సుందరపథంబు. 18

తే॥గీ॥ అరిజనులయును వంశవీర్యప్రతాప
ముఖ్యగుణముల వర్ణనమును బొనర్చి

వారిని జయించుటంజేసి ప్రకృతనాయ
కాతిశయముఁ జెప్పుటయు మా కభిమతంబు. 10

## గద్యకావ్యలక్షణము

తే॥గీ॥ పాదములులేమి గద్యమౌఁ బదచయంబు.
* కథయు నాఖ్యాయికయు నాఁగ గద్యము ద్వివి
ధంబు, నాయకుఁడొకఁడె వక్తయగునేనిఁ
దనరు నాఖ్యాయికాఖ్య గద్యమయసూక్తి. 20

తే॥గీ॥ నాయకుండె వక్తయగు నాఖ్యాయికలను
కథలనేతయుఁ బరుఁడు నాఖ్యాతయగును
మహితభూతార్థశంసియైమనెడి దీనఁ
బదయఁదెవఁడు నాత్మశ్లాఘవలనియఘము. 21

*తే॥గీ॥సర్వభాషలచేతను సంస్కృతంబు
చేతనుంగూడఁ గథవిరచింపఁబడును
భూతభాషామయంబయి పొల్చు నద్భు
తార్థమౌ బృహత్కథయని యార్యులంద్రు. 22

---

* తెలుఁగులోసైత మిట్టివి యుండవచ్చునని దీనిఁ జేర్చినాను.

* ఇచట సంస్కృతముమఁగూర్చి దండిచేఁ జేయఁబడిన విచారణ గ్రంథాంతమునఁ జేర్పఁబడినది.

## మిశ్రకావ్యలక్షణము

తే॥గీ॥ నాటకాదులు మిశ్రంబులౌట వాని
విస్తరంబు మఱొక్కచోఁ బ్రస్తుతింతు
గద్యపద్యమయంబయి క్రాలుచుండుఁ
గబ్బ మొకఁడు చంపూసమాఖ్యానమగుచు. 23

## దృశ్యశ్రవ్యభేదము

*తే॥గీ॥ లాస్యమును ఛలితంబు శల్యయును మున్ను
గాఁగలవి గల్గినన్ దృశ్యకావ్యములగు
శ్రవ్య కావ్యముల్ పెఱ'లంచు సైత మిరుతె
ఱంగు లార్యులచేతఁ జెప్పంగఁబడియె. 24

## రీతులు

తే॥గీ॥ అధికసూక్ష్మమైన యన్యోన్యభేదంబు
తోఁడ నుడుల పెక్కు త్రోవలొప్పుఁ
బ్రస్ఫుటాంతరముల వైదర్భగౌడీయ
పద్ధతులను జెప్పువాఁడ నేను. 25

## గుణములు

తే॥గీ॥ అందు వైదర్భమార్గంబునందుఁ బ్రాణ
దళకమై పదిగుణములు దనరుచుండుఁ

---

లాస్యము—శృంగారరసయుక్తమైన స్త్రీనృత్యము
ఛలితము—పురుషనృత్యము
శల్య—ఫాలమున హస్తముంచి చేయునృత్యము

### గౌ డ రీ తి

ప్రాయికంబుగ వీని విపర్యయంబు
గౌడపద్ధతియందున కానవచ్చు. 26

### గు ణ ము ల నా మ ము లు

తే॥గీ॥ జానుమీఁఖను శ్లేష ప్రసాద సమత
లనియు మాధుర్యసౌ కుమార్యంబులనియు
నాగుణంబు లర్థవ్యక్త్యుదారతలను
నవియు నోజస్సుకాంతి సమాధులనియు 27

### శ్లే ష గు ణ ము

తే॥గీ॥ శిథిలతనొకించుకేని స్పృశింపనిదయి
పరఁగుసూక్తి యల్ప ప్రాణవర్ణబహుళ
మగుచు శ్లేషగుణోజ్వలంబగు శిథిలము —

### గౌ డ రీ తి

'మాలతీ మాల లోలాళినీల' యవిన 28
తే॥గీ॥ కల వనుప్రాసమును బంధగౌరవంబు
నంచు నాదరింతురు గౌడులా రచనను

---

పాఠాంతరము- తే॥గీ॥ మహిని శ్లేషప్రసాదసమతలు మధుర
త సుకుమారతార్థవ్యక్త్యుదారతలును
మఱియునోజస్సుకాంతి సమాధులునన
నాగుణంబులు పదియొప్పఁబొల్పారుచుండు,

## వైదర్భరీతి

భ్రమరములచేత లంఘింపఁబడుచునుండె
మాలతియటన్న వైదర్భలాలితంబు. 29

## ప్రసాదగుణము

తే॥గీ॥ ప్రబలతంజెందు నిందీవరద్యుతియగు
లక్ష్మమున లక్ష్మి మిగులఁ గలానిధికను
సుప్రసిద్ధార్థముఁ బ్రతీతిసుభగమునగు
సూక్తియందుఁ బ్రసాదంబు సొంపు నింపు. 30

## గౌడరీతి

తే॥గీ॥ అంకము వళక్షగుగము నాత్యర్జునాంబు
సంభవసదృశమనుచు నీసరణి నొడువ
నాతిరూఢమయ్యు నభీష్టమగుచునుండు
గౌడులకిది వ్యుత్పన్నమై కాళ్ళిలుకతన. 31

## సమత

తే॥గీ॥ బంధములయందవిషమమౌ వాక్యమున స
మత్వమొప్పు. మృదుస్ఫుటమధ్యమములు
బంధములు మృదుస్ఫుటమిశ్రవర్ణములను
గూర్చి రచియించుటంజేసి క్రొమ్మరుఘిగుఖ. 32

### మృదుసమత

తే॥గీ॥ కోకిలాలాపవాచాలమై కవిసెడి
నన్ను మలయానిలకిశోరమన్న మృదువు

### స్ఫుటసమత

అనిలముచ్చలచ్ఛీకరా చ్ఛాచ్ఛనిర్ఝ
రాగతాంభఃకణోక్షితంబన స్ఫుటంబు. 33

### మధ్యసమత

తే॥గీ॥ చందనప్రణయోద్గంధి మందమలయ
మారుతంబని వచియింప మధ్యమమగు

### గౌడరీతి

రుద్దమద్దైర్యుఁడగుచు మరుద్ధతకుఁడు
వనితల ముఖానిలములతో స్పర్ధఁబూనె. 34

తే॥గీ॥ ననుచువిట్లు వైషమ్యంబు నరయ కర్థ
డంబరముల నలంకారడంబరములఁ
గాంక్ష సేయుచుఁ బౌరస్త్యకావ్యమార్గ
మత్యధికముగ నభివృద్ధి నధిగమించె. 35

### మాధుర్యము

తే॥గీ॥ రసయుతంబగు మధురంబు. రసము సూక్తు
లందునున్ వస్తువునను బొల్పారుచుండు

మధువుచే మధువ్రతముల మాడ్కి-విబుధు
లలరుచుండు రెద్దానిచే నదియె రసము. 36

## శ్రుత్యనుప్రాసము

తే॥గీ॥ పూర్వమువినఁబడిన వర్ణములను బోలు
వర్ణములతోడ వినఁబడు పదచయమున
కమరు సన్నిధానంబు రసావహమయి
జానుమీఱు ననుప్రాససహితమగుచు. 37

*తే॥గీ॥ లసదుదారయశోఽబ్ధి యిలాసురాష్ట్రఁ
దఖిలరాష్ట్రాధిపతి యితం డవనిరాజ్య
లక్ష్మిఁ జేపట్టుటాది యిలాతలమున
నొలసె ధర్మంబునకు సతతోత్సవంబు. 38

తే॥గీ॥ గౌడు లాదరదృష్టితోఁ గనరు దీని
వారల కభీష్టమగు ననుప్రాసమెపుడు
విది యనుప్రాసములకన్న నిష్టమగుచు
వఱలు వైదర్భులకునెల్లఁ బ్రాయికముగ. 39

---

* 1 పాదమున—లసదు, లాసు దంత్యములు.
యశో, తాలవ్యములు.
2 పాదమున—రాష్ట్రా మూర్ధన్యములు.
జ్య తాలవ్యములు.
3 పాదమున—లాతల దంత్యములు.
4 పాదమున—లసెధ, సతతోత్స దంత్యములు

## గౌడరీతి - వృత్త్యనుప్రాసము

తే॥గీ॥ పాదములను బదంబుల వర్ణములకు
వలయు నావృత్తి తగు ననుప్రాసమనఁగఁ
బ్రాగనుభవసంస్కారసంప్రాపకమయి
యవ్యవహితభావంబు పొల్పారెనేని. 40

*తే॥గీ॥ మొల్లగుత్తి పోలికనెల్లఁ గొల్లగొనుచు
శారదనిశావతంసమౌ చంద్రునందు
లక్ష్మమింద్రనీలనిభంబు లలితమైన
కొదమతుమ్మెద కొమరును గూర్చుచుండె. 41

తే॥గీ॥ మన్మనము మన్మథాక్రాంతతన్మనఁగవి
దానివధియింపబూనెను దయ దొఱంగి
చారుతరరుచి నొప్పారు చంద్రబింబ
మంబరంబునఁ గాంచితే ? యంబుజాక్షి ! 42

తే॥గీ॥ అనతిదూరాంతరశ్రుతియగచునుండి
యీయనుప్రాసమవ్వారి కిష్టమగును
పొసఁగకుండు రామాముఖాంభోజమునకు
జంద్రుఁడు సమానుఁడగునను సరణినుడులు. 43

---

* 1 పాదమున—ల్ల, ల్ల, ల్ల లి.

2 పాదమున—శా, శా, ంద్రు, ందు.

3 పాదమున—నీ, ని, ల, ల, ల, లి.

4 పాదమున—ద్మ, ద, కొ, కొ.

*తే॥గీ॥ ఖరుఁడు స్మరుఁడయ్యెడిన్ మనఃకాంతుఁడు ఖలుఁ
డయ్యెడిన్ వపుఃకోపకార్శ్యములు మిగిలె
మానమూ। చ్యుతమయ్యెఁ గామంబెసంగెఁ
గలిగె మోహంబు ప్రాణముల్ గదలిపోయె. 44

తే॥గీ॥ ఇట్టివాదిగఁ గల్గిన వెల్ల బంధ
మునకుఁ బారుష్యశైథిల్యములఁ దగుల్చుఁ
గావునన్ దాక్షిణాత్యులీకరణిఁ జేయ
రొప్పుకొన రనుప్రాసప్రయోగములను. 45

## య మ క ని ం ద

తే॥గీ॥ వర్ణసంతతికావృత్తి వఱలెనేని
దానియమకంబటంచును దలఁచుచుంద్రు
కడుమనోహరమయ్యదికాదుకాన
పిదపదానివిధింతు సవిస్తరముగ. 46

## గ్రా మ్య ని ర స న ము

కం. తోరంబుగ సర్వాలం
కారంబులు నర్థమందుఁ గలిగించురస

---

* దుఃఖక్షోభప్రదసుమ
నఃఖడ్గముఁదాల్చె ఖరమనఃప్రభవుఁడు చే
తఃఖేదకరుఁడు ఖలుఁడు మ
నఃకాంతుఁ డనుచలనముగ నంబడెనకటా !

స్ఫారతనై నన్ దానీ
భారము నగ్రామ్యతయె ప్రబలముగఁబూనున్ 47

తే॥గీ॥ ఓముగుదరొ ! యేలానిన్
గామించుచున్ననన్ను గామింపవటం
చీమెయిఁ బలికిన నర్థగ
మైమేకొను గ్రామ్యదోష మతివిరసముగన్. 48

తే॥గే॥ లోలాక్షి । కాముఁడను చం
దాలుఁడు విష్కరుణుఁడయ్యె నాపై మిగులన్
మేలిది నీపయి మత్సర
శీలుఁడు గాఁడనిన రసము చిప్పిలుచుండున్. 49

తే॥గీ॥ కలిగితీరు సభ్యేతర కథనమునను
శబ్దమందును గ్రామ్యదోషస్ఫురణము
రతిమహోత్సవ మధురవర్ణనములందు
యభనముఖ్యపదంబుల నతికిరేని 50

తే॥గీ॥ హేయమగుఁ బదసంధానవృత్తిచేతఁ
గావి వాక్యార్థమగుటచేఁగాని దుష్ప్ర
తీతినొనరించు గ్రామ్యంబ "దేలచెప్ప
*నీముగుద మనుజూపిన పేరిముడి" యన 51

---

* యభ, మైథునే, అనిధాతుపాఠము

* "గుదమునుజూపిన" అని విశ్చిన గ్రామ్యసుకును.

తే॥గీ॥ పురుషుండు వీర్యవంతుఁడు
ఖరముగఁ బరిహరణమొనర్చి కడు బడలికఁ బెం
పఱివిశ్రమించెనన నా
ప్పరెవరయిన గూడ రెండుపద్ధతులందున్. 52

## అ ని ం ద్య గ్రా మ్య ము

తే॥గీ॥ భగిని భగవతి మొదలగు పదములెల్ల
యెడలనెల్లరసమ్మతిఁ బడయుచుండు
నిట్లు మాధుర్యమిది వచియింపఁబడియె
నింక సౌకుమార్యము వచియింపఁబడును. 53

## సౌ కు మా ర్య ము

తే॥గీ॥ పఱగెడిననిష్ఠురాక్షర ప్రాయములగు
మంచినుడికారముల సౌకుమార్యగుణము
సకలకోమలవర్ణ వాగ్జాలమందు
బంధశైథిల్యదోషంబు వర్జితంబు. 54

తే॥గీ॥ చక్రవాకముల్ గాఁగఁ బింఛముల విచ్చి
సుమధురంబగు గీతి కంఠములఁజెలఁగ
నీలజీమూతమాలల కాలమందు
నృత్యములు సేయుచుండు బర్హిణగణంబు 55

తే॥గీ॥ అర్థమా! యిందనూర్జితంబగుచునుండుఁ
గాత్రిలవెక్కుడుగా నలంకారములును
ఇదిరసజ్ఞులశేముషి కెక్కుచుండు
సౌకుమార్యగుణంబు చెల్వొకతమున. 56

తే॥గీ॥ పరులు గూర్చుచుండెదరు దీప్తంబటంచు
గష్టముగఁబల్కఁదగిన వాక్యయమునైన
శత్రిపక్షంబు నృపుండు క్షణములోన
క్షయమొనర్చెనటంచు రూక్షంబుగాఁగ. 57

## అర్థవ్యక్తి

తే॥గీ॥ అర్థంబనేయమగుటయె
యర్థవ్యక్తి - యిలఁదీసె నసురాంతకుఁడ
త్యర్థఖురక్షుణ్ణభుజగ
సార్థాసృగ్లోహితమగుజలరాశినన్. 58

తే॥గీ॥ రక్తమైకానుపించు సంద్రంబునుండి
యవ్వసుధనుద్ధరించె మహావరాహ
మనుచు నింతయే నిర్దిష్టమయ్యెనేని
వ్యాళములశోణితంబు నేయమగుచుండు. 59

తే॥గీ॥ రెండుమార్గంబులందు నీదృశంచనను
శ్రేష్ఠమైనదటంచు వచింపరెవరు

శబ్దనియమముల్లంఘించు శాబ్దబోధ
మవనిమీద సమంజసం బగుట కలదె ? 60

## ఔ దా ర్య ము

తే॥గీ॥ ప్రకటితోత్కర్షమై యొకానొకగుణంబు
వాక్యమెయ్యది వచియింప వ్యక్తమగునొ
అది యుదారత కాశ్రయంబగుచునుండు
తత్ప్రనాధమై కావ్యపద్ధతి చెలంగు. 61

తే॥గీ॥ కృపణమైనట్టి యర్థుల దృష్టి యొక్క-
పరిఁద్వదీయముఖముమీఁదఁ బడియెనేని
నయ్యవస్థతో నన్యుని యాననంబు
మరలఁ గాంచంగఁ బోదుక్షమాకళత్ర! 62

తే॥గీ॥ ఇట్టులీవాక్యమునయందు నీవిపెంపు
గానఁబడుచుండెడిని సమగ్రంబుగాఁగ
విట్టిపద్ధతిచేత నూహింపవలయు
నన్యములగు చోట్లను సమన్వాయముగను. 63

తే॥గీ॥ శ్లాఘ్యమైన విశేషణజాలమొప్పఁ
గొందఱది యుదారంబనుచుందురెట్టు
లన్న:-గ్రీడాసరస్సు లీలాబ్జము కన
కాంగదంబన నివి యుదాహరణములగు. 64

# ఓ జో గు ణ ము

తే॥గీ॥ సుబహుళసమాస రచన మోజోగుణంబు
గద్యమునకిది జీవమై క్రాలుచుండు
దాక్షిణాత్యేతరులకుఁ బద్యములపైత
మీయది యొకండె యగును బరాయణంబు. 65

తే॥గీ॥ గురువులెక్కువయౌటను గొలదియౌట
లఘువులెక్కువయౌటఁ గొలఁదిగనుంట
సమములై రెండునుంట నోజస్సుచాల
రకములఁ దగు నాఖ్యాయికాదికములందు. 66

తే॥గీ॥ అస్తమస్తపర్యస్త సమస్త తిగ్మ
భానుభానుసంస్తరయౌచు వారుణీ యిదె
తరుణపీనస్తనస్థితాతామ్రికమ్ర
వస్త్రనాఁగ నిశాంతంబు భాసిలెడిని. 67

తే॥గీ॥ పద్యములపైతమిట్లుగఁ బ్రాచ్యులెల్లఁ
గూర్చుచుందు రోజస్వీసూక్తుల నిరతము
నితరులవ్యాకులంబయి హృద్యమయ్యె
నేని నోజోగుణంబందు రెట్టులనిన ? 68

తే॥గీ॥ చారుతరపయోధరతటోత్సంగలగ్న
చరమసంధ్యాతపప్రభాంబరముతోడ

జానుమీఱువారుణి వేని మానసమును
జేయకుండు ననంగవశీకృతముగ. 69

## కాంతిగుణము

తే॥గీ॥ లౌకికార్థానతికాంతిలభ్యమగుచుఁ
గాంతిగుణము నిఖిలజగత్కాంతమగును
వార్తలను జెప్పునపుడది పఱఁగుచుండు
వర్ణనలయందునుం గనఁబడుచునుండు. 70

తే॥గీ॥ పావనంబైన నిజపాదపాంసుపటలిఁ
బఱపి యేగృహములను భవాదృశులగు
సత్తపోనిధులెంతయు సత్కరింతు
రాగృహమ్ములెసుండు గృహంబులనిన. 71

తే॥గీ॥ ఏణలోచనరో! జృంభమాణమగుచు
నున్నయట్టి యీ వక్షోజయుగ్మమునకు
తావకీనభుజాలతాంతరమునందుఁ
జక్కగానుండుటకుఁ జోటుచాలదయ్యె. 72

తే॥గీ॥ ఇట్లు సంభావ్యమగునిదియే విశేష
వర్ణనముచేత సంస్కరింపంగఁబడుచు
లోకయాత్రానువర్తనలోలమైన
యఖిలలోకమ్మునకుఁ గాంతమగుచునుండు. 73

## గౌడ రీతి

తే॥గీ॥ మిగుల నారోపములతోఁ దగి యలోక
సిద్ధమగుభంగిగను వివక్షింపఁబడిన
యర్థమున విదగ్ధులు మోదమందుచుందు
రితరులకు మోదకరముగా దది యెపుడును. 74

కం॥ మీపాదరజముపడుటన్
బాపము రూపఱఁగ దేవభవనమువలె శ్లా
ఘాపాత్రత మాగేహము
ప్రాపించెడి నీదినంబె యాదిగ నింకన్. 75

తే॥గీ॥ ఇవ్విధంబున నీ స్తనజృంభణంబు
కాఁగలదటంచు నూహగల్గి నికతమునఁ
గమలగర్భుండు స్వల్పంబుగా నొనర్చె
నాకసంబును గమలదళాయతాక్షి ! 76

తే॥గీ॥ దీని నత్యుక్తియందురు, దీని మిగుల
లాలనయొనర్చుచుందురు గౌడకవులు
లాలపద్ధతిఁ బూర్వప్రణీతమైన
మార్గమదియెంతయేని సమంజసంబు. 77

## సమాధిగుణము

తే॥గీ॥ అన్యధర్మము లోకమర్యాద ననుస
రించి మఱియొకచోట సమంచితముగ

నాహితంబయ్యెనేని సమాధియనుచు
నెంచుచుందురు తద్జ్ఞ లదెట్టులనిన ? 78

తే॥గీ॥ అంబుజంబుల్ నిమీలనంబందుచుండె
కైరవంబు లున్మేషముంగాంచుచుండె
ననుచు నేత్రక్రియాధ్యాస మమరుకతనఁ
దదభిధాయకములగు శబ్దములొదవెడి. 79

తే॥గీ॥ ఉమియుఁగక్కునటంచు నిట్లుండుపదము
లన్నియున్ గౌణవృత్తివ్యపాశ్రియమున
నధికసుందరములగుచు నట్లుకాని
పక్షమునఁజేరెడిని గ్రామ్యకక్షలోన. 80

తే॥గీ॥ ఉష్ణరశ్మిమయూఖంబు లుమియుచుండు
నిప్పుతుంపురులను ద్రావి నీరజములు
రక్తరేణువుల్ గక్కువక్త్రములనుండి
మరలవెడలంగఁ గ్రక్కెడుమాడ్కినొప్పు. 81

తే॥గీ॥ ఇట్లువర్ణింప హృద్య, మహృద్యమగుచు
వెగటుగలిగించు వధువుమ్మివేసెననఁగ
పెక్కుధర్మంబు లధ్యాస మొక్కతటి ర
హించుచుండుటయుంగలదెట్టు లనిన. 82

తే॥గీ॥ గర్భభరగౌరవాధికక్లాన్తితోడ
స్తనితములతోడ జలధరసంతతులివి

పర్వతాధిత్యకోత్సంగభాగములను
మించుమించులతో శయనించియుండె. 83

తే॥గీ॥ తనసఖియుత్సంగతలం
బున శయినించుటయు స్తనితమును గురుతయుఁగ్లాం
తివిమనుటయు గర్భిణులగు
వనితలధర్మములు పెక్కు వర్ణితములిటన్. 84

తే॥గీ॥ క్షితిసమాధియటంచుఁ బ్రసిద్ధిగాంచి
వలుగుణమిది కావ్యసర్వస్వమగుచు.
అట్టిదీనివి గవిసముదాయమెల్ల
ననుసరించుచునుండు నత్యాదరమున. 85

తే॥గీ॥ రెండుమార్గంబులిట్లు వేర్వేరనుండు
వానిలక్షణముల నిరూపణమువలన.
వానిలోభేదములు చెప్పఁబడుటయరిది
కవియయినవానియం దెల్లఁ గలుగుకతన. 86

తే॥గీ॥ అరసిచూడ క్షీరేక్షుగుడాదులకును
దెలియఁబడు గొప్పభేదంబు తీపియందు
వానినెల్ల వేఱుగఁ జెప్పవలయుననిన
నలసరస్వతికైన శక్యంబుగాదు. 87

తే॥గీ॥ ప్రకృతిసిద్ధంబయగుచు నేర్పడు ప్రతిభయు
నమలినంబయి సమధికంబగు చదువును

గాఢమైయొప్పెడి యభియోగంబు నీసు
కావ్యసంపద కగుచుండుఁ గారణంబు. ౮౮

తే॥గీ॥ తగ గుణావహమగునద్భుతప్రతిభయుఁ
బూర్వవాసనయును లేకపోవుఁగాక
చదువుకొనియత్నమున నుపాసన సలిపిన
భారతియనుగ్రహంబును బడయు నరుఁడు. ౮౯

తే॥గీ॥ ఏమఱకపూన్కిమైఁ గీర్తికాముకుండు
భారతియుపాసనము సల్పవలయునెపుడు
కవిత యసద్దైనమున్ విదగ్ధసభలందు
మెలఁగఁగల్గుఁబరిశ్రాంతి సలిపినతఁడు. ౯౦

ప్రథమపరిచ్ఛేదము.

సమాప్తము.

శ్రీ

# ద్వితీయ పరిచ్ఛేదము

## అలంకారలక్షణము

తే॥గీ॥ కావ్యమునయందు శోభను గల్గఁజేయు
ధర్మములలంక్రియలని పెద్దలు వచింతు.
రిపుడును వికల్ప్యమానత నెనయునివి. యె
వందు సాకల్యముగఁజెప్ప వలఁతియగును? 1

తే॥గీ॥ అట్లయినఁ జేయునదియేమి? యందురేమొ!
పూర్వులాచార్యులు వికల్పములకుఁ గల్గు
బీజమును జూపియుండి రాబీజమె పరి
సంస్కరింపంగఁబడఁగ మాజతన మిద్ది. 2

ఆ॥వె॥ వెనుకఁగూడ మార్గవిభజనం బొనరింపఁ
బలుకఁబడె నలంక్రియ లొకకొన్ని
లలిఁగనంబటిచెద లాతిసాధారణా
లంక్రియానికాయ మింకమీద. 3

## అర్థాలంకారములు 35

సీ. ఒప్పు స్వభావోక్తి యుపమయు రూపక
దీపకావృతులు నాక్షేపనామ
మర్థాంతరన్యాస మావ్యతిరేకంబు
నలవిభావనయు సమాస సాతి

యో_క్తి యుత్ప్రేక్షయు నొగి హేతుసూక్ష్మల
వక్రిమ ప్రేమళ హ్వాయములును ర
సవదలంకార మూర్జస్వి పర్యాయో_క్త
ము సమాహితోదా_త్తములు నపహ్న
వము శ్లేషము విశేషవచనమ్మునున్ దుల్య
యోగితాలంకృతియును విరోధ
మప్రస్తుతప్రశంసాఽలంకరణమును
వ్యాజస్తుతి నిదర్శనాహ్వయము స
హో_క్తియుఁ బరివృ_త్తియును వాంఛితాశంస
నాత్మకమాశీస్సమాహ్వయంబు
సంకీర్ణనామకాలంకారమును భావి
కాలంక్రియయనంగఁ గ్రాలునదియు

తే॥గీ॥ ననుచు వాక్కులముప్పదియైదలంక్రి
యలను బ్రాచీనకాలమునందుఁగల్గు
సూరిశేఖరుల్ కావ్యశోభారహస్య
భేదపరిశీలనమునఁ జూపించినారు. 4

## స్వభావో_క్తి

తే॥గీ॥ బహ్వవస్థలవస్తురూపంబును నప
రోక్షముగ వివరింపంగ దక్షమగుచు
జాతినా స్వభావో_క్తినా ఖ్యాతిగాంచి
యాద్యమౌ నలంకృతి పొలుపారుచుండు. 5

## జాతిస్వభావోక్తి

తే॥గీ॥ హరితకోమలపక్షంబులగుచుఁ దుణ్ణ
పజ్త్రీ యాతామ్రకుటిలమై భాసిలంగ
మెడలు మువ్వన్నెచాలల మెఱయుచుండ
శుకములివి మంజుళోక్తులై శోభిలెడిని. 6

## క్రియాస్వభావోక్తి

తే॥గీ॥ కన్నులాఘూర్ణితంబులై కాంత్రిలగాఁ గ
లక్వణితగర్భమైన గళంబుతోడఁ
బ్రీతిఁబారావతంబు పరిభ్రమించి
ప్రణయినిన్ ముద్దిడికొనె రిరంసమీఱ. 7

## గుణస్వభావోక్తి

తే॥గీ॥ అంగములయందు బద్ధరోమాంచమగుచుఁ
జిత్తమునయందు నిర్వృతిఁజేయుచుండి
నయనయుగమున కామీలనంబుఁగూర్చి
వర్తిలుచునుండెఁ బ్రియసీస్పర్శ మహహ! 8

## ద్రవ్యస్వభావోక్తి

కం॥ గరళము గళమునఁ దనరఁగ
గరమందుఁ గపాలమొప్పఁగా శశధరశే
ఖరుఁడగు వృషధ్వజుం డిదె
యరుణస్నిగ్ధజటలఁజెలువై పొడకట్టెన్. 9

తే॥గీ॥ తగును జాతిక్రియాగుణద్రవ్యముల స్వ
భావకథనంబు లిట్టివై పాత్రిభవంబు
దీనికెల్ల శాస్త్రంబులఁ దేజరిల్లుఁ
గావ్యముల పైత మియ్యది కాంతమగును. 10

## ఉ ప మ

తే॥గీ॥ ఎవ్విధంబుననైన సాదృశ్యమెచట
నవగతంబగు నుద్భూతమై కరంబు
నయ్యది యుపమనాఁగఁజెల్వారుఁ దత్ప్రి
పంచము నిదర్శనములఁ జూపంగఁబడును. 11

## ధ ర్మో ప మ

క॥ ముగుదరో! కమలాతామ్రం
బగు నీకరతలమటంచు నపరోక్షతఁ దు
ల్యగుణంబుఁ జూపుకతమున
నగుధర్మోపమయనంగ ఖ్యాత మది యిలన్. 12

## వ స్తూ ప మ

తే॥గీ॥ వారిజాతంబువలె నీదువదనమొప్పు
నల్లకలువలవంటివి నయనములన
రహిఁబ్రతీయమానైకధర్మంబగునిది
ఖ్యాతివహియించు వస్తూపమాఖ్యగల్గి. 13

## విపర్యాసోపమ

తే॥గీ॥ నీదు నెమ్మొగముంబోలి నీరజాత
మయ్యె నున్నిద్రమంచు సామ్యంబుచెప్ప
నది ప్రసిద్ధివిపర్యాసమగుటవలన
ఖ్యాతమగు విపర్యాసోపమాఖ్యతోఁడ. 14

## అన్యోన్యోపమ

తే॥గీ॥ నీదు నెమ్మొగముంబోలు నీరజమ్ము
నీరజమ్మును బోలెడి నీదుమోము
ననఁగ నొండొంటియతిశయమ్మును దెలుపుచు
నగుచునుండు నన్యోన్యోపమాభిధంబు. 15

## నియమోపమ

తే॥గీ॥ నీరజాతంబుతోడనే నీదుమోము
బోలు నిఁకదేనితోడను బోలదనఁగ
నన్యసామ్యము వ్యావృత్త మయ్యెఁ గాన
ఖ్యాతమౌ నిది నియమోపమాఖ్య గలిగి. 16

## అనియమోపమ

గీ॥ అనుకరించెడి నీమోము వనరుహమును
తాదృశమ్మగుచుండి తత్కారియైన
దితర మెదియైననుండిన నేమి? మాక
నంగ ననియమోపమనాఁదనర్చునిద్ది. 17

## స ము చ్చ యో ప మ

తే॥గీ॥ నీదు నెమ్మొగ మొక్క-కా న్తిగుణముననె
కాదు హ్లాదనక్రియపొల్చుకతనఁగూడ
శశినిబోలెడి ననుచు నీసరణిఁ జెప్ప
నది సముచ్చయోపమయన నందమొనఁగు. 18

## అ తి శ యో ప మ

క॥ నీయందేకన్పట్టెడి
నీయాస్యం బిందునిన్ గనెద మాకసమం
దీయదియేభేదము లే
దోయి యితర మనఁగ నతిశయోపమయొప్పున్. 19

## ఉ త్ప్రే క్షి తో ప మ

తే॥గీ॥ అమరె నాయందె యీకాంతయాస్యలక్ష్మి
యనెడి చంద్రునియీవికత్థనములేల ?
అది జలజమందునుం గననగుచునుండె
ననిన నుత్ప్రేక్షితోపమయగుచునుండు. 20

## అ ద్భు తో ప మ

తే॥గీ॥ పద్మమెయ్యదియైన విభ్రాంతనేత్ర
మైన నయ్యది తావకీనాస్యలక్ష్మి
నంగనరొ ! వహియించునటన్నఁజెప్పఁ
బడెడి నియ్యది యద్భుతోపమయటంచు. 21

## మోహోపమ

క॥ నీమోము చంద్రుఁడనుకొని
నే ముగుదరో ! పరువు లిడుదు నీవదనముకై
యామిహిరకిరణుదిశకనఁ
గా మోహోపమ యటంచు గణుతింపఁదగున్. 22

## సంశయోపమ

తే॥గీ॥ భ్రమరములు లోన తిరిగెడి పద్మమొక్కొ !
అతిచపలలోచనమగు నీయాస్య మొక్కొ !
యనుచు డోలాయమానత నందె నాదు
డెందమన సంశయోపమ పొందుపడును. 23

## నిర్ణయోపమ

తే॥గీ॥ చంద్రనిగ్రాహ్యమైనట్టి పరసిజమున
కిందులజ్జాకరద్యుతి యెట్లుకలుగు ?
గాన యియ్యది నీదుముఖంబె యనిన
నిర్ణయోపమ యన నిది నెగడుచుండు. 24

## శ్లేషోపమ

తే॥గీ॥ శిశిరకిరణప్రతిస్పర్ధి శ్రీయుతంబు
సురభిగంధి నీ నెమ్మోము సరసిజంబు
వంటిదనిన శ్లేషోపమాహ్వాయమగునిది
యనుచుస్మరియించినారు కావ్యవిదులెల్ల. 25

## స మా నో ప మ

తే॥గీ॥ అయ్యెడి సరూపశబ్దవాచ్యమగుచుండు
నది సమానోపమాఖ్యాసమన్వితంబు
బాలఁబోలి యీయుద్యానమాల గ్రాలు
సాలకాననశోభినియై లలి నన, 26

## ని ం దో ప మ

తే॥గీ॥ బహురజస్కంబు పద్మంబు, పద్మవైరి
క్షయయుతుండయియుండుఁ, దత్సమమయియును
నీకొమరుమీఱు మోము సోత్సేకమగున
నంగ నిందోపమయనం జెలంగునిద్ది. 27

## ప్ర శ ం సో ప మ

తే॥గీ॥ వనజజుని జన్మభూమియౌ పద్మమనఁగ
నీశ్వరునినెత్తిమీదివాఁడిందుఁడనఁగ
వారిరువురు సములు నీదువక్త్రమునక
నం బ్రశంసోపమయనం దనరెడి నిద్ది. 28

## ఆ చి ఖ్యా సో ప మ

తే॥గీ॥ నీదుమోము హిమాంశుసన్నిభమటంచు
నస్మదాత్మ యాచిఖ్యాసు వగుచునుండె
వెలుసుగానీ గుణంబుగానీ యనంగ
నొప్పుచుండు నాచిఖ్యాసయుపమయనఁగ 29

## వి రో ధో ప మ

తే॥గీ॥ అల్లశతపత్రమునకు నీయాస్యమునకు
నాశరచ్చంద్రమునకు నన్యోన్యవైర
మొప్పుచుండెడినను నిట్టి సూక్తులందు
శోభిలెడిని విరోధోపమాభిధంబు. 30

## ని షే ధో ప మ

తే॥గీ॥ నీమొగమునెదిరింపంగ నీరజారి
కెప్పుడును శక్తిగల్గదదేల ? యనఁగ
నాతఁడు కళఙ్కి జడత యొప్పారు నతని
కన నిషేధోపమయని కావ్యజ్ఞు లంద్రు. 31

## చ టూ ప మ

తే॥గీ॥ మృగవిలోచనాఙ్కంబు నీమోము శశి మృ
గంబె యంకంబుగాఁగలఁడంబుజాక్షి !
ఐననీయాస్యమునకు సమానుఁడే య
ధికుఁడు గాఁడనఁగఁ జటూపమ కొమరారు. 31

## త త్త్వ క థ నో ప మ

తే॥గీ॥ పంకజముగాదు మోమిది భ్రమరములివి
కావు నేత్రంబులని పోలికను గరంబు
స్పష్టముగఁ జెప్పుచుండుటవలనుపడినఁ
దత్త్వకథనోపమయనంగఁ దనరుచుండు. 32

## అసాధారణోపమ

తే॥గీ॥ అమృతకిరణాబ్జముల శోభ నతిశయించి
తావకీనమైనట్టి సుందరవదనము
తానుదనతోడనే సమంబై నెగడెడి
నన నసాధారణోపమ యగుచునుండు. 33

## అభూతోపమ

తే॥గీ॥ ఒక్కచోఁ బోవుగాఁజేసి యుంచఁబడిన
నిఖిల నీరజప్రభలోని నిగ్గువోలె
నీదు నెమ్మొగమెంతయు నెగడెడినన
నది యభూతోపమగఁ దెలియంగఁబడును. 34

## అసంభావితోపమ

తే॥గీ॥ చంద్రబింబమునుండి విషంబుపగిది
చందనద్రవముననుండి జ్వాలనమువలె
వచ్చుచుండె నీవక్త్రంబువలనఁ బరుష
వచనమన నసంభావితోపమ యనఁబడు. 35

## బహూపమ

తే॥గీ॥ చందనోదక చంద్రాంశు చంద్రకాంత
ముఖ్యవస్తు శీతలమయి పొల్చు నీదు
స్పర్శమన నతిశయంబుఁ దెల్పంగఁ గలిగి
యిది బహూపమ యనఁగఁ బేరెన్నికఁగను. 36

## విక్రియోపమ

తే॥గీ॥ అలరుఁ జంద్రబింబోత్కీర్ణమైనయట్లు
పద్మగర్భోద్ధృతంబైన పగిది మగువ!
నీదునెమ్మోమటంచు వర్ణింపఁబడిన
నొప్పుచుండు నీయ్యది విక్రియోపమయన. 37

## మాలోపమ

తే॥గీ॥ భానుసందాతపమువలె భాస్కరుండ
హస్సునన్బలె వాసరం బాకసంబు
సందునన్బలె లక్ష్మినీయందునించె
విక్రమమన మాలోపమ విదితమగును. 38

## వాక్యార్థోపమ

క॥ ఒక వాక్యార్థము దానిం
గొక వాక్యార్థమ్ముతోన యుపమితమగుచోఁ
బ్రకటము వాక్యార్థోపమ
యొకవాచకముండుఁ దద్బహుత్వమునొప్పన్. 39

## ఏకవాచకవాక్యార్థోపమ

తే॥గీ॥ తరళనయన మావిర్భవద్దంత కాంతి
మహితము త్వదాననంబు భ్రిమద్భ్రమరవి
భాసి యగుచుండి యాలక్ష్యకేసరమగు
నంబుజాతంబు పగిదిఁ బొల్పారుచుండు. 40

## బహువాచక వాక్యార్థోపమ

తే॥గీ॥ నళినివంటి యాతన్వంగి నళినసదృశ
మైన యాననమును దేఁటియట్లునేను
సాదరతఁగ్రోలికోలి యాహ్లాదమయసు
ధాబ్ధివీచికలం దోలలాడినాఁడ. 41

## ప్ర తి వ స్తూ ప మ

తే॥గీ॥ వస్తువును నొక్కదాని నుపన్యసించి
దానితో సధర్మమ్మగు దానిఁజెప్పఁ
గలుగు సామ్యప్రతీతి. యక్కారణమున
మహితమౌఁ బ్రతివస్తూపమ యెటులనిన. 42

తే॥గీ॥ నేడునున్ జాయమానులౌ నృపులలోన
నొకఁడు నుండడు నీయట్టి డొడయఁడిలను
బారిజాతంబునకు సరిపాదపంబు
రెండవదిలేదకాదె? యీపృథివిమీద. 43

## తు ల్యా యో గో ప మ

తే॥గీ॥ ఒక్కపనిని జేయుటయందు నుత్తమునకు
హీనుతోడ సామ్యము వచియించుట యిది
యగును దుల్యయోగోపమ యనుచుఁబెద్ద
లెల్లనొక్కి వక్కాణించి రెట్టులనిన. 44

తే॥గీ॥ స్వర్గరక్షణ జాగ్రత్త వాసవునిది
నీది భూచక్రరక్షవినిద్రశక్తి
సావలేపుల నసురుల నతఁడు గెడపు
నీవును సగర్వులౌ రిపున్నృపుల నడఁతు. 45

## హే తూ ప మ

తే॥గీ॥ చంద్రునింగాంతిచేత భాస్కరునిదేజు
చేత సంద్రంబు ధైర్యంబుచేత నోలి
నీవనుకరించుచుంటివి నృప ! యనవిడి
యనుమతంబయ్యె హేతూపమాఖ్యతోడ. 46

## ఉ ప మా దో ష ని ర స న ము

తే॥గీ॥ భిన్నలింగత వచనంబుభిన్నమగుట
హీనతయు నధికతయును న్యూనత విద
లేవుపమ కయ్యది సుమనోభావపీఠి
కెక్కఁగలిగి యుద్వేగంబు నీయదేని. 47

తే॥గీ॥ షండు డీతండు స్త్రీవలెఁ జనుచునుండె
నీయమ పురుషువలె వచియించుచుండె
వితఁడు ప్రాణములవలె నా కిష్టుఁ డగును
విద్య యార్జింపఁబడియెను విత్తము వలె. 48

తే॥గీ॥ దేవతాసార్వభౌముండు దేజరిల్లు
నీవలెన్ ధరణీరమణీప్రియకర !

యుర్వినేత తేజంబున నుష్ణభాను
కత్య నారోహణముసేయఁ గలిగి యుండు. 49

తే॥గీ॥ ఇట్టి లీదృక్ప్రయోగంబు లెల్ల సుభగ
భావముం గోలుపోకయె వఱలునెపుడుఁ
గలిగితీరు నుద్వేగంబు కావ్యవిదుల
యుల్లములకు నాక్కాక్కప్రయోగమందు. 50

## ఉ ప మా దో ష స్థా న ము లు

తే॥గీ॥ అమృతకిరణుండు ధవళుండు హంసివలెను
విమలము సరస్సులుంబోలె విష్ణుపదము
కుక్కవలెనుండు స్వామిభక్తుఁడగువాఁడు
మిణుగుఱుపురువు వెలుఁగొందు మిహిరుఁ బోలి. 51

తే॥గీ॥ ఉజ్జగించెద రిట్టివి యుచితవిదులు
దాని కారణముం గావ్యతత్త్వవిదులు
శేముషిన్ స్వయముగ విమర్శింపవలయు
గుణము దోషమ్మునుం గనుంగొనుటకొఱకు. 52

సీ. మాదిరి కై వడి మాడ్కి పగిది పోల్కి
తెఱఁగున విధమున తీరున క్రియ
గతి భాతి చందముగా రీతి రహి చాయ
తేవ కరణి జాడ కీవి డంబు
వలె నట్టు లటు లట్లు బలె పోలె వరుసను
బోటి వంటి యొరయు పోని యట్టి

పోలు మున్నగు శబ్దములు సరి ప్రతి యుద్ది
యెన జోడు పోటియు సీడు సూడు
సవతు తరము దీటు సాటువ పాటియు
పురు డచ్చునున్ సరిపోవుమ సరి
తూగుచు నుండు వంతులకు వచ్చుచునుండు
ప్రతి మాఱు తరబడి బదులు సాటి
నిభ సన్నిభ సమాన నీకాశ సంకాశ
తుల్య ప్రతీకాశ తులిత సదృశ
సంవాది సమ్మిత సమ సదృక్ష ప్రతి
పక్ష సపక్ష సలక్షణోప
మోపమితాభ సరూప సజాతీయ
వైరి సవర్ణానువాది ప్రఖ్య
ప్రతివిధి ప్రతిబింబ ప్రత్యనీక ప్రతి
ద్వంద్వి ప్రతిచ్ఛంద పదములు ప్రతి
రూపపదం బనురూపపదంబున-
న్యూనార్థకపదసమూహ దేశ్య
కల్ప దేశీయాదికప్రత్యయంబులు
నజ్ఞాననాదిశబ్దాళియందు
వెలయుచుండెడి బహువ్రీహిసమాసంబు
స్పర్ధఁబూనె జయించె వైరమూనె
ద్రోహమొనర్చె నాక్రోశించె నెదిరించె
గర్జించెఁ బీడించె గర్హసలిపె

నవ్వె నసూయగనంబఱిచెను సంధి
చేసె నీసువహించెఁ జిన్నచూపు
చూచె విడంబించె శోభగొల్లగొనియె
దాని సౌభాగ్యసంతతి హరించె

గీ॥ దానితో విరోధించెను దానితోడఁ
తులను సరితూగెఁ దత్పదవులఁ బద మిడె
దదనుబంధి తచ్ఛీలంబు దానిననుక
రించెననునిట్టి నుడులు సదృశతఁ దెల్పు. 53

ఉపమాచక్రము సమాప్తము.

---

## రూ ప కా లం కా ర ము

గీ॥ భేదము తిరోహితంబైనఁ బేర్కొనియెద
రుపమనే రూపకంబని సూక్తివిదులు

## స మ స్త రూ ప క ము

తద్విధం బెట్టులనఁ గేలుదమ్మి బాహు
వల్లరి మనోజ్ఞమౌ పాదపల్లవంబు. 54

## వ్య స్త రూ ప క ము

ఆ॥ వ్రేళ్ళు చివురు లయ్యె, గోళ్ళకాంతులు పూవు
లయ్యె, బాహువులును నయ్యె లతలు
ఓవసంతలక్ష్మి ! నీవు మా కన్నుల
యెదుటఁ దిరుగుచుంటి వీదృశముగ. 55

గీ॥ వ్యస్తరూపక మిట్టిది యగు. సమస్త
రూపకం బిది పూర్వోక్తరూప మగును
రూఢిఁగను సమస్త వ్యస్తరూపకమగు
నాస్యచంద్రునిస్మితము చంద్రాతపమన. 56

## సకలరూపకము

గీ॥ రాజదరుణాంగుళీదళరాజియుతము
నఖమరీచికేసర మిలానాథ! నీదు
పాదపంకజ మిది ధరింపంబడియెడి
క్షితితలేంద్రులచే నిజశిరములందు. 57

గీ॥ అంగుళులమున్నయినవానియందు దళత
మున్నయినవియుఁ బదమునఁ బుష్కరతయు
నోలి నారోపితములుగా నుచితమైన
పదముఁ జేర్చుట సకలరూపకమగునిది. 58

## అవయవరూపకము

గీ॥ అధరపల్లవస్ఫురణసమన్వితంబు
తావకీనాననంబు ముక్తాద్యుతులయి
వఱలు ఘర్మాంబుబిందుమంజరులఁ దాల్చెఁ
గారణ మ్మేమియుం జండి! కానఁబడదు. 59

గీ॥ స్వేదజలమును మంజరిఁజేసి కెంపు
మోవిఁ బల్లవమునుజేసి మోమవయవి

యన్యథా చేయఁబడదయ్యె నట్లగుటను
రూఢ మగు నిది యవయవరూపకమన. 60

## అవయవిరూపకము

గీ॥ ఈముఖాంబుజ మాలోహితేక్షణంబు
వల్గితభ్రూవిలాసవిభాసురంబు
నిర్గళద్ఘర్మజాలంబు నిర్ణయముగఁ
బ్రకటిత మొనర్చెడిన్ మదావస్థ నిపుడు. 61

తే॥గీ॥ అవికృతములుగఁజేసి ముఖాఙ్గములను
నెమ్మొగమ్మును జేసెను నీరజముగ
నిచ్చటన్, గావునన్ వచియింత్రుదీని
గావ్యవిదు లవయవిరూపకంబటంచు. 62

## ఏ కాం గ రూ ప క ము

తే॥గీ॥ రక్తనేత్రోత్పల మనోహరంబయి మద
పాటలకపోలమైన నీవదనమిట్టి - మంత
ముగ్ధజనుని పీనినిగూడ మోహనాంగి।
మార్చివైచెఁ బూర్తిగ రాగమయునిగాఁగ. 63

కం॥ ఏకాంగరూపకంబిది
యాకరణిన్ ద్విప్రభృతులనేనంగములన్
వాకొందురు రూపించి, భి
దాకరములు నగు నయుక్తాయుక్తలున్. 64

## యుక్తరూపకము

తే॥గీ॥ మందహాసప్రసూన సమంజసంబు
చంచలవిలోచన భ్రమరాంచితంబు
వదనమనఁగ సంగతి సుమభ్రమరములకు
రూఢమగుఁ గాన తగు యుక్తరూపకంబు. 65

## అయుక్తరూపకము

గీ॥ ఆర్ద్రమందహాసజ్యోత్స్నమగుచు స్నిగ్ధ
నయననీరజమైన యాననమిదియన
వెన్నెలకుఁదమ్ములకయోగమున్నకతన
నిది యయుక్తరూపకమనియెంచఁబడును. 66

## విషమరూపకము

గీ॥ అఙ్గిరూపణముండుట నఙ్గములకు
రూపణమరూపణమ్మును జూపఁబడుట
విషమరూపకమనఁగను వెలయుచుండు
లలితమై యిదియెట్లు చెలంగుననిన. 67

గీ॥ పుష్పబాణుండు నర్తితభ్రూలతమయి
పొల్పుఁగని మదరక్తకపోలమైన
త్వన్ముఖేందుబింబముచే భువనములెల్ల
సారసాక్షిరో! మర్దింపఁజాలియుండు, 68

## సవిశేషణరూపకము

గీ॥ శిరమునన్ జాహ్నవీజలాంబరము వఱల
నసురభయము దొలంగిన యమరవరుల
సమ్మదోత్సవధ్వజమయి జానుమీఱి
యతిసముత్కృష్ట మగుచుండు హరిచరణము. 69

తే॥గీ॥ సురుచిరవిశేషణాఢ్యమై పరిఢవిల్లు
నిట్టి కేతువు రూపం బిదెద్ది కలదొ
అది పదంబున నర్పితంబౌటఁ జేసి
రూఢమగు సవిశేషణరూపకంబు. 70

## విరుద్ధరూపకము

తే॥గీ॥ తోయజంబుల ముకుళింపఁజేయలేఁడు
నభమున వగాహనంబు నొనర్పలేఁడు
త్వన్ముఖేన్దుండు మామకప్రాణహరణ
మందుమాత్రమె సునిపుణుం డగుచు నుండె. 71

తే॥గీ॥ శీతకిరణుని పనులను జేయమియును
బెఱపనిన్ జేయుటయును జూపింపఁబడియె
దీనియందటు కావున దీని బుధులు
పలుకుచుందురు విరుద్ధరూపక మటంచు. 72

## హేతురూపకము

తే॥గీ॥ వార్ధివైతి గంభీర భావంబుచేత
గౌరవముచేత నైతివి క్ష్మాధరంబ

వెల్లలోకులు గోరిన విచ్చుచుంట
నెగడుచుంటివి కల్పావనీజమగుచు. 73

తే॥గీ॥ ఇచట గంభీరతాదిక హేతువులను
వార్ధిగా గిరిగాఁ గల్పపాదపముగఁ
జేయఁబడియె నొక్కఁడు. దానఁజేసి యిద్ది
హేతురూపకమని వచియింపఁబడియె. 74

## శ్లి ష్ట రూ ప క ము

తే॥గీ॥ సకియరో! భ్రమరప్రార్థ్యసౌరభమయి
రాజహంసోపభోగార్హమై జగమున
నీదు వదనాంబుజంబు వన్నెఁగనె ననఁగ
శ్లిష్టరూపక మియ్యది చెలఁగుచుండు. 75

## ఉపమారూపక వ్యతిరేకరూపకముల లక్షణములు

తే॥గీ॥ తగువిధమున సాధర్మ్యవైధర్మ్యములవి
గౌణముఖ్యమ్ములకు వొగిఁ గానఁబడిన
ఖ్యాతిఁగను నుపమారూపకంబన వ్యతి
రేకరూపకమన నొలి రెండెటులన. 76

## ఉ ప మా రూ ప క ము

తే॥గీ॥ ఈముఖేందుండు మదముచే నెఱ్ఱవడి శ
శాంకునుదయనమయరాగ సంకలితుని

నుఱకయెదిరించి గర్జించుచుండె ననఁగ
రూఢిగనుచుండెడి నుపమారూపకంబు. 77

## వ్యతిరేకరూపకము

తే॥గీ॥ కువలయాప్తుని వేలుపుల్ గ్రోలుచుండ్రి
తావకముఖేందువిన్ నేను ద్రావుచుందు
నైన నతఁడెప్డు ననమగుఁ దా వితండు
మసలు నెప్పుడు నాపూర్ణమండలుఁ డయి. 78

## ఆక్షేపరూపకము

తే॥గీ॥ పడతి ! యిట్టులనో ్యపతాపంబు సేయు
నీదు ముఖచంద్రమునకు సంవాది కాదు
సుమ్ము చంద్రత్వ మని చెప్పుచోట నన్వ
యించి యాక్షేపరూపకం బంచిత మగు. 79

## సమాధానరూపకము

తే॥గీ॥ చణ్డిరో ! తావకీనాస్యశశిసహిత మొ
కించుకయు దయలేక దహించు నన్ను
నాదు దురదృష్టమే కారణం బనంగ
నది సమాధానరూపకంబగుచు నుండు. 80

## రూపకరూపకము

తే॥గీ॥ ఈముఖాబ్జరంగమునందు నృత్యమును బొ
నర్చుచుండెడి భ్రూలతానర్తకి యిదె

లీలగా నని వర్ణింపఁ బ్రాలుచుండు
రుచిర మగుచుండి రూపకరూపకమ్ము. 81

## తత్త్వాపహ్నవరూపకము

తే॥గీ॥ నీదునెమ్మొగమిదికాదు. నీరజమిది
కన్నులియ్యవికావు భృంగంబులివ్విఁ
కేసరమ్ములే సుమ్మివి కీరవాణి!
తావకీనదంతప్రభల్ కావు కావు. 82

తే॥గీ॥ వదనతాముఖ్యధర్మనివర్తనం బొ
నర్చి పద్మాదులుగ రూపణంబుఁ జేసెఁ
గాన ప్రోద్భావితగుణప్రకర్షమగుచుఁ
బ్రాలుఁ దత్త్వనిహ్నవరూపకంబన విది. 83

తే॥గీ॥ రూపకోపమల వికల్పరూపములకు
మేలులేనికతమ్మున మేము దిక్ప్రి
దర్శనముఁ జేసితిమి. కాన తద్విధులొగి
నూహసేయంగవలయు నను క్రములను. 84

రూపకచక్రము ముగిసెను.

## దీపకాలంకారము

తే॥గీ॥ తగఁగ జాతిక్రియాగుణ ద్రవ్యవాచి
శబ్దమొకఁడొక్కచో నుండి సకలవాక్య

ములకు నుపచరించిన నది బుధులుచెప్పు
చుందు దీపక, మదియెట్టులుండుననిన. 85

## ఆ ది జా తి దీ ప క ము

తే॥గీ॥ దక్షిణసమీరణుండు సుతారముగను
లతల జీర్ణపర్ణములను లాగుచుండె
వాఁడె యవనతాంగుల మానభంజనమ్ము
సలుపఁగా నెంతయేనియుఁ జాలియుండె. 86

## ఆ ది క్రి యా దీ ప క ము

తే॥గీ॥ మసలుచున్నవి తావక మదగజములు
వారిధిచతుష్క వేలోపవనములందు
కుందరుచులు నీగుణములుగూడఁజక్ర
వాళభూమీధర నికుంజపాళియందు. 87

## ఆ ది గు ణ దీ ప క ము

తే॥గీ॥ శ్యామలములయ్యె సర్వదిశాంతరములు
ప్రావృషేణ్యపయోధరపటలిచేత
నేలలున్ సుకుమారతాశాలినూత్న
శాద్వలావళీసుషమాపరిసరముచేత. 88

## ఆ ది ద్ర వ్య దీ ప క ము

ఆ॥ విష్ణుమూర్తిచేత వికసిమాధ్యతచేత
పూర్వదేవతల విభూతులెల్ల

నెటకొ చేర్పఁబడియె. నెచ్చటినుండియో
దేవతద్ధ్వజాలెల్లఁ దేరఁబడియె. 89

తే॥గీ॥ ఇట్టులాదిదీపకము లుదీరితంబు
లీపగిది మధ్యమందుననిట్టులే చి
వరనువాక్యములందు నవ్వానిఁజూపు
వాఁడఁగొన్నిటి నవియెట్లువఱలుననిన. 90

## మ ధ్య జా తి దీ ప క ము

తేగీ॥ విమలపాదపముల క్రింద నృత్యమాడు
పాడుచుండు సంగీతంబు బర్హిణములు
సమ్మదాశ్రుగర్భములౌచు జానుమీఁబు
కన్నులంఁబయోదములమీదఁ గట్టివేయు. 91

## మ ధ్య క్రి యా దీ ప క ము

తే॥గీ॥ గంధవాహంబు మాంద్యసంగతము కాఁగ
మమృతరశ్మి దవానలం బగుచునుండె
మలయజమలందునప్పుడమ్మలయజంబు
పైఁబడుట శస్త్రపాతంబు పథికతతికి. 92

## అ ం త జా తి దీ ప క ము

తే॥గీ॥ అంబుదంబుల్ వెడలఁగ్రుక్కునట్టి జలము
ఇండ్లముందఱఁదిరుగు బర్హిణనివహము

చంచలంబు తటిల్లతా సంచయమును
పుష్పబాణునకుండెడి మూలబలము. 93

## అంతక్రియాదీపకము

తే॥గీ॥ నల్లకల్వ నీచేతఁ గర్ణంబునందు
స్మరునిచేత నస్త్రము శరాసనమునందు
చావుమీదను నాచేత సైతము మతి
యొక్కపరి మూఁడు నియ్యవి యుంచఁబడియె. 94

## మాలాదీపకము

తే॥గీ॥ విశదపక్షంబు విధునకు వృద్ధినొసఁగుఁ
బంచశరున కాశశియు నప్పంచశరుఁడు
రాగమునకును రాగంబు రక్తులైన
తరుణుల రతోత్సవశ్రీవిధానములకు. 95

తే॥గీ॥ ఆదిదీపక మగునిది యైనఁగాని
పూర్వపూర్వవ్యపేక్షచేఁ బొలుపుమీఱు
వాక్యమాల ప్రయోగింపఁబడియెఁగాన
సమ్మతమ్ము మాలాదీపకమ్మునాఁగ. 96

## విరుద్ధార్థదీపకము

తే॥గీ॥ పుష్పచాపున కవలేపమును గరంబు
వర్ధిలంజేయుచుండెడి వారిదములు

ఘర్మమునకును దగ్గింపఁ గలిగియుండు
గంధవాహ విఘాత శీకర భరములు. 97

తే॥గీ॥ వారిదపదము నపలేపపదముఁ గూడఁ
నొకటి యొకదానికి సరిపడక మెలంగు
క్రియలతోడ సంయుక్తంబు లయినకతన
దీనిపేరు విరుద్ధార్థదీపకంబు. 98

## ఏ కా ర్థ దీ ప క ము

తే॥గీ॥ ఆశల విశాలభావంబు నపహరించు
రిక్కల సమూహముల నెల్ల మ్రింగివేయు
నామప్రాణములంగొను నీదినమున
వ్యాపకంబయి యీ <u>పయోవాహమాల.</u> 99

తే॥గీ॥ పెక్కగు పదంబుల ప్రయుక్తి నొక్క క్రియయె
విషధరావళి కిపట దీపించుచుండెఁ
గాన యేకార్థదీపకాఖ్యను వహించి
యియ్యది విరాజిలును సూక్తి బృందమందు. 100

## శ్లి ష్టా ర్థ దీ ప క ము

తే॥గీ॥ హృద్యగంధవహంబులై యెంతయేని
తుంగములు తమాలాసితద్యుతియుతములు
మేఘములు నభమందు <u>భ్రమించుచుండె</u>
ధాత్రియందు సయిత మీమతంగజములు. 101

తే॥గీ॥ ధర్మములచే నభిన్నతఁ దాల్చినట్టి
జలధరములకును మతంగజంబులకును
భ్రమణముననె సంబంధంబు వఱలుచుండె
నీపగిదినుంట శ్లిష్టార్థ దీపకమిది. 102

తే॥గీ॥ ఇవ్విధంబుననే బుధులెఱుఁగవలయు
దీపకంబునయందు వర్తిల్లు నట్టి
మిగిలిన వికల్పములనెల్ల మృదుళసరస
సుందరార్థ సంస్కృతకవిసూక్తులందు. 103

దీపకచక్రము సమాప్తము.

---

## ఆవృత్త్యలంకారము

తే॥గీ॥ సమ్మతంబగు దీపకస్థానమందు
పొంకమైన పదావృత్త్యలంకరణము
లలితమైన యర్థావృత్త్యలంక్రియయును
లసితమౌ నుభయావృత్త్యలంకృతియును. 104

## అర్థావృత్తి

తే॥గీ॥ విరియుచుండెఁ గడిమిపూలు విచ్చుచుండెఁ
గదు మనోజ్ఞములై యొప్పు కొడిసెపూలు
కందళుల్ వికసించెడి నందముగను
తద్దయున్ విరిసెడి నేఱు మద్దిపూలు. 105

## పదావృత్తి

తే॥గీ॥ అంబుదంబు లుత్కంఠాభావంబుఁ గూర్చె
శ్రేణిగట్టి శిఖావళబృందమునకుఁ
బ్రనవశరుఁడు నుత్కంఠా భావంబుఁ గూర్చె
నెల్ల యువనివహంబుల హృదయములను. 106

## ఉభయావృత్తి

ఆ॥వె॥ విశ్వమును జయించి విహరించుచుంటి శు
ద్ధాంతసతులతోడ నవని నీవు
విబుధలోకమందు విహరించుచుండి ర
చ్చరలతోడ నీదు శత్రునృపులు. 107

ఆవృత్తిచక్రము.

## ఆక్షేపాలంకారము

తే॥గీ॥ అగు నిషేధోక్తి యాక్షేప మది త్రివిధము
మూఁడు కాలముల నిషేధ్యముల నెనయుట
మఱియు నాక్షేపభేదముల్ పరిమితములు
కావు కాన దీనికిఁ దుది గానఁబడదు. 108

## వృత్తాక్షేపము

తే॥గీ॥ ఐదు పూలబాణాల ననంగుఁడు జగ
మంతయు జయించె ననుట భావ్యంబు కాదు

కాదని తలంచుటయును యుక్తంబు కాదు
వస్తుశక్తు లద్భుతములై వఱలుచుండు. 109

తే॥గీ॥ అంగజజయం బసంభవం బనెడు బుద్ధి
వర్తిలినయదియే హేతుబలమువలనఁ
గాదనంబడుచుండెడిఁ గాన యిట్టి
దవనిఁ జెల్లు వృత్తాక్షేప మనెడి పేర. 110

## వర్తమానాక్షేపము

క॥ ఓకలభాషిణి! కువలయ
మే కతమునఁ జెపి నిడియెద? వెంచెదవాక్యా!
నీ కడకంటివిలోకన
మీకృత్యంబునకు శక్తిహీనంబనుచున్. 111

తే॥గీ॥ వల్లకల్వను గర్ణంబునందిడికొను
చుండఁగనె చాటువచన ప్రయుక్తిశక్తి
నాయకుండు విరోధించె నాయిక నిటు
లౌట వర్తమానాక్షేప మనఁబడు నిది. 112

## భవిష్యదాక్షేపము

తే॥గీ॥ లాతిసుదతి ముద్దిడుటచే లాతియంటి
రక్తమగుచుఁ గన్పట్టు నేత్రంబుతోడ
నీవు నన్ను గనుంగొన నేరవు హృద
యేశ్వరా! సూనృతము వచియించుచుంటి, 113

తే॥గీ॥ కలుగఁగల దెప్పుడో తప్పు కాంతున కని
యెంచుచున్ మనస్విని విరోధించె విట్లు
ముందుగానె కావున నిది బుధులచేతఁ
జెప్పఁబడును భవిష్యదాక్షేప మనుచు. 114

## ధర్మాక్షేపము

తే॥గీ॥ తావకాంగంబులందు మార్దవము మిథ్య
యే యగును సుమ్ము తన్వంగి ! యిది విరూధి
మృదుతయే సత్యముగ నున్న నేల హేతు
వించుకయు లేక నన్ను బాధించుచుండు ? 115

తే॥గీ॥ ముదితగాత్రమార్దవము కాముకునిచేత
దానికి విరోధియైన కృత్యమ్ము కలిమి
నిచట నాక్షిప్తమయ్యెడి నిట్లు. కాన
తనరు నిద్ది ధర్మాక్షేప మనెడిపేర. 116

## ధర్మ్యాక్షేపము

తే॥గీ॥ సుందరి యటంచుఁ గాని యసుందరి యని
కాని యీవివేకం బెట్లు కలుగఁ గలదు ?
చంచలంబైన పత్రిభయె కాంపంగఁబడెడి
దాని యాశ్రియ మింతయుఁ గానఁబడదు. 117

తే॥గీ॥ అనుమతింపంగఁబడెఁ బ్రభయనెడి గుణము
ధర్మి యాక్షిప్తమయ్యె నత్యంతచిత్రి

మైన రూపుఁ జెప్పఁగ నెంచు వానిచేత
నిట్టులౌట ధర్మాక్షేప మియ్యదియగు. 118

## కా ర ణా క్షే ప ము

క॥ కను లెఱ్ఱనయ్యె నధర
మ్మను పల్లవ మదరఁదొడఁగె. నవె ఘర్మములౌ
య్యెను నీ కనుబొమ్మలు. నై
నను గలుగదు తప్పులేనినాకు భయ మెదన్. 119

తే॥గీ॥ భయమునకు ముఖ్యకారణంబైన స్వాప
రాధము నిషిద్ధమయ్యెను బ్రౌఢుఁడైన
ప్రియునిచేతను. గావునఁ జేర్కొనంగఁ
జెల్లు నియ్యది కారణాక్షేపమనుచు. 120

## కా ర్యా క్షే ప ము

తే॥గీ॥ ప్రాణవల్లభుఁ డుండె దూరమ్మునందు
నంబుదములతో వానకాలంబువచ్చె
గనుఁగొనంబడుచుండె పుల్లనిచుళములు
మృతిని గాంచకపోతి నిదేమి యొక్కొ। 121

తే॥గీ॥ దారుణాంబుదాగమమను కారణంబుఁ
జెప్పి తత్కార్యమరణనిషేధ మిచటఁ
జేయఁబడుటచే నియ్యది చెప్పఁబడును
ఘనులచేతఁ గార్యాక్షేపమనెడిపేర. 122

## అనుజ్ఞాక్షేపము

తే॥గీ॥ నీ పయన మిది చిరకాలతాపకారి
నాకగుట సంభవింపదు నాథ! పొమ్ము
పోవుపక్షంబునం దిట్టులీవిషయము
నందు వలవ దాశంక నీడెందమునకు. **123**

తే॥గీ॥ ఇట్లనుజ్ఞాముఖంబుననే మరణము
సూచనమొనర్చుచునె మనోజ్ఞుని పయనము
కాంత యొకతె నిషేధించెఁ గావున బుధు
లందు రిది యనుజ్ఞాక్షేప మగు నటంచు. **124**

## ప్రభుత్వాక్షేపము

తే॥గీ॥ కుశలము సుఖమ్ము నీకుఁ జేకూరఁగలదు
ద్రవిణలాభంబుతోడ మార్గంబునందు
ప్రాణవిషయసంశయము నాకైనఁ గలుగ
కైనఁ బోవలవదు నీవు ప్రాణనాథ! **126**

తే॥గీ॥ ప్రాణనాథ ప్రయాణాను బంధిహేతు
వులను వచియించుచుండియుఁ బొలతి యిట్లు
ప్రాభవముచేతనే యడ్డపఱిచె నతనిఁ
గాన యిది ప్రభుత్వాక్షేపమై నెగడెడి. **126**

## అనాదరాక్షేపము

తే॥గీ॥ బ్రతుకుమీది యపేక్షయే ప్రబలతమము
ద్రవిణమంధలియాశ దుర్బలము నాకుఁ

బొమ్మ పోకున్నచో విలువుముహృదీశ ।
తెలియఁజేసినదాన నాస్థితిని నేను.. 127

తే॥గీ॥ చెలువుని ప్రయాణ మడ్డగించెడి నిరూఢిఁ
గడు ననాదరముగఁ బల్కెఁగాంత యొకతె
ప్రిణయపారవశ్యప్రభావంబుచేత
నిది యనాదరాక్షేపమంచెన్నఁబడును. 128

## ఆ శీ ర్వ చ నా క్షే ప ము

తే॥గీ॥ పోవునట్టిపక్షమునందుఁ బొమ్మునాథ ।
నీకుఁదోవలు శుభములై నెగడుఁగాత
నీవుపోయెడుచోటనే నేనుగూడ
జన్మమెత్తుట తప్పక జరుగుఁగాత. 120

తే॥గీ॥ గరిత యాశీర్వచించుమార్గమునఁ దనయ
వస్థ సూచించుచుండియే వల్లభు పర
దేశయాత్రను దా నిషేధించుట నిది
చెల్లు నాశీర్వచనమయాక్షేపమనఁగ. 130

## ప రు షా క్షే ప ము

తే॥గీ॥ నీదు ప్రస్థాన మియ్యది నిజమయేని
పెలువధూమణి నిక నీవు వెదకికొనుము
నందు దొరకునో । యని నిరీక్షణము సేయు
మిత్తి యిప్పుడే నన్నాక్రమించుచుండె. 131

క॥ ప్రేమవశీకృతయై యొక
కామిని పరుషముగఁ బల్కి పతివయనమ్మున్
దా మానిపించెఁ గావున
నామాద్కి విరచనము పరుషాక్షేపమగున్. 132

## సాచివ్యాక్షేపము

తే॥గీ॥ పోవునెడల శీఘ్రంబుగాఁ బొమ్ము నాథ!
యార్తబంధుముఖోద్గీర్ణమై ప్రియాణ
మునకుఁబరిపంధియగుచుండఁబోవునట్టి
శోకరవతతి నీచెవి సోకఁగలదు. 133

క॥ సాచివ్యము సేయునాకో!
యీచెలి యనఁబల్కి నాథు నేగవలదనెన్
సూచనగ రక్తయౌ సతి
సాచివ్యాక్షేపమనఁగఁ జను నిది నుడులన్. 134

## యత్నాక్షేపము

తే॥గీ॥ అరుగుమనుచును నీకుఁ బ్రియంబుగాఁగఁ
బలుకవాంఛింతు మత్ప్రియవాంఛఁజేసి
నోటనుండి వెడలుచుండు మాట యరుగ
వలదనుచు నేమిసేయంగఁగలను నేను. 135

క॥ అనభిలషితార్థమున గూ
ర్చిన యత్నమ్మునకు సువిపరీతఫలము గ

ల్గిన కతన వ్యర్థతం జూ
పిన యత్నాక్షేపమనుచుఁ బేర్కొనఁబడెడిన్. 136

## పరవశాక్షేపము

తే॥గీ॥ క్షణముసేపు దర్శనవిఘ్నకరమటంచు
మెప్పపాటుపైఁ గోపించు ప్రేమకీవు
చెప్పుము ప్రయాణ మయ్యెది యొప్పుకొనిన
నాకు నేభంగి యగును మనఃప్రియంబు. 137

తే॥గీ॥ ప్రేమపరతంత్రయైన నారీమణి యిటు
లాతికృత్యంబుఁ జూపుటచేతఁ బ్రియుని
పయనమును నిషేధించుచుఁ బలికెఁగాన
చెల్లు నియ్యది పరవశాక్షేపమనఁగ. 138

## ఉపాయాక్షేపము

తే॥గీ॥ విరహము సహింపఁగల నొకవిధము వినుము
నాథ! నాకిమ్మదృశ్యాంజనంబు, దాని
గన్నులం బెట్టికొనినచోఁ గంజశరుఁడు
గొట్టుటకుఁ దాను నన్నుఁ గన్గొనఁగలేఁడు. 139

తే॥గీ॥ దుష్కరోపాయ మొకటి బ్రతుకుట కొఱకుఁ
దొయ్యలి యుపన్యసించి నాథుని పయనము
దా విరోధించెఁ గాన యేతాదృశంబు
ఘనులచే నుపాయాక్షేప మనఁగఁబడును. 140

## రోషాక్షేపము

క॥ వోయెద నవియెడి వాక్యము
నీ యాస్యమునుండి వెడలనే వెడలెను నా
థా! యేగకున్న నేమి? క
నీయఃప్రిణయుండవైన నీతో నాకున్. 141

తే॥గీ॥ సమధికస్నేహ యంత్రితస్వాంత యొకతె
ప్రాణవల్లభు సంసిద్ధమైన యాత్ర
గాంచి సంరంభమున నిషేధించెఁగాన
తనరుచుండు రోషాక్షేప మనఁగ విద్ధి. 142

## మూర్ఛాక్షేపము

తే॥గీ॥ ప్రియుని యాత్రావృత్తాంతంబు వినుటతోన
ముగ్ధయౌ నాయిక యొకర్తు మూర్ఛగాంచెఁ
దెలివి రాఁ బ్రియునిం గని పలుకఁ దొడఁగెఁ
జాలకాలమునకు వచ్చితేల? యనుచు. 143

తే॥గీ॥ ముగ్ధ తత్కాలసంజాతమూర్ఛ యగుచుఁ
బెదరుచూపులతో మనఃప్రియుని యాత్ర
నిటు నిషేధించెఁ గావున నీదృశంబు
దనరుచుండు మూర్ఛాక్షేప మనఁగఁబడుచు. 144

## అనుక్రోశాక్షేపము

తే॥గీ॥ అంగనలు మూర్ఖానమిఁ జెవియందు విడమిఁ
బ్రియమయిన మద్యమందు నర్పింపకునికి

సీదు రిపుల దీర్ఘికల నిందీవరములు
దిగ్గియలయంద వసివాడి మగ్గిపోవు. 145

తే॥గీ॥ కలువపై నను క్రోశంబు గలిగినట్లు
దాని యోగ్యోపయోగంబుఁ దలఁగఁద్రోసి
శోచనీయమౌ వస్తును జూపెఁ గాన
యది యనుక్రోశనాక్షేప మగుచునుండు. 146

## శ్లిష్టాక్షేపము

క॥ అమృతాత్మకుఁ డగుచుం బ
ద్మములకు శత్రువయి స్నిగ్ధతారకుఁడై నీ
దుముఖేందు డీతఁడుండఁ బె
ఱమృగాంకునితోడనేమి ? ప్రస్తావమికన్ 147

తే॥గీ॥ ముఖ్యచంద్రుని గుణములఁ బోలియుండు
గౌణచంద్రుని గుణములఁ గనఁబఱుచుచు
ముఖ్యచంద్రు నాక్షేపణంబు నిటఁజేసెఁ
దనరువిద్ది శ్లిష్టాక్షేపమనగఁ బడుచు. 148

## అనుశయాక్షేపము

ఆ॥వె॥ అల్పమైన నర్థమార్జింపఁ బడలేదు
చదువఁ బఱగఁలేదు చదువొకఁడును
స్వల్పమైన తపము సల్పంగఁబఱలేదు
కడచిపోయినది సకలవయస్సు. 149

తే॥గీ॥ ఈమెయి ధనార్జనాదులు లేమి నిచట
బహుళమగుచుఁ బశ్చాత్తాపభావమొప్ప
వయసు గడచిపోయినయట్టివాఁడు సూపెఁ
జెల్లు నియ్యది యనుశయాక్షేపమనఁగ. 150

## సంశయాక్షేపము.

తే॥గీ॥ అగునొకో। యిది శారదమంబువాహ
మయ్యెడినొయేమొ। యియ్యది యంచపిండు
అంచెదప్పుదుతోఁదుల్యమైన రుతము
కర్ణములసోకెఁగాన మేఘంబుగాదు. 151

తే॥గీ॥ అంబుదంబులఁ గనఁబడనట్టిదియును
హంసకులసహజంబయి యమరునదియు
నైన రుతమున సంశయం బపనయించు
కొనెఁగనుక సంశయాక్షేప మనఁబడునిది. 152

## అర్థాంతరాక్షేపము.

తే॥గీ॥ విక్రమము తావకీనంబు విశ్వమెల్ల
నాక్రమించియు శాంతింపదయ్యె నహహ!
దండిమంటల గనగన మండుచుండు
ననలునకుఁ దృప్తియెప్పుడు గనఁబడియెడి. 153

తే॥గీ॥ కలిగినట్టి విస్మయము, దశాక్కారణమును
తోలియుండు నర్థాంతరంబు నొకదాని

గనుటవలన వివారించుకొనఁబడె విది
చెల్లుచుండు నర్థాంతరాక్షేపమనఁగ. 154

## హే త్వా క్షే ప ము

తే॥గీ॥ తావకీన వి త్తంబును దమధనమను
నూహ నర్థులు గ్రహియించుచుంటఁ జేసి
యిచ్చుచుండెదవని నుతియింపఁబడవు
మానవేశ్వర! నీవెపుడైనఁగాని. 155

తే॥గీ॥ తనరుచుండు హెత్వాక్షేపమనెడి పేర
నీపగిదిఁ జెప్పఁబడెడి యాక్షేపమెల్ల
దిక్ప్రదర్శనమిది. లాతితీరులింక
నిట్టులే యుండు ననుచు నూహింపవలయు. 156

ఆ క్షే ప చ క్ర ము

---

## అర్థాంతరన్యాసాలంకారము

తే॥గీ॥ వస్తువును నొకదానిని బ్రస్తుతించి
దాని సాధించుటకు సమర్థమయినట్టి
యితరవస్తువునున్ న్యసియించుటఁ దెలి
యంగవలయు నర్థాంతరన్యాసమనుచు. 157

## అర్థాంతరన్యాసభేదములు

సీ॥ అదియు విశ్వవ్యాపి యనఁగ, విశేషస్థ
మనఁగ, శ్లేషావిద్ధమన, విరోధ
వంతంబనెడుపేరఁ బ్రఖ్యాతమనఁగ న
యుక్తకారి సమాఖ్య నొప్పెడిదన
యుక్తాత్మయనఁబడుచుండెడిదనఁగ, యు
క్తాయుక్త నామకమనఁగనున్, వి
పర్యయంబనుపేర వర్తిల్లునదియన,
విలసిలు నెనిమిది భేదములను

తే॥గీ॥ ఇట్టిభేదంబులింకఁ గన్పట్టుచుండు
దీనికిఁ బ్రయోగములయందు, వీనికిని ను
దాహరణముల మాల నిదర్శనముగ
రూపములు వ్యక్తములుగాఁగఁ జూపువాఁడ. 158

### విశ్వవ్యాపి

తే॥గీ॥ లోకములకెల్లఁ గన్నులౌ లోకపాలు
రు భగవంతులు రవియుఁ జంద్రుఁడును గూడ
నస్తమించుచునే యుందు రదియువయ్య
దాటఁగాఁగలఁ డెవ్వండు దైవగతిని? 159

### విశేషస్థము

తే॥గీ॥ దేహధారుల తాపంబు దీసివేయు
నీరదంబులు చల్లని నీటి నొసఁగి

పెలల దుఃఖంబు శమియించుకొఅకుఁగాదె!
పుడమిపై మహనీయులు పుట్టుపెల్ల. 160

## శ్లేషావిద్ధము

తే॥గీ॥ కలుగఁజేసెడిఁబ్రీతి జగములకెల్ల
మలయశైల సమాగతమారుతంబు
అందఱకుఁ బ్రేమభాజనం బగునుగాదె!
యవని దాక్షిణ్యసంపన్నుఁడైన వాఁడు. 161

## విరోధవంరము

తే॥గీ॥ విశ్వము వితండు సంతోషపెట్టుచుండుఁ
జాలమలినుండు నయ్యు నిశాకరుండు
ఒరులపై ననుగ్రహ ముంచుచుండుఁగాదె
యెంతయు సదోషుఁడయ్యు ద్విజేశ్వరుండు. 162

## అయుక్తారి

తే॥గీ॥ అంబుజాతమరందపానంబు వలనఁ
గడు మధురమైన షట్పదకంఠరుతము
పైతమతి కటువయ్యె నాశ్రవణములకుఁ
గాముకుల పాతకమ్ము రికరణినుండు. 163

## యుక్తార్త

తే॥గీ॥ ఇదె మదీయాంగకమును దహించుచుండెఁ
బద్మదళములచే నమర్పఁబడి శయ్య

హవ్యవాహన ప్రతినిధియై మనుపదీ
దాహశీలమౌచుండ యుక్తంబకాదె ।  16

యుక్తాయుక్తము

తే॥గీ॥ శీతకిరణుండు క్షీణింపఁ జేయుఁగాక
నను వసంతుఁడు బాధపెట్టు నిదియేల ?
మలినుఁడౌవాఁడు చేయుకర్మంబు సుకవి
యైన వానికిఁ గడు నయోగ్యంబకాదె ।  165

విపర్యయము

తే॥గీ॥ కైరవంబులు సైతము గాల్చుచుండెఁ
బద్మములమాట మేముచెప్పంగఁ గలము
ఇందుగృహ్యంబు లుగ్రతనొందుచుండ
భానుగృహ్యంబులకు మార్దవం బమరునె ?  166

అర్థాంతరన్యాసచక్రము.

## వ్యతిరేకాలంకారము

తే॥గీ॥ వ్యంగ్యమైకాని శబ్దవాచ్యమయికాని
రెండువస్తువులకుఁ బోల్కి యుండినపుడు
వానిభేదంబు చెప్పంగఁబడుటనునది
వాకొనంబడియెడి వ్యతిరేకమనుచు.  167

## శ బ్దో పా త్త సా దృ శ్య ము

### ఏ క వ్య తి రే క ము

తే॥గీ॥ ధీరతయును లావణ్యగభీరతలును
మున్నుగాఁగల గుణములఁ బోలుచుంటి
వారిరాశిని నీవిటువంటిదైన
నీదు నెమ్మోవిచేతనే భేదమొదవె. 168

తే॥గీ॥ ఒక్కయుపమానమునయందు నుండునదియొ
ఒక్కయుపమేయమునయందు నుండునదియొ
ధర్మముభయగతమగు భేదమును దెలుప
నీకరణిని నేకవ్యతిరేకమగును. 169

### ఉ భ య వ్య తి రే క ము

క॥ వేలాలంఘన మెఱుఁగరు,
వాలఁగ గంభీరులీవు జలరాశియునున్
నీలుఁ డతఁడు కాటుకవలెఁ
గ్రాలెడి, బంగారమట్లుగా నీ కాంతుల్. 170

తే॥గీ॥ ఉభయులకు భేదకంబులై యొప్పు నలుపు
పసిమి యను గుణములిటఁ జూపంగఁ బడియె
వేఱువేఱుగఁ గావున విలసిలునిది
పృథివిపై నుభయవ్యతిరేక మనగఁ 171

## సశ్లేషవ్యతిరేకము

క॥ వారిధియు నీవునున్ దు
ర్వారులు తేజోయుతు లనివారితసత్త్వుల్
మీరిరుపురకిది భేదము
వారినిధి జడాత్మకుండు పటువగుదీవున్. 172

తే॥గీ॥ అదియె శ్లేషరూపంబుగా నమరె నిచటఁ
గాన సశ్లేషమని దీని గనుఁగొనుండు
తొడరి సాక్షేపమును సహేతువునవియెడి
ద్వయమదియుఁ గూడఁ జూపింపఁ బడెడివింక. 173

## సాక్షేపవ్యతిరేకము

తే॥గీ॥ స్థితియుతంబయ్యు నెంతయు ధీరమయ్యు
రతనముల కాకరంబయ్యు రాజ! నీదు
కక్షఁ జేరంగలేదయ్యెఁగాదె మలిన
మగుచుఁ గన్పట్టు నిమ్మకరాలయంబు. 174

## సహేతువ్యతిరేకము

తే॥గీ॥ గిరినరి ద్వీపవనధిసంకీర్ణమైన
యుర్విసకలంబు వహియించుచుండెఁగాని
భుజగభర్తయొచుంటచే భూమిపాల!
అతివిక్రమ్యుండు నీకన్న నయ్యహిపతి. 175

తే॥గీ॥ శబ్దములచే నుపాత్తమై సామ్య మొప్పు
నట్టి వ్యతిరేక మిట్టిదియై చెలంగు
సామ్యము ప్రతీయమానమై జానుమీఱు
నట్టి వ్యతిరేకమును గల దది వచింతు. 176

## ప్రతీయమానసాదృశ్యవ్యతిరేకము

ఆ॥వె॥ నీదువెన్నెలగంబు నీరజంబనునట్టి
రెండువస్తువులకు నుండు భేద
మియ్యదియె. పయోజమేర్పడు జలమున
విన్న బాయకుండు నీదుమోము. 177

తే॥గీ॥ భ్రూవిలాసముల్ మదరాగమును మృగేక్ష
ణంబులం దెప్పుడైనఁ గానంగరావు
నీదుకనుదోయి యన్ననో వెగడుచుండు
నాగుణంబులతోఁగూడి యనవరతము. 178

తే॥గీ॥ వెనుకటి యుదాహరణమున భేదమొకఁడె
చెప్పఁబడియెఁ గన్పట్టెడి గొప్పఁదనము
దీనియందు. లాతిగనుండు దానిని వివ
రించెదన్ సదృశవ్యతిరేకము నిఁక. 179

## శబ్దోపాత్తసాదృశ్యసదృశవ్యతిరేకము.

తే॥గీ॥ పుండరీకంబు నీముఖంబును సుగంధ
ఘుండునవియును వికసించియుండునవియు

భ్రమరములు దిరుగాడు నబ్జమునయందుఁ
గదలుఁ గన్దోయి నీ నెమ్మొగమునయందు. 180

## ప్రతీయమాన సాదృశ్యసదృశ వ్యతిరేకము

తే॥గీ॥ అంబరోత్తంసమగును శశాంకుఁ డితఁడు
హంసమిది యంబుభూషణం బగుచునుండు
శ్రేణులై నభమునయందు రిక్కలొప్పుఁ
గ్రాలు జలముల వికసిల్లి కైరవములు. 181

తే॥గీ॥ శ్వేతిమాది సాదృశ్యప్రతీతి యొప్పు
చంద్రునకు హంసమునకును. స్వచ్ఛభావ
మంతటఁ బ్రతీతమైన వ్యోమాంబువులకు,
భేదమిద్దానియందుఁ జూపింపఁబడియె 182

తే॥గీ॥ ఆదియందుఁ జూపిన యుదాహరణమందుఁ
బ్రకటితంబు సామ్యంబు శబ్దములచేత,
భృంగనేత్రాదిభేదకాల్ రెంటసమము
కతన సదృశవ్యతిరేకములివి. 183

## స జా తి వ్య తి రే క ము

తే॥గీ॥ మణుల కాంతులు సంహరింపంగలేవు
తేసి రవికిరణములు వారింపలేవు
దర్శన విరోధకంబయి తరుణజనుల
యౌవనోదయ సంభూతమైన తమము. 184

తే॥గీ॥ తమము. చీఁకటిజాతికి దర్శనంబు
నడ్డగించుటచే సమంబగుచునుండి
యన్యధర్మములన్ భిన్నమయ్యెననుట
దృథ్వి విది సజాతివ్యతిరేకమగును. 185

ఇది వ్యతిరేక చక్రము.

## విభావనాలంకారము

తే॥గీ॥ సుప్రసిద్ధవిదానంబు శూన్యమగుట
నెద్దియేనియునున్ లాతిహేతువైన
సాజమౌచుంటయైన నెచ్చట విభావ్య
మగునొ దాని విభావన యనఁగవలయు. 186

## కారణాంతర విభావన

తే॥గీ॥ అకృతమధుపాన మత్తమౌ హంసవితతి
ఉడువఁబడక విర్మలమైన యుడుపథంబు
తేర్పఁబడక తేటగను వర్తిలు జలంబు
గలిగి జగము గడున్ మనోజ్ఞమగుచుండె. 187

## అర్థస్వాభావికత్వవిభావన

తే॥గీ॥ పిలమొఁగాటుకిడకుండ నీదుదృష్టి
వంచఁబడక నీ బొమ లొప్పు వంపుగలిగి

రంజితముగాకఁ నీ మోవి రక్తమగును
సుందరీమణీ! నీయంద మెందుఁగలదు. 188

## శాబ్దస్వాభావికత్వవిభావన

తే॥గీ॥ మోము నైసర్గికామోదపూరితంబు
తనువు నిర్వ్యాజ భూరిసౌందర్యయుతము
శశధరుండు నిష్కారణశాత్రవుండు
కంజశరుఁ డనిమిత్తంబుగా రిపుండు. 189

తే॥గీ॥ కారణ వివర్తనంబు సాక్షాత్తుగ నలు
పంగఁబడె నిసర్గాదిశబ్దములచేతఁ
బ్రోక్తమయ్యెను సౌరభముఖ్యఫలము
కావున విభావన యనంగఁ బ్రాలెడి నిది 190

ఇతి విభావనాచక్రము.

---

## సమాసోక్త్యలంకారము

తే॥గీ॥ ఒక్కవస్తువు మనమునందుంచుకొనుచు
దానితోఁ దుల్యమైన వస్త్వంతరమును
జెప్ప సంక్షేపరూపమై చెలఁగుచుంట
నొప్పుకొనఁబడు నది సమాసోక్తి యనుచు, 191

## కార్యఘటితసమాసోక్తి

తే॥ గీ॥ కాంక్ష దీరంగ పుల్లపంకజమునందు
సారమకరందమును గ్రోలిషట్పదంబు
పూర్తిగా సౌరభంబును బూననట్టి
కుట్మలంబును ముద్దిడికొనెడిఁజూడు. 102

తే॥గీ॥ ప్రౌఢయౌ కాంతమీద నిబద్ధమైన
రతివిలాసము గలిగిన రాగియొకఁడు
బాలయౌ లోలనేత్రపై వాంఛయిడుట
దీనియందెంతయు విభావ్యమానమగును. 103

తే॥గీ॥ సన్నుగ విశేష్యమాత్రవిభిన్నమయ్యు
సదృశరూపంబులై విశేషణము లమర
నొక సమాసోక్తియొప్పు. నింకొకటిగూడ
వెలయుచుండు భిన్నాభిన్నభేదకంబు. 104

## తుల్యాకారవిశేషణసమాసోక్తి

తే॥గీ॥ రూఢమూలతనొప్పి యర్థులను నిచ్చ
ఫలభరంబులఁ బోషణసలుపుచుండు
గొప్ప వృక్షంబు సాంద్రమై యొప్పుఛాయ
తోడఁ దనరారునట్టిది దొరకె నాకు. 105

## భిన్నాభిన్నభేదకసమాసోక్తి

తే॥గీ॥ అధికతమవిటపాభోగమగుచునుండి
స్థైర్యముగలట్టిదగుచు సుచ్ఛాయమగుచు

ఫలకుసుమ సమృద్ధిగల్గిన పాదపంబు
భాగ్యవశమున నాకు సంప్రాప్తమయ్యె. 196

తే॥గీ॥ రెండుదాహరణములందు వృక్షముగను
బరఁగ వర్ణింపఁబడియెను బురుషుఁ డొకఁడు
అన్నియు సమానధర్మము లాద్యమందు
ద్వయము సమమగు లాతి నిదర్శనమున. 197

## అపూర్వ సమాసోక్తి

తే॥గీ॥ వ్యాళసంసర్గము వివృత్తమగుచునుండఁ
బ్రకృతి మధురాశయుండైన వార్ధి యతఁడు
కటకటా! శుష్కభావంబుఁ గాంచుచుండెఁ
బ్రబలము ననార్యమౌ కాలబలమువలన. 198

తే॥గీ॥ ఇట్లపూర్వ సమాసోక్తి యేర్పడెడిని
వెనుకఁగల ధర్మముల నివర్తనమువలన
వనధికి సమానుఁడౌ పురుషునకుఁ గల్గి
నట్టియాపద సూచితంబయ్యెఁ గాన. 199

ఇదిసమాసోక్తి చరిత్రము

---

## అతిశయోక్త్యలంకారము

తే॥గీ॥ అతిశయ వివక్ష లోకసీమాతివర్తి
యతిశయోక్తి యనంగనొప్పారుచుండు

విది యలంకారములయందునెల్ల మిగుల
నుత్తమంబగు నెట్లుగానుండుననిన. 200

తే॥గీ॥ మల్లెపూలదండలుదాల్చి తెల్లమల్లు
చీరలంగట్టి సర్వశరీరలిప్త
మైన యార్ద్రచందనము పొల్పార వెన్నె
లలఁగనంబడ రభిసారికలు నడచుచు. 201

తే॥గీ॥ జ్యోత్స్నదాహార్య ముత్కర్ష యుక్తముగను
బ్రోక్తమిఁక సంశయాతిశయోక్తి మొదలు
గాఁగలుగునవియెల్ల వ్యక్తములుగాఁగ
స్వల్పముగ విదర్శనము లొనంగఁబడును. 202

## సంశయాతిశయోక్తి

తే॥గీ॥ గబ్బిగుబ్బదోయికివి జఘనమునకును
నడుమ నీసూక్ష్మమైన నెన్నడుము కలదొ।
లేదొకో। యనుసంశయం బిదినంబు
నందునైతము పోలేదు నాకుఁ దరుణి। 203

## నిర్ణయాతిశయోక్తి

తే॥గీ॥ ఓవితంబివి। నీనడుమున్నదనుచుఁ
గట్టిగా విర్ణయించుట గాదశక్య
మదియె లేవిపక్షమునందుఁ గుదురునెట్టు
లీపయోధరయుగభర మిచటనున్కి. 204

## అత్రయాధిక్యాతిశయోక్తి

తే॥గీ॥ ఇముడుట కశక్యమైన నీ యీ సుకీర్తి
ప్రోవు సకలంబుగూడ నిముడుచునుండెఁ
జాగురే : యెంతయేని విశాలమగును
మేదినీశ ! జగత్త్రితయోదరంబు. 205

తే॥గీ॥ వశ్యవాక్కులౌ పండిత ప్రవరులెల్ల
నధికగౌరవమొసఁగు నీయతిశయోక్తి
యితరమైన యలంకారతతికి సైత
మేకమౌ పరాయణమని వాకొనుదురు. 206

ఇది యతిశయోక్తి చక్రము

---

## ఉత్ప్రేక్షాలంకారము

తే॥గీ॥ చేతనము వృత్తిగాని యచేతనంబు
వృత్తిగాని యన్యంబగు విధముతోడ
నుండ నన్యథా యుత్ప్రేక్ష యొనరుపఁబడు
నెచట: దాని నుత్ప్రేక్షగా నెంచుచుంద్రు. 207

## చేతనగతోత్ప్రేక్ష

తే॥గీ॥ దంతి మధ్యాహ్నకాలమాత్రాండుచేతఁ
జాలఁద ప్తమై చొచ్చెడి సరసిలోన

తరణి చేపట్టినట్టి పద్మములఁ దీకి
వేయనుంకించె ననుచు భావింతు నేను. 208

తే॥గీ॥ జలమున గజంబు సొచ్చుట స్నానమునకు
సలిలపాన మృణాళభక్షణములకును
వైరమును దీర్చుకొన నంచు వర్ణనంబొ
నర్చుచుండె నుత్ప్రేక్షనొనర్చు సుకవి 209

## అచేతనగతోత్ప్రేక్ష

తే॥గీ॥ నేను బొడవాటకు విరోధియైన చెవికి
నాభరణమగుచుండె నియ్యది యటంచుఁ
నీదు కర్ణోత్పలంబును నీదుచూపు
బోయలు మీఱ విలంఘించుచుండనోపు। 210

తే॥ గీ॥ కలువపూవు నపాంగభాగమునఁబడు వి
లోకనంబుల కిరణముల్ దాఁకుచుండె
నొక్కొ! తాఁకకయుండెడి నొక్కొ। యవి క
వీంద్రుఁ డిట్లు వర్ణించె నుత్ప్రేక్ష సలిపి 211

తే॥గీ॥ *కాయముల నంధతమసంబు పూయునొక్కొ।
సురపథం బంజనంబును గురియునొక్కొ।
యనఁగ దీనియందునుగూడ నన్వయించు
వక్షతంబుగ నుత్ప్రేక్ష లక్షణంబు. 212

## ఉత్ప్రేక్షావ్యంజకములు

తే॥గీ॥ *తలఁతు ననుకొందు శంకింతుఁదథ్యము ధ్రువ
మనఁగ నాఁగఁ గానోపు నాఁజను ననఁదగు
పోలె వాక్కాకావచ్చుఁ గాఁబోలు నేమొ
కోయొకోవంటిదుత్ప్రేక్షకొప్పుఁ గుర్తు. 213

ఉత్ప్రేక్షాచక్రము

---

## హేత్వలంకారము

తే॥గీ॥ హేతువును సూక్ష్మలేశముల్ హెచ్చుఁదనము
గల యలంకారముల్ నుడికారములకు
కారకజ్ఞాపకంబులై క్రాలుచుండు
హేతువులు; పలురకముల నెసఁగు నవియు. 214

—కారకహేతుభేదములు—

### భావసాధనహేతువు

తే॥గీ॥ ప్రౌఢచందనపాదప పల్లవములఁ
గొంచెముగఁ గదలించుచు సంచరించు

---

* ఇచటి విచారణ సంస్కృతమునకుఁ జెందినది గ్రంథాంతమునఁ జూపఁబడు.

మలయమారుత మియ్యది గలుఁగఁజేయు
సకల జీవలోకమునకు సంతసంబు. 215

తే॥గీ॥ హర్షమును గలిగింప యోగ్యమగుచున్న
రూపము నుపబృంహణమొనర్చుట యనునది
యుచట నుద్దిష్టమగు నలంకృతిగ; నది వి
వృత్తియందును సమమయి వెలయుచుండు. 216

అభావసాధన హేతువు

తే॥గీ॥ మలయజద్రుమకాననంబులఁ గదల్చి
మలయగిరిమీది నిర్ఝరంబుల స్పృశించి
పాంథులైనవారల యభావంబుకొఱకుఁ
గదలివచ్చినదయ్యె నీ గంధవహము. 217

తే॥గీ॥ అధికవిరహజ్వరోద్భూతమైన పంచ
శరశరానలకీల నాతురతఁ గాంచు
మనుజుని యభావసాధనంబునకుఁ జాలు
నీవిధంబున నుండిన యీపవనము. 218

తే॥గీ॥ కలుగు నిర్వర్త్యమందు వికార్యమందు
హేతుభావంబు వాని యపేక్షచేతఁ
బ్రాప్యమై యొప్పుచుండు కర్మమునఁ దలచు
హేతుభావమయ్యది క్రియాపేక్షమగును. 219

తే॥ గీ॥ దర్శితంబయ్యె హేతువుత్పాద్యమునకుఁ
జెందినట్టిది యింక శేషించినట్టి
రెంటికి నుదాహృతుల్ ప్రదర్శించి పిదప
జ్ఞాపకంబగు దాని వర్ణనమొనర్తు 220

## వి కా ర్య హే తు వు

తే॥ గీ॥ చివురు జొంపములన్ విరాజిల్లు వనులు
పద్మముల్ విచ్చియుండెడి వాపికలును
షోడశకలాకలాపవిశోభి శశియు
విరహిదృష్టికి విషముగా మఱఁదొనర్చె. 221

## ప్రా ప్య హే తు వు

తే॥ గీ॥ మానయోగ్యను జేసెద నేనటంచు
ప్రియుని స్థానంబునందుఁ వర్తిలిన చెలిని
బొమలు ముడివడ వంక చూపులు నిగుడఁగ
నధర మదరంగఁ గనుగొనె నబల యొర్తు 222

## జ్ఞాపక హే తు భే ద ము లు

## ప్రతియమాసజ్ఞాప్యమగు జ్ఞాపక హేతువు

ఆ॥ వె॥ అస్తమించె సూర్యుఁ డలరారెఁ జంద్రుండు
నరుగు గూళ్ళకై విహంగము లన
విదియుఁగూడ సాధువే యగుచుండెడిఁ
గాల వర్తను నెఱుఁగంగఁ జేయ 223

రూఢగర్వ మూర్జస్వినాఁ బ్రో త్తమగును
సముచితోత్కర్షతన్ మూఁడు జానుమీఱు. 255

## ప్రేయఉదాహరణము

కం॥ నీవింటికి వచ్చుటచే
నావిర్భావంబు గాంచినట్టి ప్రమోదం
బీవేవెందియు వచ్చుట
చే వెలయఁగ వలయు స్వామి! యెవ్వటికైనన్ 256

తే॥గీ॥ కలుగ దిట్టిమోదము పెఱ కారణమున
నముచు విదురుండు యుక్తంబుగను వచించె.
భక్తిమాత్రపూజ్యుండౌచుఁ బరగు హరికి
దానఁజేసి మిక్కిలిగ సంతసము గలిగె. 257

తే॥గీ॥ సోముఁడును సూర్యుఁడును హోత భూమి జలము
నీతిహోత్రుండు వాయువు విష్ణుపదము
నంచుఁ జెప్పు రూపు లతిక్రమించి విమ్నుఁ
జేరి గన్గొన మేమెంతవార మీశ! 258

తే॥గీ॥ వేయువవరోత్తముగఁ గావిపించి నపుడు
రాజవర్మ నాముంరగు రాజవర్యుఁ
డిట్లు ప్రీతివి బ్రకటించు టెద్దికలదొ
అదియుఁ బ్రేయఅఖ్యంబవి యార్యులవిరి. 259

ఇది ప్రేయోఽలంకారము.

## రసవదలంకారము

### శృంగార రసవదలంకారము

కం॥ వచ్చినదను తలఁపుననేఁ
జచ్చి యెవతితోడఁ గలయ స్వాంతంబునయం
దిచ్చ వహించితినో । నా
కచ్చెలియిది యీజననమునందబ్బె బలే । 260

తే॥గీ॥ వెనుకఁబద్యఁబులందుఁ జూపితిని బ్రీతి
అదియ యీరతి శృంగారమయ్యె నిచట
రూపబాహుళ్యయోగంబు ప్రాపునలనఁ
గావున నిది రసవదలంకారసూక్తి. 261

### రౌద్రరసవదలంకారము

ఆ॥వె॥ ఎవఁడు కొప్పుఁబట్టి యీడ్చెనో ద్రోవది
నేను జూచుచుండ విగ్రహించి
దుష్టచిత్తుఁ దట్టి దుశ్శాసనుండిదె
పట్టువడియె క్షణము బ్రతుకఁగలఁడె । 262

తే॥గీ॥ శాత్రవుని జూచి పవమానపుత్రు రోష
మిట్లు సంపూర్ణతంగాంచి యేర్పడియెను
రౌద్రరసరూపముగఁ గాన రసవదుక్తి
యిట్టిదగుచుండు నని గ్రహియింపవలయు. 263

## వీరరసవదలంకారము

తే॥గీ॥ జలధిపరివేష్టితంబైన యిలఁ గెలువక
వలుమఘంబులచేత వేల్పుల యజింప
కర్థికోటి కర్థించిన యర్థమీక
యేవిధంబునంజేసి నేనృపతి నగుదు. 264

తే॥గీ॥ ఇట్లుగఁ బ్రకృష్టమైనదై యెసక మెసఁగి
వీరరసరూపమున విల్చు సాంతర మ
హోజ్జ్వలోత్సాహభావ మీసూక్తుల రస
వత్త్వమున్ సమర్థింపఁగ వలఁతి యగును 265

## కరుణ రసవదలంకారము

తే॥గీ॥ పూలసెజ్జయు నేపూవుబోఁడికిఁ గడు
శర్మకరంబయ్యెనో, అట్టిదాన యిప్పు
డేవిధంబున భీషణపావకార్చి
రతికరాళమౌ చిత మీద నత్తమిల్లు ఎ 265

తే॥గీ॥ ఆర్యులవిరి యలంకారమనుచు నివ్వి
ధమునఁ గారుణ్యముద్రిక్తతన్ వెలసిన
నట్టి లితరములైన హాస్యాద్భుతరస
ములు భయానకబీభత్సములుఁ జెలంగు 266

## బీభత్సరసవదలంకారము

తే॥గీ॥ దావకారినృపాలరక్తంబు పాణి
సంపుటంబులఁ బానంబు సలిపి సలిపి

నర్తన మొనర్చెడిన్ గబంధములతోడ
గూడి ప్రేవులఁ గైసేసి కోణపములు. 267

## హాస్యరసవదలంకారము

తే॥గీ॥ సఖి! యమానమానమునఁ బ్రశస్త వీవు
నవమగు నఖక్షతంబు లగ్నమయి యుండెఁ
దావకీనవక్షోరుహాతటమునందు
నుత్తరీయంబునన్ గప్పుటొప్పువిపుడు. 268

## అద్భుతరసవదలంకారము

తే॥గీ॥ అంకురములు ప్రవాళముల్ హారముఖ్య
భూషణవిశేషవిసరంబు పుష్పవితతి
కొమ్మలు వికేతనమ్ములై కొమరుమీఱు
బళిర! యీ నందనోద్యానపాదపముల 269

## భయానకరసవదలంకారము

కం॥ ధారాసన్నిహితానల
పై రాజిలు నీ సురేశప్రాదివి, రక్షో
వారులకు గర్భపాత
ప్రారంభంబవును దీనిభావనవలనన్. 270

తే॥గీ॥ వాక్యసంగతాగ్రామ్యతవలనఁ గలుగు
తనము మాధుర్యగుణమునఁ బ్రకటితంబు

ఈయెడ రసాష్టకాయ త్తమై యెసంగు
చెలువుపలుకుల రసవత్త చెప్పఁ బడియె 271

ఇది రసవచ్ఛబ్దము.

## ఊర్జస్వి, అలంకారము

తే॥గీ॥ అపకృతి యొనర్చువాఁడ నటంచు నీవు
భావమున నెంచకయు భయపడఁగవలదు
నాదుఖడ్గంబు విముఖులమీఁద దెబ్బ
వేయవలెనంచు దా వాంఛసేయ దెపుడు 272

తే॥గీ॥ దర్పశాలి యొక్కండు యుద్ధంబునందు
బరువిఁ దాను విరోధించెఁ బల్కె యిట్లు
కాన యీరీతి నుండెడిదానినెల్ల
తెలుఁగవలయు నూర్జస్వ్యలంకృతియటంచు 273

## పర్యాయోక్తాలంకారము

తే॥గీ॥ కాంక్షితార్థంబు సాక్షత్తుగా వచింప
కద్ది సిద్ధింపఁజేయంగ నన్యమైన
రీతిచేత వచించుట ఖ్యాతిఁగాంచి
తనరుచుండుఁ బర్యాయోక్త మనెడు పేర 274

తే॥గీ॥ పరభృతము సహకారమంజరిని బట్టి
కొఱుకఁబోవుచుండెడి నదిగో! రయమున
నేగి తోలెద నద్దాని నేను. మీర
లిద్దఱిచ్చోట నుండుడు స్వేచ్ఛలోలయ 275

తే॥గీ॥ సఖివి సంకేతమున స్నిగ్ధజనునితోడఁ
గలిపి వారి రతోత్సవంబులు జరుగఁగ
నిచ్చగలదొచుఁ దొలఁగిపోయె నొకబోటి
సత్వరంబుగ నాప్రదేశంబునుండి. 276

---

## సమాహితాలంకారము

కం॥ పని యొకటి మొదలుపెట్టిన
జనునకు దైవవశమునను సాధనలాభం
బొనఁ గూడుటను సమాహిత
మనెడి యలంకారమందు రార్యవరేణ్యుల్. 277

తే॥గీ॥ మానము నిరాకరింపంగ మదిఁ దలంచి
పొలఁతిపదములపైఁబడ బోవుచున్న
నాకిదె మహోపకారం బొనర్చుపొంచె
గగనమున మ్రోసె జలధరగర్జితంబు. 278

## ఉదాత్తాలంకారము

తే॥గీ॥ ఆశయ మహత్త్వమెద్ది సర్వాధికంబు
వైభవసమృద్ధి యెద్ది సర్వమునుమించు
నయ్యది యుదాత్త మనునట్టి యాహ్వయంబు
గల యలంకార మనియెద రలఘుమతులు. 279

తే॥గీ॥ రావణాసురకంఠకర్తనకఠోర
కార్యభారమందును నెపిక్లబతమెఱసి
వాసి గన్న రాఘవునంతవాఁడు గురుని
శాసన మతిక్రమింపంగఁ జాలఁడయ్యె 280

తే॥గీ॥ రత్నభిత్తులయందు సంక్రాంతములయి
నట్టి ప్రతిబింబములు చుట్టుముట్టియుంటఁ
గడుఁబ్రయాసముచే నెఱుఁగంగఁబడియె
నవిలసూతిచేతను రావణాసురుండు. 281

తే॥గీ॥ ఆశయమహిమ పూర్వపద్యమ్మునందు
బాగుగా సూచితమ్మిదంపద్యమందు
నభ్యుదయగౌరవంబు సువ్యంజితంబు
గాన రెండుదాత్తములుఁ బ్రోక్తంబులయ్యె. 282

—○—

## అపహ్నవాలంకారము

తే॥గీ॥ ఒక్కదాని యపహ్నుతి నొనరిచి మఱి
యొక్కదానిఁ జూపుట యపహ్నుతి యనఁబడు

పంచబాణుండు గాఁడల్ల ప్రసవశరుఁడు
లెక్కఁ గాతనిబాణము లొక్కఁడెయ్యి. 283

## విషయాపహ్నుతి

తే॥గీ॥ చందనంబును జంద్రిక మందమలయ
గంధవాహంబు నాఁగఁ బ్రఖ్యాతిఁగనిన
దిద్ది వహ్నిమయంబగు సృష్టినాకు
లాతివారియెడం గడు శీతలంబు. 284

తే॥గీ॥ ఒరులయెడఁ జల్లదనముఁ దానొప్పుకొనియె
తనయెడఁ దుషారకరునుష్ణతాగుణంబుఁ
గాముకుఁడు ప్రకటించెడిఁ గావున నిది
విషయనిహ్నుతియనుపేర వెలయుచుండు. 285

## స్వరూపాపహ్నుతి

తే॥గీ॥ అమృతనిష్యందికిరణుండటంచుఁ జంద్రుఁ
డాహ్వయంబునంజేసి విఖ్యాతుఁ డయ్యె
నన్యుఁ డేయగు నీతఁడర్థాత్మకుండు
తీక్ష్ణగరళనిష్యందిదీధితిమయుండు. 286

తే॥గీ॥ ఇవ్విధంబునఁ జంద్రత్వమే హిమకరు
నందు లేకుండఁజేసి యర్థాంతరాత్మ
కత్వమును గాముకుఁడు వల్కెఁ గావున నది
సమ్మతము స్వరూపాపహ్నవమ్మటంచు. 287

## శాబ్దజ్ఞాప్యమగు జ్ఞాపక హేతువు

తే॥గీ॥ చంద్రకరములచేత సాళ్యములు గాక
మలయజాంబువులకు సాధ్యములును గాక
వలలు తావక దేహతాపములచేత
నతిసుగమము నీమనసు కామాతురంబు. 224

తే॥గీ॥ కమగొవంగఁదగుం బ్రయోగముల యందు
హృద్యతమములౌ జ్ఞాపకహేతువులను

## అ భా వ హే తు వు లు

గొన్నిటి నభావహేతువుల న్నొడివెదఁ
జాలఁజేతోహరంబులై కాశ్రిలువావి. 225

## ప్రా గ భా వ హే తు వు

తే॥గీ॥ శ్రద్ధతోడుత విద్యలు చదువకునికి
జ్ఞానులౌ వారి సంగంబొనర్పకునికి
నెల్లయింద్రియముల నిగ్రహింప కునికి
సంభవించును వ్యసనంబు జనులకిలను. 226

## ప్ర ధ్వం సా భా వ హే తు వు

తే॥గీ॥ కామకథల యున్మాదంబు గడచిపోయె
నామశేషత గనె యౌవనజ్వరంబు
మోహము గతించెఁ దృష్ణ నిర్మూలమయ్యె
మతి విలువఁబడె బహ్మాశ్రమమున యందు. 227

## అన్యోన్యాభావ హేతువు

తే॥గీ॥ అగు నరణ్యంబు లివి యాలయములు గావు
ద్వీపవతులగు నియ్యవి స్త్రీలు కారు
జ్ఞాతివర్గంబుకాదు మృగంబు లివ్వి
గాన ముదమందెడిన్ నాదు మానసంబు. 228

## అత్యంతాభావ హేతువు

తే॥గీ॥ ఉంద దాలోచనంబు లేకుండ నెప్పు
డార్యులౌ వారి చేష్టితం బవనియందు
అదియెకారణముగ వారి కనవరతము
నెల్ల సంపదలును బ్రవర్ధిల్లుచుండు. 229

## ప్రాగభావాభావ హేతువు

తే॥గీ॥ బయలువెడలక పోలేము పవనములను
బొల్చు సహకారములనుండి పూలగుత్తి
ఈయవలయును బాంథపద్మేక్షణలకు
దోసెడుదకంబు నువ్వులతోడఁ గలిపి. 230

తే॥గీ॥ భావరూపం బభావరూపంబునైన
ప్రాగభావాదిరూపమౌ వస్తువునకుఁ
గార్యనిర్మాణమును గూర్చి కారణత్వ
మీయుదాహృతులన్ వచియింపఁబడియె. 231

## చిత్ర హేతు భేదములు

తే॥గీ॥ దూర కార్యంబునన్ దనతోడఁ గలుగు
కార్యముగలట్టిదియును స్వకార్యతావి
కాలజంబు యుక్తాయుక్తకార్యములును
చిత్రహేతువులగు. సంఖ్యచెప్పలేము. 282

తే॥గీ॥ అయ్యవి ప్రయోగమార్గంబులందునెల్ల
గౌణవృత్తివ్యపాశ్రయ కారణమున
మిక్కిలి మనోహరంబులై మెలఁగుచుండు
వానికి నుదాహరణములు వ్రాయఁబడును. 233

## దూరకార్యచిత్రహేతువు

తే॥గీ॥ తావకాపాంగమను మన్మథప్రదరము
చైత్రమగుఁజెలి! లాతిదిశకు వదలఁగఁ
బడియెనేచేత, పెఱదికున్న వాఁడనయ్యు
నేను దానిచే దెబ్బఁదింటిని మనమున. 234

## కార్యసహజచిత్రహేతువు

తే॥గీ॥ బాల్యమును ద్రోసిరాజవి వనజముఖిలి
కమరుపవి మండనంబైన యౌవనంబు
కామిజనమదనోన్మాదకలితవివిధ
విభ్రమంబులతోవ యావిర్భవించు 35

## కార్యానంతరచిత్ర హేతువు

తే॥గీ॥ మానవులనెల్లయెదలను దాఁచికొనుచు
విందు బింబంబు పిదప నుదీర్ణమయ్యె
గాఢరాగసాగర మంతకన్న మున్నె
మృగవిలోచనలకు నముదీర్ణమయ్యె 236

## అయుక్త కార్యచిత్ర హేతువు

తే॥గీ॥ వసుమతీనాయకుల కరవారిజముల
నేల యౌష్మాక పాదద్వయీ సరోజ
పీఠి బాలాతపము స్పృశియించుచు ముకు
ళింపఁజేసెడి ధరణీవిలింపనాథ ! 237

## యుక్తకార్యచిత్ర హేతువు

తే॥గీ॥ కుందనిర్మలములు నీదు గోళ్ళవియెడి
యమృతకిరణుల కిరణమ్ము లవనిపతుల
పాణిపద్మంబుల ముకుళీభావమొందఁ
జేయఁగాఁ జాలియుండెడిన్ క్షితిశేశ ; 238

తే॥గీ॥ హేత్వలంకారమునయందు నేర్పడిన వి
కల్పములగతి యుండు నిక్కరణిననుచు
లక్షణంబులుమన్ దగులక్ష్యములును,
వివరణంబులతోడఁ జూపింపఁబడియె. 289

ఇది హేతుచక్రము;

## సూ క్ష్మా లం కా ర ము

తే॥గీ॥ ఇంగితాకారములచేత నేర్పరింపఁ
దగినయర్థంబు సూక్ష్మమై తనరుఁగాన
దీనిపేరు సూక్ష్మాలంకృతియని కావ్య
రీతు లెఱిఁగినవారు స్మరించినారు. 240

## ఇంగితలక్ష్యసూక్ష్మము

తే॥గీ॥ ఇంతిరో! మనసంగతి యెప్పుడనుచు
వలుపురుందిన పట్టునఁబల్కలేవి
తనహృదయవల్లభుని హృద్గతంబెఱింగి
లేమ లీలాంబుజము ముకుళింపఁ జేసె. 241

తే॥గీ॥ మారపీడితుఁడౌ ప్రియునూఱడింపఁ
గోరు కాంతామణి యొకర్తు సారసమును
ముడిచిపట్టుకొని తెలియఁబడగఁజేసె
గలుగు రాతిరి మనకు సంగమమటంచు 24[illegible]

## అ కా ర ల క్ష్య సూ క్ష్మ ము

తే॥గీ॥ ప్రేష్ఠమైనట్టి సంగీతగోష్ఠియందుఁ
ప్రీతినాపయిఁ జూపునర్పించు నాతి
మోముఁదామరమీద నుద్దామరాగ
తరళహా దాయయొక్కటి కరమెసంగె. [illegible]

తే॥గీ॥ రతిమహోత్సవగతమనోరథము సూక్ష్మ
భావముఁ ద్యజింపకుండ వ్యవస్థితంబ
యీవిధంబున నుద్భిన్న తావిరహిత
మైన రూపంబుతోడ నిచ్చో నెగడుట. 244

ఇది సూక్ష్మచక్రము.

## లే శా లం కా ర ము

తే॥గీ॥ స్తోకముగఁ బ్రకటమగు వస్తువుస్వరూప
మును నిగూఢముఁ జేయుట యనియెడునది
పొంకమై లేశమనెడి యలంకృతియగు
దీనిరూపులక్ష్యములందఁ దెలుపఁబడును. 245

తే॥గీ॥ రక్షకులు రాజకన్యానురక్తుఁగాఁగ
నమ గగుర్పాటుచేతఁ గన్గొనఁగఁగలరు
అ! యెటుక గల్గె మనసున కవుర! వనము
చల్లగాలితో నిండి వర్తిల్లుచుండె. 246

తే॥గీ॥ కన్నియను గాంచినంతనె కన్నుఁగవకుఁ
బ్రేమద జనిత బాష్పమ్ములేర్పడె నెటులొకో!
వాతపోత ధూతంబైన ప్రసవరజము
చేత నాదుకన్దోయి దూషితము మిగుల. 247

ఆ॥వె॥ ఇట్టిచోట్లనెల్ల నీయలంకార మి
ట్లధికశోభమానమై తగియెడి

మతాంతరలేశము

ఛలముతో నొనర్చు స్తవముల నిందలు
గూడ లేశమనుచుఁ గొందఱంద్రు. 248

తే॥గీ॥ తరుణుఁడును గుణవంతుండు తగినభర్త
నీకితం డూర్జితుండైన నృపవరుఁడు
* ఇతని మానసమునకు నభీష్టమగును
గామమహమునకంటె సంగరమహంబు. 249

తే॥గీ॥ నిరుపమానవీర్యస్తుతి నిందయౌచు
నెగడుచుండెడి నిప్పుడీ నృపుని యెడను
ఎల్లపుడును భోగింపంగ నెంచుచుండు
కన్యభావమున్ మఱలింపఁ గల్గుఁగాన. 250

తే॥గీ॥ చపలుఁడును నిర్దయుండునున్ జనుఁడితండు
ఇతనితోఁ గావలసిన దేమి నాకు ?
కొన్ని చాటూక్తులను నేర్చుకొనియె నితఁడు
స్వాపరాధమార్జనమును సలుపుకొఱకె. 251

---

* స్వాంతమేతదీయము రణోత్సవమునందుఁ
బ్రవణమైయుండుఁగా మోత్సవమునకంటె.

తే॥గీ॥ ప్రియుని యెరఁ దనకుంగల ప్రేమచేతఁ,
తెలి వచించిన మానమున్ పేయలేక
దోసముందోలి పైపైకిఁ దోచు గుణముఁ
జాటుకారితఁ జూపించెఁ జానయోర్తు. 252

ఇది లేశచక్రము.

## క్ర మా లం కా ర ము

క॥ ఉద్దేశ మనూద్దేశము
వొద్దికఁ గ్రమముం దొలంగకుండ నెగడినన్
బెద్దలదెయథాసంఖ్యం
బద్దియె సంఖ్యాన మదె క్రమాఖ్యమనిరిలన్. 253

తే॥గీ॥ స్నాన మాడుటకై నీవు జలముఁ జొచ్చి
నప్పు డచ్చటి కుముదోత్పలాంబుజములు
ముదితరో! నీ స్మితేక్షణముఖ రుచులను
దొంగిలించి యుండగవచ్చు ధ్రువముసుమ్ము. 254

ఇది క్రమచక్రము.

## ప్రేయోరసవదూర్జస్వి లక్షణములు

తే॥గీ॥ ప్రియతరాఖ్యాన మలరారుఁ బ్రేయమనఁగ
నెంతు రసవంతమన రసాశ్లీలంబు

కం॥ ఉపమాపహ్నుతినిన్ ము
న్నుపమాలంకృతులఁ జూపియుంటిమిటుల తే
టపడున్ లక్ష్యంబులయం
దపహ్నుతి విభేదముల మహావిస్తరముల్. 289

ఇది అపహ్నుతిచక్రము

## శ్లేషాలంకారము

తే॥గీ॥ ఒక్కరూపంబుతోనొప్పి పెక్కులర్థ
ములుగల నుడుల శ్లేషమొప్పుఁ బ్రియమగుచు
నది యభిన్నపదము భిన్నపదబహుళము
ననఁగ రెండువిధంబులఁ దనరుచుండు. 290

## అభిన్నపదశ్లేషము

కం॥ ఉదయాబాధుండగుచున్
మృదుకరములచేత లోకహృదయహరుండై
పొదలెడిని రక్తమండల
తఁదలిర్చుచు రాజు కాంతిధామంబగుచున్. 291

## భిన్నపదశ్లేషము

తే॥గీ॥ కలదు దోషాకరుండు నక్షత్రమార్గ
వర్తియునునైన రాజు సంబంధమిట్టి

యీ ప్రదోషంబు బాధింపకెట్టు లుండు
నపిప్రియుండనై యుండెదునట్టి నన్ను. 202

## శ్లేషమితరాలంకారములకంగమగుట

తే॥గీ॥ రూపకము వ్యతిరేక మాక్షేపముపమ
యాదిగాఁగల కొన్నిటి నాశ్రయించి
పలుశ్లేషముల్ మున్నె చూపంగఁబడియె
నింకఁబెఱవాని గొన్నిటి నేర్పరింతు. 203

## మఱియు శ్లేషభేదములు

తే॥గీ॥ ఒకఁడభిన్నక్రియాశాలి యొప్పుచుండు
నమరునొకఁడ విరుద్ధక్రియాయుతంబు
మఱియొకండు విరుద్ధకర్మంబుగలదు
నియమవంతమన్ శ్లేషము సెగడు నొకటి. 204

తే॥గీ॥ ఒప్పెడి నియమాక్షేపరూపోక్తియొకటి
యొకటి యవిరోధియు విరోధి యొక్కటియును
వానిరూపధేయములు విస్పష్టముగ వి
దర్శనంబులయందవ్యక్తంబులగును 205

## అభిన్నక్రియశ్లేషాలంకారము

తే॥గీ॥ ప్రకృతిమధురతగలిగి వక్రితఁదలిర్చి
ఖించురాగాతిశయము సూచించుకొనుచు

నంగనాపేక్షణమునఁగటాక్షతతులు
దూతికలును బ్రియులలాగుదురు గరంబు. 296

## అవిరుద్ధక్రియశ్లేషము

తే॥గీ॥ రాగమును బెంచుచున్ మధురతవహించి
మదకలత్వముగలిగి గోమలత మించి
పికవధూకూజితంబులు వినఁబడియెడి
నక్కునం జేర్పఁబడుచుండి రంగనలును. 297

## విరుద్ధక్రియశ్లేషము

తే॥గీ॥ వారుణీయోగమునఁ దనరారినట్టి
రాగమును జూపుకొంచు ధర్మకరుఁ డితఁ
డస్తశైలము చాటున కరుగుచుండె
మీనకేతనుండన్ననో మించుచుండె. 298

## నియామకశ్లేషము

తే॥గీ॥ వల్లులు నసియంద నిస్త్రింశభావమెపుడు
కార్ముకమునంద వక్రత గ్రాలుచుండు
బాణమునయందె మార్గణత్వంబు దనరు
శ్రీయుతుండైన యీ నృపశేఖరునకు 299

## నియమాక్షేపరూపోక్తిశ్లేషము

తే॥గీ॥ నీవు పరిపాలనమునర్ప వేగడుచుండుఁ
గమలముల దండములయంద కంటకములు

కనఁబడగవచ్చు చొక్కపుతంబునందు
రక్తులౌ దంపతుల పరిరంభణముల. 300

## అవిరోధిశ్లేషము

తే॥గీ॥ భూరికటకనమేతుండు భూమిభృత్తు
ప్రోల్లసితతేజుఁడున్ నియతోదయుండు
దక్షుఁడుఁ బ్రజాపతియు శక్తిధరుఁడు స్వామి
యగుచుఁ దనరారుచుండు నయ్యవని విభుఁడు. 301

## విరోధిశ్లేషము

తే॥గీ॥ అచ్యుతుండయ్యుసున్ వృషహంత కాఁడు
రాజగుచునుండియున్ క్షయాక్రాంతిఁగనఁడు
దేవుఁడయ్యును విబుధుఁడై తేజరిలఁడు
శంకరుండయ్యును భుజంగసంగి కాఁడు. 302

ఇతి శ్లేషచక్రము

---

## విశేషోక్తి అలంకారము

తే॥గీ॥ గొనము జాతిక్రియలు మున్నయినవి యెవ్వి
కలిగియుండునో, వానిపై కల్యమది వి
శేషమును జూపుటకె ప్రదర్శింపఁబడుట
యొప్పుకొనఁబడెడిన్ విశేషోక్తియనుచు. 303

## గుణవిశేషోక్తి

తే॥గీ॥ కఠినమైననుగాదు, తీక్ష్ణమును గాదు
కాయజువి చేతనుండెడి యాయుధంబు;
జనను జయించియేపైచె నయ్యనంగుఁ
డీజగంబుల మూఁడిటి హేలఁబోలె. 304

## జాతివిశేషోక్తి

తే॥గీ॥ కామగంధర్వకన్యక, కాదుదేవ
కన్యకామణి, యైన నీకమలనేత్రి
పద్మభవునంతవానితపంబుఁగూడ
భంగ మొనరింపఁజాలినభంగినొప్పు. 305

## క్రియావిశేషోక్తి

తే॥గీ॥ 1 * బొమలు ముడివడనేలేదు మోమునందు
పెదవి యొక్కించుకేనియు నదరలేదు
2 * ఎఱ్ఱవాఱదు గోరంతయేనిదృష్టి
రిపునృపబలంబులెల్ల నిర్జింపఁబడియె. 306

## ద్రవ్యవిశేషోక్తి

తే॥గీ॥ గజములాలేవు రథములా కానరావు
హయములుగనంబడవు పత్తిచయములేదు

---

1 * భ్రుకుటి బంధ మేర్పడలేదు ముఖముమీద
2 *కన్నుగరయించుకయైను రక్తంబుగాదు.

నాతులకటాక్షదృష్టులచేతనే భు
వనము లీమూఁడును జయింపఁబడుచునుండె. 307

## హేతువిశేషోక్తి

తే॥గీ॥ రథమునకుఁ జక్రమొకటి. సారథి వికలుఁడు
హయములా! విషమమ్ము లిట్లయ్యును రవి
బహుళతేజోవిశేషవిభ్రాజియగుట
నాక్రమించుచునేయుండె నాకసంబు. 308

తే॥గీ॥ ఇద్దిహేతువిశేషోక్తి; యిందుఁదెలు
గలఁదనువిశేషణంబొండు గలదు కాన
లాతిభేదముల్ గూడఁగల్పనము సేయు
వియ్యదియ క్రమమౌచు రహించుచుండు. 309

ఇది విశేషోక్తిచక్రము

---

## తుల్యయోగితాలంకారము

తే॥గీ॥ చెప్పఁదలఁచినగొనమున గొప్పఁదనము
గలుగువారితోఁబోల్చి యొక్కవి నుతించు
కొఱకునైనను నిందించుకొఱకునైన
నాగిఁగీర్తించినం దుల్యయోగితయగు. 310

తే॥గీ॥ యముఁడును గుబేరుఁడున్ సహస్రాక్షుఁడుం బ్ర
చేతసుండును నీవును లాతినృపుల
నన్వయింపక మీయంద యన్వయించు
లోకపాలాఖ్య వహియింతు రేకరీతి. 811

కం॥ హరిణాక్షుల సంగతములు
మెఱపుల విలసితములున్ నిమేషద్వయమున్
దిరములుగానుండవు ఘన
విరచితములగుచు స్వయముగ వెలసినవయ్యున్. 812

---

## విరోధాలంకారము

తే॥గీ॥ ఎటవిశేషంబుఁ జూపుటకే విరోధ
మమరియుండెడునట్టి పదార్థములకు
సుకవిచేత సంసర్గంబు చూపఁబడునొ,
అది స్మరింపంగఁబడు విరోధాఖ్యమనుచు 813

తే॥గీ॥ వర్ధిలున్ రాజహంసల వాసితంబు
మదముచేత నత్యంతఁబు మంజులమయి
క్షీణమగు సౌష్ఠవంబు నశించిపోవు
చుండఁగా నెల్ల యెడల మయూరరుతము. 814

తే॥గీ॥ ప్రావృషేణ్యపయోధరపటలిచేత
నభము సకలమ్ముమిక్కిలి నల్లవడియె

గాఢరాగంబుచేత నంక్రాంతమయ్యె
జగములందెల్లయెడలను జనులమనము 315

తే॥గీ॥ నడుము మిగుల సన్నము జఘనము ఘనంబు*
అధరమరుణంబు గన్దోయి శ్యామలంబు
నాభి నతము, చన్దోయి యున్నతతరంబు
స్త్రీల నెమ్మెనెవాని హింసింపకుండు? 316

తే॥గీ॥ నల్లగలువలఁబోలిన నయనయుగము
సరసిజమువంటి మోము పీనయుగళంబుఁ
బోలు కేల్దోయి రంభోరువులు గలిగియుఁ
బడతి! నీరూపు నాకుఁ దాపంబుఁ గొల్పు. 317

తే॥గీ॥ గాలిచేత నుద్యానవనాళిలోన
రేఁగిన రసాలచంపకరేణుపటలి
విరహబాధితులగువారి వీక్షణముల
బాష్పజలసమృద్ధిని స్పృశింపకయుఁగూర్చు 318

తే॥గీ॥ తరుణి! కృష్ణార్జునానురక్తయగుచుండి
తావకీనయౌ దృష్టి కర్ణావలంబ
యెవనికింక విశ్వాస్యయయ్యెడి ననంగ
నిట్లు బహువిధ మీయలంకృతి కనఁబడు. 319

ఇది విరోధచక్రము.

---

* జఘనంబు లావు.

## అప్రస్తుతప్రశంసాలంకారము

తే॥గీ॥ అప్రకృతనుతి యప్రస్తుత ప్రశంస
పెఱల నెవ్వరినేని సేవింపఁబోక
జీవనము సేయుచుండును జింతలేక
హరిణములు ఘోరకాననాంతరములందు; 320

తే॥గీ॥ క్ష్మాపతుల ననువర్తింగి కష్టపడి మ
నస్వి యొకఁడు నిర్విణ్ణమానసముతోడ
హరిణవృత్తి నప్రస్తుతంబైన దాని
నంచితంబనుచుం బ్రశంసించుచుండె. 321

## వ్యాజస్తుతి అలంకారము

తే॥గీ॥ దూషణముఁ జేసినట్లుగా స్తుతియొనర్ప
నది దలిర్చు వ్యాజస్తుతి యనెడి పేర
దోషములయట్లు పైపైకిఁ దోచెడి గుణ
బృందమునకె సన్నిధి లభియించు నిచట. 322

తే॥గీ॥ భూమినెల్ల జయించెను బూర్వమందుఁ
బరశురాముండు దాను దాపసుఁడెయయ్యు
నీవును జయించియుంటివాభూవలయము
మనుజనాథుండవయ్యును మదము వలదు. 323

తే॥గీ॥ శ్రీ నల పురాణపురుషుని చెంతనుండి
కొంచకయు చీలదీసి భోగించుచుంటి
భాస్వదిక్ష్వాకువంశ సంభవుఁడవైన
నీకుఁ దగునయ్య ? యిది యవనీతలేశ ! 324

తే॥గీ॥ అగుచునుండె భుజంగభోగాతిసక్త
తావకకళత్రమైనట్టి ధరణిదేవి
నీ యహంకారమేల ? యమేయమగుచు
మింటఁ బాఱుచునుండెడి మేదినీశ ! 325

తే॥గీ॥ ఇట్లు శ్లేషానువిద్ధంబు లితరములును
నైన వ్యాజస్తుతిప్రకారాంతరముల
విగత పర్యంతమైయుండు విస్తరంబు
నెల్లనున్ సూక్ష్మబుద్ధు లూహింపవలయు 326

## నిదర్శనాలంకారము

తే॥గీ॥ తొడరి యర్థాంతరప్రవృత్తుండొనర్చు
తత్సదృశకించిదర్థనిదర్శనంబు
తగు నిదర్శనాలంకారతన్ నిదర్శి
తంబసత్ఫలమైన సత్ఫలితమైన 327

తే॥గీ॥ భానుఁడుదయించుచున్ సమర్పణము సేయు
శ్రీలను సమృద్ధిగా సరసీజములకుఁ
గలిమికి ఫలంబు సుహృదనుగ్రహమటంచు
క్షితి జనులనెల్ల భావింపఁజేయుచుఁ బొంచె. 328

తే॥గీ॥ రాజునకు పరిషదనివారలకు సద్య
మున నగు దురంతత నొగి సూచనసలుపుచు
శీతకరకరములచే స్పృశింపఁబడిన
ధ్వాంతరాజి పరాభవింపంబడియెడి. 329

## సహోక్త్యలంకారము

తే॥గీ॥ ఒకటి యొకదానితోఁగూడ నొక్క క్రియయొ
యొకఁడగుగుణంబొ గలిగినట్లుక్తమైనఁ
బరగఁగ గుణక్రియాసహభావకథన
మయ్యది సహోక్తి యనఁగఁ బ్రఖ్యాతమగును. 330

తే॥గీ॥ రాత్రులియ్యవి యిపుడు దీర్ఘములుఁగాఁగ
దొడఁగె నాదుశ్వాసంబుల తోడఁగూడ
చంద్రభూషలౌచు మదంగ చయముతోడఁ
గూడనే పాండురంబులుగూడ నగును. 331

తే॥గీ॥ వర్ధమానంబగుచునుండెఁ బాంధజనుల
మూర్ఛతోడుతఁ గ్రొమ్మావిపూలగుత్తి
నడచుచుండెను వారిపాత్రిజములతోడ
మలయశైలసమాగత మారుతంబు. 882

తే॥గీ॥ పరభృతరుతంబులన్ మనోహరములగుచుఁ
బరిమిళ సమేతవనవాతభరితములయి
వర్ధిలంజొచ్చెడి వసంతవాసరములు
పత్రిజలలోని యాసందర్భములతోడ 883

సుకాంతి॥ ఉదాహృతి, పరిదర్శనః; బిడిట్లు కొన్ని దెల్పెడిన్.

ఇది సహోక్తిచక్రము.

## పరివృత్త్యలంకారము

తే॥గీ॥ అర్థముల వినిమయము కావ్యజ్ఞులైన
వారు పరివృత్తియనఁగ నొప్పారుచుందు
దానిరూపంబు నిచ్చోనిదర్శనంబు
గాఁగ నొకదానినిప్పుడు కనుపఱచెద. 884

తే॥గీ॥ అవనిపతులకు శస్త్రపరిహారమొసఁగి
పీడుబాహువు, శైరవనిర్మలమయి

బాలకాలమునుండి యార్జనము చేసి
కొనఁబడిన * వారికీరితిఁ గొల్లగానియె. 335

## ఆశీరలంకారము

తే॥ గీ॥ * నమభిలషితార్థ విషయకాశంసనంబు
ఖ్యాతిఁ గాంచు నాశీరలంకారమనఁగ
స్వప్రకాశ మవాఙ్మనస ప్రమేయ
పదము పరమాత్మ మిమ్ముఁ గాపాడుఁగాత. 336

---

## మతాంతరాలంకారములీయలంకారములలో అంతర్భూతములనుట

తే॥ గీ॥ ఆససందేహము ననన్వయంబుఁ గూడ
వెలయుచుండు నుత్ప్రేక్షావిభేద మగుచు

## సంకీర్ణము

బహ్వలంకార సంసృష్టి పండితులగు
వారు సంకీర్ణమనఁగఁ బొల్పారుచుండు. 337

## సంకీర్ణభేదములు

తే॥ గీ॥ అన్నియును సమకక్షము లగుచునుంట
తొడరి యంగాంగిభావంబుతోడ నుంట

---

* తద్యశంబును.

* అభిలషితవస్తు విషయక ప్రార్థనంబు

యని యలంకార సంసృష్టి నరయవలయు
రెండు తెలుఁగులఁ బొల్పారుచుండు గతుల. 338

## అంగాంగిభావసంకరము

తే॥గీ॥ 1 భవముదారానన ప్రకాశ్వైభవముఁ బ
యోరుహంబు లాక్షేపించుచుండె ముగుద।
మహిపయిం గోశదండసమగ్రతమను
వ్యక్తికుండునె దుష్కరంబైన దొకటి। 339

## సమకక్షసంకరము

తే॥గీ॥ 2 అంగములఁ బూయునది వోలె నమరెఁదమము
కాటుకఁగురియునది వోలెఁ గ్రాలె నభము
చెనటులైనట్టి వారల సేవమాడ్కి
విఫలతం గాంచుచుండెను వీక్షణంబు. 340

## శ్లేషసంకరము

తే॥గీ॥ ఎల్లవక్రోక్తులందుఁ బ్రాయికముగఁబరి
పుష్టినొసఁగుచు శోభకుఁ బొల్చుశ్లేష
మొగి స్వభావోక్తి యనఁగ వక్రోక్తియనఁగ
వాఙ్మయము రెండు తెలుఁగుల వఱలుచుండు. 341

---

1 ఉపమకు అర్థాంతరన్యాసమంగము. అర్థాంతరన్యాసమునకు శ్లేషము అంగము.

2 ఉపమయు ఉత్ప్రేక్షయు పరస్పరనిరపేక్షములు.

## భా వి క ము

తే॥గీ॥ అందురు ప్రబంధవిషయమైనట్టి గుణము
భావికంబగు ననుచుఁ గావ్యజ్ఞులెల్లఁ
గబ్బముల సిద్ధియగు దాఁక నడలకుండు
కవి యభిప్రాయమది భావ మవుచునుండు. 342

తే॥గీ॥ వస్తుపర్వంబు లోకదానివలన నొక్కటి
యన్నియు నుపకారంబుల నందుచుంట
విఫలముగ విశేషణముల వేయుకుంట
స్థానముల వర్ణనంబులు సలుపుచుంట. 343

తే॥గీ॥ మివుల గంభీరమైన వస్తువ్యసయితము
భాషిత క్రమబలమున వ్యక్తమగుట.
అంతయు నిది భావాయత్తమగును గాన
ఆర్యు లిద్దాని భావికంబని తలఁతురు. 344

---

తే॥గీ॥ లలిత సంధ్యంగ వృత్త్యంగ లక్షణాదు
లాగమాంతరమునయందు నతిశయముగ
వర్ణితము లయియుండెను; వాని గూడి
నిచ్చగింతును నే నలంకృతులటంచు. 345

తే॥గీ॥ వితతమైన యలంకారవిస్తరమును
జాలఁగ ననంతమౌ దాని సంగ్రహించి

మందుఁజివరది నాల్గవయం ఘినిఁజివ
రది యన నమిశ్రయమకముల్ పదియురెండు. 2

## మిశ్రయమకభేదములు

సీ॥ అద్యద్వితీయాంఘ్రులందు వర్తిలునది
ప్రథమతార్తీయాకపాదవర్తి
ఆద్యచతుర్థపాదావస్థితంబును
మధ్యపాదద్వయీమధ్యగతము
పరిపాదముల వెంట జానగునట్టిది
యంత్యపాదద్వితయమునఁగలది
ఆద్యపాదత్రితయమున విబద్ధంబు
నాదిద్వయచతుర్థపాదగతము

గీ॥ అద్యపాదాంత్య పాదయుగాశ్రయంబు
నాదిమేతర పాదత్రయాధికరణ
మఖిలపాదగతంబన యమకములివి
వరగుచుండు మిశ్రంబులు పదునొకండు. 3

గీ॥ కలపియుండుట యనియెడి కారణమున
వానిభేదమ్ములెన్ని యొవఱలుచుండు
సుకరములు దుష్కరమ్ము లిచ్చోట వాని
లోనఁ గొన్నింటిఁ జూపంగఁ బూనివాడ. 4

## ప్రథమపాదగతము, అవ్యపేతము, అమిశ్రాదిభాగయమకము

కం॥ •మానము మానము•నువలెవ్
మానవమున వనతు. ప్రియువిమానసము తఃపా
ధీనంబగునట్లుగ బిగి
గా నతవిం గౌగిలింపు కంఠమునందమిన్. 5

## ద్వితీయపాదగతము

కం॥ ముదిర వినాదముచేతను
•మదనమదన •వావతారమానవినాశా
స్పదములయిరి మదిరాక్షులు
మదము లడఁగె రాజహంసమండలికెల్లన్. 6

## తృతీయపాదగతము

కం॥ పతివీవగుటను రాజ
న్వతులయిరి ధరంగలట్టి ప్రజలెల్లను నో
•చతుర! చతుర•బ్ధిరశనా
వృతధరణీవరణభరణ విలసిత విభవా! 7

## చతుర్థపాదగతము

కం॥ మహితపరాక్రమభరదు
స్సహభటజితులై త్వదీయశత్రువులగువా
రహిరిపు వగరికరిగినా
•రహితరహిత•మత్యో దేశ మవనీనాథా! 8

## ప్రథమద్వితీయపాదగతము అవ్యపేతము

## మిశ్రాదిభాగయమకము

కం॥ ♦మధురమధుర♦సధురావహ
♦మధర మధర♦భావయోజితాబ్జములు కనల్
మధులిట్ప్రియమధుకృతబహు
విధవిభ్రమములన వానిబెడకుల్ వెలయున్ 9

## ప్రథమతృతీయపాదగతము

కం॥ ♦వారణవారణ♦చతురులు
వీరులు కరితురగములును వెలయుట జనరా
♦మారణ మారణ♦మున నగు
మారా! వీవెదియు లేక మడియింతు మమున్ 10

## ప్రథమచతుర్థపాదగ

కం॥ ♦రాజదరాజద♦రివృపప
[illegible]హాతపత్రితావరాజితుల్లై యూ
మీజయ మొనర్చి వసుధా
♦రాజమ రాజను♦తతృప్తి రసవింతురినుల్ 11

## ద్వితీయతృతీయపాదగతము అవ్యపేతము మిశ్రము

## ఆదిభాగయమకము

కం॥ విలసత్సహకారలతా
♦కలికకలిక♦ లాపమమరంగాం బరభృతికా

• కలనాకలనా • దము విర
హాల నుత్కలికాకుల హృదయులుగ నొనర్చెన్.  12

## ద్వితీయచతుర్థపాదగతము

కం॥ అహితమలయాద్రి చరవా
• తహతత, హత • శశధర కరదారుణశాపా
సహిత, భవద్విరహదశాఁ
•సుహృదసుహృద•యుఁడగు నన్నుసోలఁగఁజేసెన్.  13

## తృతీయచతుర్థపాదగతము

కం॥ అలఅమధువ్రగోలఁ గఁ బెఱ
యలరుల మధువానమావియళులరిగెరుతుల్
• మలయ, మలయ • మారుతస్మృతి
• నళిన నళిన • మెదియుఁ జాలదాకర్షింపన్.  14

## ప్రథమ ద్వితీయతృతీయపాదగతము

కం॥ • పారనసారన • జలకా
• పారగ పారగ • కనాద సహితమరాళీ
• వారమువారమ • హీళ నా
మారవికారముప విరహిమారకమయ్యెన్.  15

## ప్రథమ ద్వితీయ చతుర్థ పాదగతము

ఆ॥ • విషమవిషమ • శరుఁడు పీవికిసాయంబు
• మలయమలయ • నిలువిమలయఁజేసి

నలువపుచుండెంవావి సాధనంబులఁ జిందర్సి
ంకలయకలయఁ ంబెఱలగాథలేల ? 16

## ప్రథమ తృతీయ చతుర్థపాదగతము

కం॥ , మానిమానిని , రంతర
మానముఁగ్రై కొనునుగాక స్మరపరవశయై
, తానవతానవ , తను వల
, మానసుమానసు,ని నన్ను మన్నసతోరన్. 17

## ద్వితీయ తృతీయ చతుర్థ పాదగతము

కం॥ మారవశునన్నె గెలిచెను
ం నీరజ నీరజ ం ముసీదునెమ్మొగము మనో
ంహారిణి ! హారిణి ! , కన్నుల
ంచారుతచారుతంంవారిజరుచిఁ గెలువదే. 18

## పాదచతుష్టయగతము

గీ॥ ంపాటలాపాటలా,ంశుక భ్రాజమాన
ంసౌరభాసౌరభా, స్పదసారసాస్య
ంభావిభాభావిభా,న నా పాలిఁటికి సు
ంరమణి రమణి, నాహృన్మందిరమున నిమిరె. 19

ఆ॥ వె॥ యమక మవ్యపేత మగు నిది పాదాది
గతము. చెప్పితి నవికల్పముగను.

అవ్యపేతమైన యమకంబునఁ గల వి
కల్పములను గొన్ని దెల్పఁబడెడి. 20

## ప్రథమద్వితీయపాదగతమిశ్రవ్యపేతాదిభాగయమకము

గీ॥ •సకల• రవపిక సహకారముకుళమునవె
•సకల• మావిపీమాన నాశనమొనర్చె
మధురముసుగంధియీ మధుమానము మధు
కరవినాదమహాహ్లాదసరణి ధరణి. 21

## ప్రథమతృతీయపాదగతము

కం॥ •కరము• విపంచీతాడన
పరిచితమై యరుణరుచులఁ బరఁగెడితరుణీ
•కరము• రమణతాడనమున
కుఱుకుంగర్ణోత్పలంబుఁ * గొవి పొలయలుకన్. 22

## ప్రథమచతుర్థపాదగతము

కం॥ •వకలావ•విలసనములై
ప్రకటముగా వాడఁ దొడఁగె బర్హిణములు మే
ఘకదంబకంబు గురిపెను
•వకలావ•గ లతిసమృద్ధిసంగతి మెఱఁగన్. 23

---

* కోపఁగొని యీర్ష్యచే.

## ద్వితీయతృతీయపాదగతము

క॥ కలికి! భవన్మానమహా
◆కలి కా◆మసమృద్ధి బుద్ధిఁ గనె నీవలతా
◆కలికా◆మహితాకృతిఁ గ
న్నులఁ గని నీ వెట్టిశను మాల్కొనుదాకన్. 24

## ద్వితీయ చతుర్థ పాదగతము

గీ॥ చెలువు మీఱఁ గ్రీడాశైలశిఖరభాగ
◆చంద్రకాంత◆స్థలంబెక్కి జలదపఙ్క్తి
గన్గొనుచు నృత్యమొనరించఁ గంపమాన
◆చంద్రికాంతం◆బు బర్హిజనముదయంబు. 25

## తృతీయ చతుర్థ పాదగతము

వం॥ పతాధీశదర్పాధిపత్యంబు వోవన్
ధరాధీశ! నీబాహు తానేలు ధాత్రిన్
◆వరాహా◆భవద్దైత్య వైర్యుద్ధృతంబున్
◆వరాహా◆శశీర్షాగ్ర భాగస్థితంబున్. 26

## ప్రథమ ద్వితీయ పాదగతము

క॥ ◆కరము◆ హతశత్రురాజని
◆కరము◆ త్వదీయంబు చూరకత్తిని వొడిచెన్
◆కర్షము◆ను నెత్తురు లొలుకఁగఁ
గరేణువులు నంత మెఱయు ఘనములఁ దోరెన్. 27

## ప్రథమతృతీయచతుర్థ పాదగతము

పృథ్వీ॥ పరాగతబలాఢ్యులౌ భటులు వైరిరాట్సేనలన్
బరాక్రమ సమేతులై ప్రబలి పాలఁదోలన్ ధరా
♦పరాగత♦తి తత్పదాహతిని బర్వి క్రమ్మెన్ దెసల్
♦పరాగత♦మొకో! యనంగఁ గనుపట్టదభ్రంబొగిన్. 28

## ద్వితీయ తృతీయ చతుర్థ పాదగతము

పృథ్వీ॥ ముదంబొసఁగు మాకిలన్ భువనమోహనాకారుఁడై
♦ సదానవ ♦కదంతిరాడ్వర విశారదప్రౌఢిమై
♦సదానవ ♦ఘనాఘనోల్లసితకాంత సన్మూర్తియై
♦సదానవ ♦వినాశనప్రథితుఁడైన సర్వాత్మయే. 29

## సర్వ పాదగతము

గీ॥ ♦కమల ♦వలె లోకమోహనాకారవీవు
♦కమల ♦భవసృష్టి నెవరికిఁ గలఁత విదవు.
♦కమల ♦విభము ముఖం బెగిగ్వార
♦కమల ♦కావళి కల్వలై క్రాలుఁ గనులు. 30

## ప్రథమద్వితీయములందును తృతీయచతుర్థములందును అదియే విజాతీయము

పృథ్వీ॥ ♦ముదార ♦చిత విభ్రమస్ఫురిత భూషణశ్రీలఁ దా
♦ముదార ♦రమణాంతరంగకము బూచుచున్ విద్యుల్లా

‌మదభ్రమణచాతురిన్ జఘనమండలంబార గో
మదభ్రమగుచుండఁగాఁ జనెద రంబుజాతాననల్. 31

ప్రథమతృతీయములందును ద్వితీయచతుర్థములయందును
అదియే విజాతీయము

గీ॥ ముదిత రో! నీదుసూక్తులు మృదుతనుఁ బిక
మా రుతంబులచేతను సారసమధు
ముదిత భృంగంబులాగానమునను మలయ
మారుతంబాగతిన్ నాదుమనసు గొనెడి. 32

ప్రథమచతుర్థములందును ద్వితీయతృతీయములయందును
అ ది యే వి జా తీ య ము

గీ॥ సురయమహి కలసిగ్గును దఱిమివేయ
సుతను మధ్యలు స్విన్నాస్యశోభలెసఁగ
సుతనుమధ్యగణ్యండగు సుభగుని, మన
సు రయమహిమనొప్పఁగఁ గూడి సౌఖ్యమందు. 33

తే॥గీ॥ ఇట్లుగ వ్యపేతయమకంబు వెనసియుండు
భేదముల నీవిగూడఁ జూపించినాఁడ
నవ్యపేతవ్యపేతాఖ్యయమకగత వి
కల్పములు పైతమవికొన్నిగల వెటులన. 34

## ద్విద్విపాద గతావ్యపేతవ్యపేత మిశ్రాదిభాగ యమకము

తే॥గీ॥ •పాలసాఁ•సాలోకనజాలమై ర
•పాలసాల•లతాకలికాళిఁజూడ
•బాలబాల•మృణాళాంగి బాల దల్లి
* బాలఁ బాల•నసేత నీపాలఁబడియె. 35

## ద్విద్విపాద గతావ్యపేతవ్యపేత మిశ్రాదిభాగ యమకము

తే॥ •కాలకాల•క యెవ్వతె గాంచఁగలదు
•తారతాఁ•క లాచ్ఛాదితములు గాఁగ
•తారతాఁ•మ్యరసితవిస్తారవర్ష
•కాలకాల• పమోదముల్ గ్రమ్ముకొనుట. 36

## పాదచతుష్టయగతము

కం॥ ,యమయ మ•ది విలిచెడి, నపా
•యమయామ, యయ్యో దినినిశయనంతంబగుచున్
•యమ యమ,రపురి కరిగె. న్యా
,యమ యమ•నమశక్యమగుట యమపురగతియున్. 37

గీ॥ కలదుపాదాదియమక వికల్ప వితతి
వరక యీదృశంబు యమకాంతరము లైన
వెలయుచుండు విశ్లే వికల్పింపఁబడఁగఁ
దగినవగుచు మిక్కిలిగ సత్కావ్యములను. 38

---

* కాలకాలపాశశతాభ్రపాళిఁ బోల్పు.

గీ॥ వి స్తరంబగువవి మది భీతి గలుగ
భేదముల విశేషముగఁ జూపింపఁదలఁప
దుష్కరాభిమతంబులై తోఁచు కొన్ని
యిచట వివరంబుగా వచియింపఁబడును. 39

## పాద చతుష్టయగతమిశ్రావ్యపేత వ్యపేత మధ్యభాగయమకము

ప్రమాణి॥ స్థిరా•యతా యతా•శయా
పరా•యతాయతా•రి రా
ద్వరా•యతా యతా• శయా।
హరీ। •యతాయతా• ద్భుతా! 40

## ప్రతిపాదవ్యపేత మధ్యమధ్య భాగయమకము

తే॥గీ॥ నభ•సుర•లఁ బోలు భూ•సుర• చంద్రులెల్ల
మహీ•సుర•భి వెన్నుచున్ • సుర•మణివి బోలు
వీ•సుర•తఁ గూర్చు భా•సుర•సత్యదాన
గుణ•సుర•భిత గాంత్రి•సుర•సులొప్పనంగ. 41

## సర్వపాదగతమిశ్రావ్యపేతాంతభాగయమకము

తే॥గీ॥ వరఁతి కగ్గలమయ్యెను బాండి•మదము
* పంచశరబాధ. గోపన ప్రౌఢి•మఁదము
వెలుఁగరెవరవిమీబోంట్లు వెంత్రు •మదము
బుద్ధిచెగఁదట్టః నళికి గూర్చెము ప్ర•మదము. 42

---

* పంచశరబాధ గోపన ప్రౌఢిమదము

## అవ్యపేతవ్యపేతాంతభాగయమకము
### పాదచతుష్టయగతము

ప్రమాణి॥ కృతీ కృతా • నతీ నతీ
ప్రతుష్టిదా • నతీ నతీ
శ్రుతా ధరా • నతీ నతీ
కృతా సురా • నతీ నతీ　　43

## మిశ్రవ్యపేతమధ్యాంతయమకము
### ప్రతిపాదగతము

తే॥గీ॥ స్మితవితతి• చేత• మృదులభాషితము •చేత
సొలపువెన్నెల•చేత• వాల్చూపు •చేత
* గబ్బిగుబ్బ‡•చేత• జఘనము •చేత
యమువి•చేతఁ• జిక్కెతి విధి యతివ •చేత　　44

## అవ్యపేతవ్యపేత మధ్యాంతయకము
### ప్ర తి పా ద గ త ము

తే॥గీ॥ మాన్య భజ•మానమాన• న •మానమాన
మహిత జిహ•మానమాన• పా•మానమాన
వన్నవల •మానమాన•సున్ •మానమాన
మమపు గత•మానమాన•వా •మానమాన　　45

---

* జృంభితముచేత ‡ఘనవీక్షితముచేత

## ప్రతిపాదగత మిశ్రవ్యపేతాదిమధ్యయమకము

తే॥గీ॥ •సార•సదళాయతాక్షి మ•సార•వేణి
•సార•ఘ మనోజ్ఞహారా ప్ర•సార•వాణి
•సార•సాను కృతారావ •సార•వాణి
•సార•సాలయ హొల్బ సం•సార• తరణి. 46

## బేసిపాదముల మిశ్రావ్యపేతవ్యపేతాద్యంతయమకము సరిపాదముల—అట్టిదే ఆదిమధ్యయమకము

వంశస్థవృత్తము. •నయానయా•లోకధనా •నయానయా
•నయానయా• నాశ•నయానయా•తుదా
•నయానయా• న్యాతపనా •నయానయా
•నయానయా• కల్ప•నయానయా• శయా. 47

## ప్రతిపాదమిశ్రవ్యపేతాద్యంతయమకము

వంశస్థము. •రవా•ధ్యభేరీస్ఫుటరాజగో•రవా
•రవా•ధికత్రిస్యదరాతి పీ•రవా
•రవా•రణౌద్ధత్యకరాశ: ఫే•రవా
•రవా•తులాయోధనరంగభై •రవా 48

## అవ్యపేతవ్యపేతమిశ్రాద్యంతయమకము ప్రతిపాదగతము

పంచ॥ •పరావరా• ధరావణాది భంజనా •పరావరా
•పరావరా• దిభేదశూన్యభావనా •పరావరా

పరావరా॥ ద్వయాతిరిక్త భక్తితత్ ॥పరావరా
పరావరా॥క్ర మాత్త్రగౌరవాదయా ॥పరావరా 49

## ప్రతిపాదగత వ్యపేతాది మధ్యాంతయమకము

పంచ॥ మతా॥ చ్యుతాభిరా॥మతా॥ నమన్మహాంఘ్రి ॥మతా
మతా॥మబ్బృంద భూ॥మతా॥సమ్ప్రతాపధా ॥మతా
మతా॥ శ్రితా ర్తకా॥మతా॥నమద్ధయద్రిసీ॥మతా
మతా॥వ్యగీతనా॥మతా॥సమా శ్రితాసుధీ॥మతా 50

## అవ్యపేత వ్యపేతాదిమధ్యాంతయమకము ప్రతిపాదగతము

సీ॥ సారసార॥గభీర ॥ సకలారినృపసాహ
॥సార్ధసార॥వనదో॥॥సారసార
సారసార॥తికరాస్య ప్రభాభూషణ
॥సారసార॥మణప్ర॥సారసార
సారసార॥మతుల్య ధీరసుభాషితా
॥సారసార॥న్య సం॥సారసార
సారసార॥స్వత సంచారపూరవి
॥సారసార॥జ్ఞాను॥సారసార

తే॥ యమకఁగ నెడలేమి నెడగల్మి నవ్యపేత
మున్ వ్యపేతమునగుచుఁ బొల్పుఁగనుచుండు
నాదియందును మధ్యమం దంతమందు
యమకమియ్యది నాల్గుపాదములయందు. 51

## సందష్టయమకము

తే॥గీ॥ పూర్వపరపాదముల యంతమును మొదలును
వాన్పదంబగు నందష్టయమకమునకు.
చెప్పఁబడినట్టి వానిలోఁజేరినను స్వ
తంత్రిముగ దీని గీర్తించెద నిట మరల. 52

తే॥గీ॥ కఠినరాక్షసంహృదయస్థ కామన
కామనాశనాదిసురని కరకృతార్చ
కరకృతార్చనభక్త సుఖప్రకాశ।
అప్రకాశమార్తాండ సంకాశ తేజ। 53

---

## స ము ద్గ య మ క ము

తే॥గీ॥ పాదయుగమెద్దియైన నభ్యస్తమగుట
యగుసముద్గము భేదత్రయంబుతోడ
బేసిసరిపాదముల్ సరిబేసిచరణ
ములును రెండేసి యభ్యస్తములగుఁ గాన. 54

## స ము ద్గ ము

### ప్రథమతృతీయపాదగము, ద్వితీయచతుర్థపాదగము

కం॥ వరమ। హిమాచల ధీరా
దరపూరితభావజాతదమముదిత హరా!

పర। మహిమాచల। ధీరా
దరపూరితభావజాతదమముదితహరా : 55

## సముద్గము
### ప్రథమద్వితీయపాదగము, తృతీయచతుర్థపాదగము

తే॥గీ॥ శ్రీశ ! తార విరావ విజిత సురారి
శ్రీశతార విరావవిజిత సురారి
వాసవాది వాచా స్పృష్ట పరమసుగుణ
వాస। వాదివాచాస్పృష్ట। పరమ। సుగుణ ! 56

## సముద్గము
### ప్రథమచతుర్థపాదగము, ద్వితీయతృతీయపాదగము

పంచ॥ ఘనాఘన ప్రభావలోపకారి కాంతి విగ్రహా
వినాయకోహ్యమానపాద పీఠపాలితామృతా।
వినాయకోహ్యమానపాద పీఠపాలితామృతా।
ఘనాఘనప్రభావలోపకారికాంతివిగ్రహా। 57

---

## పాదాభ్యాసయమకము

తే॥గీ॥ రెంటికిన్ మూఁడిటికిని నాల్గింటికి నొగిఁ
బాదములకు నభ్యాసంబు వఱలుఁగాన
నైకవిధము పాదాభ్యాస మనునదియును
చక్కఁగా వ్యక్తమగు విదర్శనములందు. 58

## ప్రథమద్వితీయపాదగత పాదాభ్యాసము

తే॥గీ॥ శ్రితమనోహరరూప విధృతకలాప
శ్రితమనోహరరూప విధృతకలాప
సారబృందావనవిహార తారహార
దేవకీగర్భసంభూత దివిజనేత। 59

## ప్రథమతృతీయపాదగత పాదాభ్యాసము

భు॥ప్ర॥ సుధర్మాదిరాఘాతి శుధ్యద్గుణాఢ్యా।
బుధానందసంధాయి పూజార్హశీలా!
సుధర్మాదిరాఘాతి శువ్యద్గుణాఢ్యా।
సుధాస్వచ్ఛసత్కీర్తి శోభాధురీణా। 60

## ప్రథమచతుర్థపాదగత పాదాభ్యాసము

తే॥గీ॥ విజితవిషమాంబకాభిఖ్య విమలసౌఖ్య
సాధుజనరంజనక్రియాచణగుణగణ
భక్తభరణయశోభరాభరణచరణ
విజితవిషమాంబకాభిఖ్య విమలసౌఖ్య 61

## ద్వితీయతృతీయపాదగత పాదాభ్యాసము

తే॥గీ॥ అరికరాళభవజ్జైత్ర యాత్రలందు
భూపరాగంబుతో దిశల్ ముట్టుఖ్యాతి
భూప। రాగంబుతో దిశల్ముట్టుఖ్యాతి
యనెడి చిత్రితరోదంత మవని వెలయు. 62

## ద్వితీయచతుర్థ పాదాభ్యాసము

ఆ॥వె॥ వసుధవిలుపునాదు బలమని భవదీయ
భుజగశక్తి గర్వపూర్తి నెగడు
నేనుమోయనేల నిలిచెడిననిశేష
భుజగశక్తి గర్వపూర్తి నెగడు. 63

## తృతీయచతుర్థపాదగపాదాభ్యాసము

తే॥గీ॥ నన్నుగాపాడు శివుఁడు స్వాంతమునఁ దోఁచి
పోల్లసత్కరుణా:సాంబునిధిపిచి
చంద్రఖండోత్తమాంగభూషణసితరుచి
చంద్రఖండోత్తమాంగభూషణ సితరుచి 64

## ౧, ౨, ౩ పాదముల పాదాభ్యాసము

తే॥గీ॥ బంధురాజీవరవిభానుభావరమ్య
బంధురాజీవరవిభానుభావరమ్య
బంధురాజీవరవిభానుభావరమ్య
యఖిలలోకప్రియంబు నీయభ్యుదయము. 65

## ౧, ౨, ౪ పాదముల పాదాభ్యాసము

తే॥గీ॥ జన్యవసుమతీశరభరజస్స్వభావ
జన్యవసుమతీ శరభరజస్స్వభావ
భవదు దారమనీష భూపాప్రభావ
జన్యవసుమతీ శరభరజస్స్వభావ. 66

## 2, 3, 4 పాదముల పాదాభ్యాసము

తే॥గీ॥ శ్రీహరీ ! నన్నుగరుణ రక్షింపుమయ్య
యనవహితభావనాశనవినయకరణ
యనవహితభావనాశనవినయకరణ
యనవహిత భావనాశన వినయకరణ. 67

## 4 పాదముల పాదాభ్యాసము

తే॥గీ॥ హరికరాస్పర్శమహతతమోవనంబు
హరికరాస్పర్శమహతతిమోవనంబు
హరికరాస్పర్శమహతతమోవనంబు
హరికరాస్పర్శమహతతిమోవనంబు. 68

## పాదాభ్యాసోపసంహారము

తే॥గీ॥ చరణమున కొక్కపరి రెండుసార్లు మూఁడు
సారు లావృత్తియగు నిదర్శనములివ్వి

## ప ద్యా భ్యా స ము

చూపఁబడు నింక యుక్తార్థమై పరఁగెడి
పద్యములజంట పద్యగాభ్యాసమనుచు. 69

## పద్యాభ్యాసము, విష్ణుస్తుతి

ఆ॥వె॥ ఉద్ధృతస్వమిత్ర ! యుపచితాసురజైత్ర
పరవినాయకోర్ధ పాదపద్మ

వృషవరేణ్యవాహ విషధరాసితదేహ
అద్రిజామనఃప్రియకృదభిఖ్య! 70

## శివస్తుతి

ఆ॥వె॥ ఉద్ధృతస్వమిత్ర! యుపచితాసురశత్రి
పరవినాయకోర్ధ పాదపద్మ
వృషవరేణ్యవాహ విషధరాసితదేహ
అద్రిజామనఃప్రియకృదభిఖ్య! 71

## మహాయమకలక్షణము

తే॥గీ॥ పాదములు నాల్గు నొక్కరూపమున నుండఁ
బాదఖండంబులకును నభ్యాసమొదవి
యుండుట మహాయమకసంజ్ఞ నొప్పుచుండు
యమకరచనమయ్యది పరంబగుచునుండు. 72

## మహాయమకము

వం॥ స్వసారమా స్వసారమా స్వసారమా స్వసారమా
స్వసారమా స్వసారమా స్వసారమా స్వసారమా
స్వసారమా స్వసారమా స్వసారమా స్వసారమా
స్వసారమా స్వసారమా స్వసారమా స్వసారమా. 73

## విజాతీయమిశ్రయమకము

వం॥ *ధరాధరా పరికంప్య ధీరతాధరాధరావరా
వరా మహీయ ఆదరార్హ పాప కామహీనతా

*౧ పాదమున—అవ్యవహితాదిమధ్యయమకము. ధరా, ధరా,
౨ పా, బహువర్ణవ్యపేతమధ్యయమకము. మహీ, మహీ,

*నతాంతరంగరూప రంగ న ర్తకాబ్జ శేఖరా
ఖరాతిమూఢభావలీన కల్మషావలీ హరా। 74

## ప్రతిలోమయమకలక్షణము

తే॥గీ॥ పద్యపాదంబునందును బద్యఁపునగ
పాలునను బద్యమందును బ్రాతిలోమ్య
మునఁ గనంబడు నావృత్తి దనరును బ్రతి
లోమయమకంబునాఁ బ్రతిలోమమగుట. 75

## పాదప్రతిలోమయమకము

తే॥గీ॥ మనమ కలకకనక మనుమ మహిమ తగ
గతమహిమ మనుమ కనకకల కమనమ
కలిక కలికలనలకలకులుకు కలిమె
మెలిక కులుకులకలనలకలిక కలిక 76

## పద్యార్ధప్రతిలోమయమకము

తే॥గీ॥ నళినయన జలజనమనదరదమన
వినుతి మిసిమిలలిరుచహసనగత గమి

---

*3 పా, వర్ణద్వయవ్యపేతమధ్యయమకము. రంగ, రంగ.
ర పా, వర్ణచతుష్టయవ్యపేతమధ్యయమకము. వలీ, వలీ

| | | |
|---|---|---|
| పాదసంధుల | అవ్యవహితాంతాదియమకము<br>సందష్టయమకమును | వరా, వరా<br>నతా, నతా<br>ఖరా, ఖరా |

మిగత గన సహచరులిల మిసిమితినువి
నమదరదనమనజలజనయననళిన. 77

## పద్యప్రతిలోమయమకము

తే॥గీ॥ కనకనమనతనుసుతనువినుతజవన
నలినదమదసరసనయనమదనమన
వరదయభయచరపదమదరదసమయ
సరసతమభిదసరసవిసరహిమరవి. 78

తే॥గీ॥ విరమహిరసవిసర సదభిమత సరస
యమసదరదమదపరచయభయదరవ
నమనదమనయనసరసదమదనలిన
నవజతనువినుతసునుతనమనకనక. 79

ఇది యమకచక్రము

---

## గోమూత్రికాబంధలక్షణము

తే॥గీ॥ పద్యమున రెండుసగముల వర్ణములను
వరుసనొక్కొక్కవర్ణంబు విడిచిపెట్టి
వర్ణములకేక రూపత వఱలఁజెప్ప
నమరు గోమూత్రికాబంధ మసుకరంబు. 80

## అర్ధగోమూత్రికాబంధము

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శ్రీ | ధు | ప | ము | ద | మా | స | న | ల | ఁజే | మ | వె | హి | ముల్ |
| నా | ని | ద | ను | మ | న | ము | మె | ఁగ | య | న | మ | మ | |
| నా | ము | హృ | య | త | లా | వ | ద | స | ఁజే | ఁద | రు | హి | తుల్ |

కం॥ శ్రీనాధునిపదమును దమ<br>
మానసమున మెలఁగఁ జేయ మనవె మహిమముల్<br>
నానామునిహృదయనుతమ<br>
తానవముదమెసఁగఁజేయఁదనరు మహి మతుల్. 81

## మతాంతరమందలి గోమూత్రికాబంధము

*తే॥గీ॥ నడుమ నొక్కొక్క వర్ణంబు విడిచి వర్ణ
సామ్య మేర్పడు నట్లుగాఁ జరజయుగమొ
రెండుసగములొ పద్యముల్ రెండొ చెప్ప
నమరు గోమూత్రికాబంధ మసుకరంబు

పాదగోమూత్రికాబంధము

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | వి | జి | వ | డు | షి | ర | ఁడు |
| శ్రీ | రా | త | క్షుం | ఋ | వ | దు | |
| | క | ద్భు | పీ | డు | త | ల | రు |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | ప | ర్వా | ణ | మ | క్ష | మ |
| తా | ని | ప | క్ర | ద | భీ | |
| | వి | ద్ర | రా | మో | స్త | తి |

తే॥గీ॥ శ్రీవిరాజితవక్షుండు ఋషివరదుఁడు
శ్రీకరాద్భుతపీఠుండు ఋతపలదురు
తాపనిర్వాపణ క్రమదక్ష భీమ
తావి నిద్ర పరాక్రమో దస్తభీతి. 82

## అర్ధభ్రమ సర్వతోభద్రముల లక్షణములు

కం॥ అర్ధభ్రమమందురు ప, ద్యార్ధభ్రమణమును భ్రమణ మవ్విగతులతో
వర్ధిలిన నొప్పుకొనుచుం, దుర్ధర సద్దాని సర్వతోభద్రముగన్. 83

అ ర్ధ భ్ర మ ము

| సీ | తా | జా | సీ | ఙ్ఞా | నా | ధా | రా |
|---|---|---|---|---|---|---|---|
| తా | తా | తా | తా | ను | ఙ్ఞా | బా | ధా |
| జా | తా | తం | కా | ర్వా | ను | ఙ్ఞా | నా |
| సీ | తా | కా | మా | స్వ | ర్వా | ను | ఙ్ఞా |
| ఙ్ఞా | ను | ర్వా | స్వ | మా | కా | తా | సీ |
| నా | ఙ్ఞా | ను | ర్వా | కా | తం | తా | జా |
| ధా | బా | ఙ్ఞా | ను | తా | తా | తా | తా |
| రా | ధా | నా | ఙ్ఞా | సీ | జా | తా | సీ |

విద్యున్మాల—సీతాజాసీ ఙ్ఞానాధారా, తాతాతాతానుఙ్ఞాబాధా
జాతాతంకార్వానుఙ్ఞానా, పీతాకామాస్వర్వానుఙ్ఞా 84

# సర్వతోభద్రము

| రా | మా | మా | నా | నా | మా | మా | రా |
|---|---|---|---|---|---|---|---|
| మా | మా | మా | మా | మా | మా | మా | మా |
| మా | మా | నా | ధా | ధా | నా | మా | మా |
| నా | మా | ధా | నా | నా | ధా | మా | నా |
| నా | మా | ధా | నా | నా | ధా | మా | నా |
| మా | మా | నా | ధా | ధా | నా | మా | మా |
| మా | మా | మా | మా | మా | మా | మా | మా |
| రా | మా | మా | నా | నా | మా | మా | రా |

విద్యున్మాల — రామామానానామామారా, మామామామామామామా
మామానాధాధానామామా, నామాధానా నాధామానా

తే॥గీ॥ స్థానవర్ణస్వరంబులందైన నియతి
గణితమయ్యెను జతురాదికముగ దుష్క
రంబులం దొగిఁదత్ప్రదర్శనముసేయు
వాఁడ, నితరంబు సుకరమై పరఁగుచుండు. 86

## దీర్ఘచతుస్స్వరనియమము

సావిత్రి॥ రామాసామారామా
కీమీ స్మృతీ పీ శ్రీ
రోమోద్బోధోద్యోగో
త్రేమేభేంద్రేద్యేట్టే. 87

విద్యున్మాల॥ రారా రాధానాథా శ్యామా
ధీరీధీపీఢీశ్రీకీర్తీ
మోరోయోగోద్యోతోల్లోచో
త్సేన్ద్రేశేక్షేట్టే పేపే నేఁదే* 88

## హ్రస్వత్రిస్వరనియమము

కం॥ క్షితివిజితస్థితివిహిత
వ్రతరతపరతరమహత్ప్రవరహర్షకర
స్తుతు లురుగుణులు కురువులు సు
చతురు లగుచు భువి జనులకు సలిపిరి ముదమున్ 89

* "సర్వేవాద్య సఘోశ్వేః" అనికతోపనిషత్తు.

## దీర్ఘద్విస్వరనియమము

వి॥ శ్రీపీధీధీరీతీశీరీ
శీపీతీసీపీతీసీతీ
నేవేజేయేదేమేలే? లే
లేవేవేలేయేవేనేఁడే. 90

## దీర్ఘైకస్వరము

వి॥ రామా స్వాత్మారామారామా।
నామా ధ్యానా ఖ్యానా వామా।
కామానాక్రాంతాత్మావాసా
శ్యామాంగా సార్వాత్మ్యాభ్యాసా। 91

## స్థాననియమము
## నిరోష్ఠ్యము, చతుస్థానము

తే॥ శ్రీకరాధికాచలశీల। సిద్ధజాల
కలశజాద్యధిగతలీల। కనకచేల।
హతకపట। ధీర। నిఖిలశాస్త్రాధికార।
ఖలజనవికార! యాగసత్కారకార। 92

## నిరోష్ఠ్యమూర్ధన్యము, త్రిస్థానము

కం॥ అళిలీలాలకలతికా
కలితకలాలయజయచయకథకాస్యలస

జ్జంజదళలలితకాయతఁ
జెలి లాలితయాత్రసహిత చెలఁగె లలి సఖా ! 93

## దన్త్యకణ్ఠ్యములతో, ద్విస్థానము.

కం॥ తదఘహతసకలఖలగళ ।
సదగదదా ! దళదగదఘ । సత్కథ । దాతా ।
గదగలధాతా । హోతా ।
దదదావాతా । గతాగతగతా । తాతా । 94

## ఏకస్థానము, కణ్ఠ్యవర్ణములు

ఆ॥వె॥ ఖగగ ఖగగ ఖగగ కగకగకగకగ
కాకకాకకాకగాకకాక
ఖగఖగాఘకకకకాకాకకాకాఘ
కఘగగాకకకకఘాగఖగక. 95

ఇది స్థాననియమము.

---

## —వ్యంజననియమము—

## నాలుగుహల్లులుగల చిత్రము

తే॥గీ॥ దేవదేవ । దీనావనాదీనభావ ।
భావనామాననానానుభావభావ
భవన । వేదనిదాన । దానవవినాద
వనదవా । నన్దనన్దనా నన్దదాన । 96

## మూఁడుహల్లుల చిత్రము

తే॥గీ॥ నన్దనన్దన ! దేవ ! నానావినోద !
దీనదీనవిదూనన దీనవనద
నినదవదనానపీనవన్దనవదవన
నన్దనవనావనావనా ! వన్దిదేవ ! 97

## రెండుహల్లుల చిత్రము

కం॥ సారాసురసౌరి ! సుర
సారసనూరా ! రసరసనసరసాసారా
సీరరసరసనరసరస
సారసరసి ! రానసరస ! సరసరిరంసూ ! 98

## ఒక్కహల్లు చిత్రము

తే॥గీ॥ నేనునూనినానవినునినిన్నన్నన్న
నాననూనవిన్నునేనునూన
నన్ననన్ననన్నన్ను నేనోనూను
నాననునినెన్ననౌనెననన ! 99

కం॥ భాభాభాభాభాభా
భీభీభీభీభుభీభుభీభీభీ
భూభూభూభూభూభూ
భేభభభాభాభభాభభీభాభూభా ! 100

తే॥గీ॥ ఈవిధంబున రచియింప నెంతయేని
గష్టముగ నుండునట్టి మార్గంబునందుఁ
గ్రమ మొకించుక యిట్లుగ గానుపింపఁ
జేయఁ బడినది యయ్యె నాచేత నిట్లు. 101

స్వరస్థానవ్యాకరణము లిపి

---

# ప్ర హే ళి క లు

తే॥గీ॥ క్రమముగఁ బ్రహేళికాప్రకారముల గతి స
మంచితంబుగ నిక వచియించువాఁడ
నీప్రహేళికలను నిర్ణయించియుండి
రార్యులు పురాతనులు పదియాఱటంచు. 102

తే॥గీ॥ ఇతరములయిన దుష్టప్రహేళికలును
గలవు పదునాల్గటంచు వారలె పలికిరి
దోషము లమితము లటంచుఁ దోచె మాకు
సాధువులఁ జెప్పుదుముట. దుష్టములు వెటలు. 103

## ప్రహేళికల ప్రయోజనము

క॥ మనుజుల క్రీడాగోష్ఠీ
వినోదములఁ దద్జ్ఞులందు వేళ పరిహాస్యం
పునుదులను బరవ్యామో
హనమునను బ్రహేళికలివి సార్థకములగున్ 104

## స మా గ త

తే॥గీ॥ శబ్దములసంధిచేత విస్పష్టముగను
దెలిసికొనఁగ శక్యముగాని తీఱున నతి
గూఢమైన యర్థముతోడఁ గూడియుండు
నేనది సమాగతాఖ్యప్రహేళికయగు. 105

కం॥ నేనాగోరసమెఱుఁగను
మానిని! కోపించెదేల? మానసమంద
స్థానరుదితంబు లివి యిఁక
మానుట యుక్తమ్ము రాగమంజుళనయనా! 106

## వం చి త

తే॥గీ॥ లాతియర్థమ్మునందు విఖ్యాతమైన
రూఢిగల శబ్దముల నితరులను వంచి
తులను జేయుట దేనియందునగు నదియె
వంచితాప్రహేళిక యనఁబడుచునుండు. 107

తే॥గీ॥ ఏపగిదిని గుబ్జాసేవనాపరుండ
పైన సీరతిపరివృద్ధినందు నిప్పు
డాపగిది దేవకామినులట్టి యమలఁ
గూడి సుఖియించువానికిఁ గూడ లేదు. 108

## వ్యత్క్రాంత

తే॥గీ॥ చాల వ్యవధానముగ నెల్లశబ్దములును
బద్యమందుఁ బ్రియోగింపఁబడుటవలన

శ్రోతృమతికి వ్యామోహంబుఁ జొనుపుచుండు
నేవి వ్యస్తాక్రాంత యనెడి ప్రహేళిక యగు. 100

తే॥గీ॥ కఠినకంటకమైనట్టి కాడయందుఁ
గమలినిన్ ముద్దిడుకొనె ముఖమున ముక్కు
సేర్చి యంగములన్ సరిచేసికొనుచుఁ *
జారుకూజితమొప్ప హంసఁబొకండు. 110

ప్రముషిత

తే॥గీ॥ ఏపదంబుల యర్థంబు లెంతయుం బ్రి
యానమందినఁ గాని గ్రాహ్యములుగాక
యుండు; నట్టిపదంబుల నొప్పుచుండుఁ
బ్రముషితాఖ్యప్రహేళిక వాఙ్మయమున. 111

తే॥గీ॥ కవిరొ। నీకాలమునయందుఁ గ్రాలుచుండు
స్ఫార్థవల్గుతనొప్పుచు స్ఫాతిఖాతి
గణము లీచంద్రసాక్షాత్కారణమువలన
ధారియగును మత్ప్రాణకదంబకంబు 112

సమానరూప

కం॥ ఏపదములు గౌణార్థా
రోపితములగుచు నిగూఢరూఢార్థములో

---

* యంగఘుట్టనము జేసికొనుచు.

నాపదములచే గ్రథితం
బై పరఁగు సమానరూప యను నామమునన్ 113

తే॥గీ॥ ఐదు చిగురుటాకులు చెలువారుచున్న
వల్లరిని గంటి నీయుపవనమునందు
చివురుచివురున దీనికిఁ జెలువుగలిగి
పోల్చుచున్నది యెట్టిని పూలగుత్తి 114

పరుష

తే॥గీ॥ లక్షణము కల్మియే ప్రబలతరమగు ని
దాన మగుచుండ వ్యుత్పాదిత శ్రుతియగు
చుండునట్టిది పరుషనా నొప్పుచుండు
నలప్రహేళికలందు గూఢార్థమగుచు. 115

తే॥గీ॥ సురసమాజము స్వేచ్ఛగాఁ దిరుగు నిపుడు
చాల మత్తతతోడ సురాలయమున
సౌరకాసారమున నిమజ్జనము సలుపు
చుండెనో। నా దశనకాంతు ఁలయ నగుచు. 116

సంఖ్యాత

తే॥గీ॥ వర్ణములు సంఖ్యచేఁ జెప్పఁబడుటవలన
నేవచనమున వ్యామోహ మేర్పడఁగల
దది ప్రహేళికలందు సంఖ్యాత యనెడి
నామధేయముచేఁ బేర్కొనఁగఁబడును. 117

తే॥గీ॥ నడుమ నాసిక్యమైనవర్ణంబు రెండు
పార్శ్వముల నాల్గువర్ణముల్ పఱఁగుచుండు
వాక్కపట్టణ మీయుర్వి నొప్పుచుండు
నక్షరాష్టకాఖ్యాయుతు లచటి నృపులు. 118

ప్రకల్పిత

తే॥గీ॥ ఇతరవిధమున వాక్యార్థ మెచట భాస
మానమగుచుండునో సూక్తిమహిమవలన
దానిని బ్రకల్పితాఖ్యకమై నెగడు బ్ర
హేళికనుగా సుధీవరు లెఱుఁగవలయు. 119

తే॥గీ॥ తొట్రుపడుచుండు మాటలతోడ వంగి
యూఁగుచుండెడి తలతోడ బాగుదప్పి
దీనమౌ చూపుతోడ వర్తిలుచు వడఁకు
పెరుగు నను గరుణింపవు వృద్ధురాల! 120

నామాంతరిత

తే॥గీ॥ నామధేయంబునందు నానావిధార్థ
కల్పనంబే వచనమునఁ గానఁబడునొ
అదిప్రహేళికలందు నామాంతరిత యు
టంచుఁ బేర్కొనఁబడును గూఢార్థమగుచు. 121

తే॥గీ॥ పార్థివవ్యక్తి యొకఁడు ప్రప్రథమమందు
రాజశబ్దాభిధేయత రాజిలి మఱి

యతనసహితత నొప్పు నావ్యక్తియందు
రాజత యతనసహితతతోఁ జెలఁగదు. 122

నిభృత

తే॥గీ॥ ప్రస్తుతార్థంబునందు నప్రస్తుతార్థ
మందును సమంబులౌచు నొప్పారునట్టి
ధర్మములఁ జెప్పఁగలుగు శబ్దముల నిభృత
మగుచు నన్యార్థమొప్పిన నదియె నిభృత. 123

కం॥ బహుభంగ్యాకృష్టజనని
వహలు హృతదర్పుఁ డౌటఁగి బహుదుర్ధరులై
బహుశధనసహితుఁ జేరుదు
రు హళాహళి నెవరు ? కారు రూపాజీవల్. 124

సమానశబ్ద

తే॥గీ॥ ప్రకృతములగు నర్థములకు వాచకంబు
లైన పదములకుఁ గల పర్యాయపదము
చేత నర్థంబు సిద్ధింపఁ జేయఁబడిన
నెంతురు సమానశబ్దప్రహేళిక యని 125

ఆ॥వె॥ అదె ప్రకృష్టకేశసాహ్వాయమును గెల్చి
పృథివిలేవిదావి పేరు గలిగి
యుండుతావకాంగ ముత్సుకునిగ నన్నుఁ
జేయుచుండె నంబుజాయతాక్షి । 126

## సమ్మూఢ

తే॥గీ॥ కనులఁగట్టినమాదిరిగాఁ బదార్థ
భంగి యెల్ల నిర్దేశింపఁబడినను విను
వారిబుద్ధికి మూఢభావంబుగలుగు
నేని సంమూఢయనెడి ప్రహేళిక యగు. 127

తే॥గీ॥ నాయికానాయకులు శయనమున నవలి
మొగమగుచు శయనించిరి పొలయలుకల
నవల రాగంబు లేర్పడ నట్టులే ప
రుండి ముద్దిడుకొని రొండొరులముఖముల. 128

## పరిహారిక

ఆ॥వె॥ విజితపుత్రిశత్రుపితృపాదనిహతుండు
హిమహరారిధరపరీతమగు న
భోంగణమును మెచ్చెనన యోగమాలాత్మ
క మగుచుఁ బరిహారిక యనఁబడును. 129

## ఏకచ్ఛన్న

తే॥గీ॥ అధికరణగోపనము చేసి యాశ్రితంబు
వ్యక్తమగుచుండునట్లు చెప్పంగఁబడిన
నాశ్రయాధేయముల నొకండపిహితమగుఁ
గాన యిద్ది యేకచ్ఛన్న నా నెగడును. 130

తే॥గీ॥ ఆయుధముఁ బట్టగా వేర దంబుజాయ
తాక్షుల యుద్ధోజమండలం బంటదెపుడుఁ

గ్రాలుచుండు మనుష్యుండు గానిదాని*
హస్తమియ్యది నిష్ఫలంబనఁగరాదు. 131

## ఉభయచ్ఛన్న

తే॥ గీ॥ అధికరణము నాధేయంబునపిహితమ్ము
లైనచో రెంటిగోపనమ్మమరెఁ గాన
సమ్మతంబయ్యెడి నుభయచ్ఛన్న యనెడి
పేర నదియుఁ బ్రహేళికావారమందు. 132

తే॥గీ॥ *దేనితోఁగూడి యేది సమ్మానితమగు
నిఖిలవేళలయందు సాన్నిధ్యమంది
దేనివిడనాడి యేది భుక్తిసమయమునఁ
గానఁబడియెనేని నిరస్యమానమగును? 133

తే॥గీ॥ ఈప్రహేళికాలక్ష్మంబులెల్ల దేని
యందు సంకీర్ణతంగాంచి యన్వయించు
దానినిఁ బ్రహేళికాసముదాయమందుఁ
జేర్చి సంకీర్ణయనుచు వచింతురు. 134

---

* వ్యక్తి.

* 133 తే॥ ఏకమేకముతోఁ గూడెనేని మిగుల
నిఖిలకార్యములందు సన్నిధినిగాంచు
నేక మేకము విడనాడెనేని భుక్తి
సేయుచోఁ గనఁబడి నిరసింపఁబడును? 133

## సంకీర్ణ

తే॥గీ॥ నగజయున్ హయసహితయు సభటయౌచు
సేన యియ్యది జితముకాదేని మూఢుఁ
డనఁగ నెగడు నమాత్రికుండౌటఁజేసి
యక్షరజ్ఞుఁడయ్యును నస్మదాత్మజుండు. 135

తే॥గీ॥ మెలఁగు నామాంతరితతోడ మిశ్రమగుచు
నీప్రహేళిక వంచితారూపయోగి
పెఱప్రహేళికలకును సంకరపుఁగ్రమము
లీదృశంబులటంచు నూహింపవలయు. 136

ఇవి ప్రహేళికలు

---

## దోషప్రకరణము

సీ॥ అలయపార్థంబును వ్యర్థమేకార్థంబు
పరఁగు ససంశయాపక్రమములు
శబ్దహీనాఖ్యదోషంబు యతిభ్రష్ట
భిన్నవృత్తవిసంధు లన్నెరసులు
దేశవిరోధప్రతీతి కాలకలావి
రోధముల్ లోకవిరోధ మొకటి
న్యాయవిరోధంబు నయ్యాగమవిరోధ
మనఁబ్రసిద్ధంబులై తనరుచుండు

తే॥గీ॥ దోషములు పదియేయివి దొలఁగవలయుఁ
గావ్యములయందు సూరిశేఖరులు వీని

వీనికిన్ లక్షణమ్ములు వీనిలక్ష్య
ములను క్రమముగ నిచ్చుట బోక్తములగు — 137

## ప్రతిజ్ఞాదిహాని దోషముకాదా ?

తే॥గీ॥ అల ప్రతిజ్ఞకు హేతుదృష్టాంతములకు
హాని వాటిల్లుటది దోషమగునా ! కాదా ।
యనువిచారము కర్కశంబౌను దఱచు
వ్యర్థమౌనది యాలీథమౌట గలదె ? — 138

## అపార్థము

తే॥గీ॥ అనుమతించెదరు సముదాయార్థశూన్య
మగుచునుండెడిదాని నపార్థమనుచు
మత్తు లున్మత్తచిత్తులు మాణవకులు
నొడువు నుడువుల దోషంబు నూలుకొనదు. — 139

తే॥గీ॥ వేల్పులు సముద్రమును ద్రాగి వేయుచుండి
రేను ముదిమిచే నార్తి వహించుచుంటి
స్తనితముఖరములయ్యెడి జలధరములు
హరికిఁ బ్రియమగుచుండెడి నద్రిగజము — 140

తే॥గీ॥ స్వస్థచిత్తత లేనట్టి వారలిట్లు
పల్కుట యనిందితంబయి పరఁగుచుండు
వితరము లయిన చోటుల నిట్టివాని
గవి యెవండు ప్రయోగింపఁగలిగియుండు — 141

## వ్యర్థతా దోషము

తే॥గీ॥ ఒకప్రబంధమునందైన నొక్క వాక్య
మందునైనను బూర్వాపరార్థములు ప
రాహతింగాంచినన్ విరుద్ధార్థము లయి,
వ్యర్థమనుచు దోషమ్ముగాఁ బల్కఁబడియె. 142

ఆ॥వె॥ చంపివేయుమయ్య శత్రుబలంబుల
నీవసుంధరను జయింపుమయ్య
అఖిలభూతముల దయామతి గల్గునీ *
కొక్కఁడైన శత్రువుండఁడయ్యె. 143

### వ్యర్థతగుణమగుట

తే॥గీ॥ ఉల్లమభిషంగయుక్తమైయుండు నప్పు
డయ్యవస్థ యొకండు పొల్పారుచుండు
దానియందు విరుద్ధార్థమై నెగడియు
భారతి బుధాభిమతమయి పఱఁగుచుండు. 144

తే॥గీ॥ ఆర్యవర్యుండనగు నాకు నర్హమగునె
పరసరోరుహనేత్రిలపైనివాంఛ
తరళమైయొప్పునట్టి యాధవళనేత్రి
యధరమధుపానమెప్పుడు లభ్యమగునొక్కొ! 145

---

* యామతివైనని

## ఏకార్థతాదోషము

తే॥గీ॥ ఒకవిశేషమున్ లేక; పూర్వోక్తమైన
దాని శబ్దరూపంబునఁగాని యర్థ
ముఖమునంగాని మరలఁజెప్పుట గలిగిన
నద్ది యేకార్థమనఁబడు నదియెటులన ? 146

## అర్థపునరుక్తి

తే॥గీ॥ తదలకాభములయి, తటిత్వంతములయి
యెంతయుగభీరములు స్తనయిత్నువులయి
జలధరములివి యున్నసన్కగనొనర్చు
చుండె యుత్కగాఁనుండెకి యువిదనిపుడు. 147

## ఏకార్థత గుణమగుట

తే॥గీ॥ అక్కటికమాదిగాఁగల యట్టివాని
యతిశయంబు వివక్షితమైనయెడల
గ్రమ్మఱంజెప్పఁబడుట దోసమ్ముగాదు
అరయఁగ నీదృశంబలంకారమగును. 148

తే॥గీ॥ అనమయద్వేషణుండైన యతనుచేత
నావరారోహ వినిహత యగుచునుండె
నాసొగసులాడి వినిహత యగుచునుండె
నాళుకాలాప వినిహత యగుచునుండె. 149

## ససంశయ దోషము

తే॥గీ॥ నిర్ణయము సేయుకొఱకు వర్ణింపఁబడిన
వాక్యములు సంశయమ్ము నేర్పఱుచునేనిఁ
జనునది ససంశయాఖ్యదోషంబనంగ
నిట్లు కావ్యవిదుల్ స్మరియించియుంట. 150

## శబ్దగతససంశయోదాహరణము

తే॥గీ॥ ప్రియవిలోకనరసలోల వీక్షణవగు
సారసాననరో ! యిట్టిచందములను
నీదుతల్లి గనుంగొనలేద దూర
వర్తినిగ నామె యిప్పుడు వఱలుకతన. 151

## ససంశయము గుణమగుట

తే॥గీ॥ సంశయంబు సిద్ధింపంగ సలుపుకొఱకె
యిట్టివానిఁ బ్రయోగించునెడల నచటఁ
గలుగనేరదు దోషంబు విలసిలునది
యొకయలంకారముగ నెట్టులుండుననిన 152

తే॥గీ॥ అయ్యవిందిత మామకప్రాణసఖి య
నంగజాతంకలంఘితయై కఠోర
కాలహతకబలాత్క్రియాగ్రస్తయయ్యె
నింక నీయాశ నయ్యెడిదేమి మాకు ? 153

తే॥గీ॥ కామపీడితయగునొక్కొ : ఘర్మతప్త
యగునొకో : యని సంశయ మందఁజేయు
పల్కు నర్మవిధంబుగాఁ బల్కుదూతి
కోదెకాని గరంబు నాకులునిజేయ. 154

## అ ప క్ర మ ము

తే॥గీ॥ ఆదియందు నుద్దేశించినట్టిరీతి
కనుగుణముగ ననూద్దేశ మర్థములకు
నమరుపకయుండిన నపక్రమాభిధాన
మైన దోషంబటంచు ఁద్దాని బుధులు. 155

తే॥గీ॥ ఈజగజ్జాలముల స్థితిసృష్టివిలయ
ములకు హేతువులౌచుండు భూతనాథ
మాధవాంభోజసంభవుల్ మనుచుచుంద్రు
గాత మిమ్ములఁ బరిపాలకత వహించి. 156

## అపక్రమము దోషముకాకుండుట

తే॥గీ॥ అచటి సంబంధమును దెలియంగఁజేయు
యత్నమయ్యది గూడఁజేయంగఁ బడినఁ
గ్రిమవిలంఘనమునుగూడఁ గావ్యవిదులు
పరిగణింపరు దోషవివహమునందు. 157

తే॥గీ॥ బంధుజనులు విసర్జింపఁబడుట తనువు
దొఱఁగుట స్వదేశముఁద్యజించి తొలఁగిచనుట

మూఁడిటన్ బ్రధమాంత్యజపీడ హెచ్చు
మధ్యమము క్షణమాత్రశ్రమము నొసంగు. 158

## శబ్దహీనదోషము

తే॥గీ॥ లక్ష్యలక్షణపద్ధతుల్ లక్షితములు
గాకయుండు పదప్రయోగంబశిష్ట
సమ్మతము శబ్దహీనదోషంబనఁ జను
సత్కవులకిష్టమైన దుష్టంబుగాదు. 159

తే॥గీ॥ సందియములేదు సాగరశక్వరియగు
కాశ్యపినినీకుభుజముక్షణముఁ జేసు
కొనుచునుండు మహారాజ! యనునిటనప
శబ్దముల్ గల్గుటన్ సరసతపొకారె. 160

## శబ్దహీనము దోసముకాకుండుట

తే॥గీ॥ మలయగిరిసంచరించెడిమారుతంబు
లేఁజివుళ్ళమొల్కలు గదలించుచుండు
సులలితంబుగ, దానిచేఁ జూతతరువు
లెల్ల లలితమౌకళల శోభిల్లుచుండు. 161

తే॥గీ॥ ఇట్టిచో వ్యాకృతిరహస్య మెఱుఁగనట్టి
వారికపశబ్దములుగఁ గన్పట్టినట్టి
శబ్దములు యథార్థముగ సుశబ్దములగుఁ
గాన సౌభాగ్యలోపంబుగలుగఁబోదు. 162

## యతిభ్రష్టదోషలక్షణము

తే॥గీ॥ తావుతప్పకయుండఁబదములు తెగుట
శ్లోకములయతియౌను, దెలుంగులందు
తావుదప్పకయుండఁ బద్యములలోన
వర్ణసామ్యంబు యతియగుఁ బాదములకు. 163

## యతిభ్రంశము

తే॥గీ॥ సూర్యవంశజుఁడైన యారాజమౌళి
స్త్రీలసంగీతగోష్ఠిఁ బ్రేమించుచుండు
సకలశాస్త్రజ్ఞుఁడై ధర్మసూక్ష్మమరయు
భువి నిఖిలమేలునన యతిభ్రష్టమిద్ది. 164

తే॥గీ॥ జలదపఙ్క్తుల నీనరేశాగ్రణి చము
విదె పతాకలచేఁ జిమ్మిపేయుననఁగ
నీయఖండయతుల్ శ్రుతిపేయరుచుల
వింపవనుచుఁగొందఱు ప్రయోగింపరెపుడు. 165

## భిన్నవృత్తదోషము

తే॥గీ॥ అక్కరములెక్కువైనను దక్కువైన
గురువులుండెడిచోట నగురువులున్న
లఘువులుండెడిచోట నలఘువులున్న
భిన్నవృత్తదోషంబిది వెగటు గూర్చు. 166

కం॥ శీతలమగుఁ జంద్రికిరణ
వ్రాతంబనిచెప్ప నధికవర్ణంబయ్యెన్
జాతకిసలయములన్ బ్ర
ఖాతార్ద్రములనగ న్యూనవర్ణంబయ్యెన్. 167

కం॥ పువ్విలుకాఁడు శరముల
రువ్వెడినాఁగ నయథాగురుత్వంబయ్యెన్
జవ్వనులఁ బడుమారుశరంపుఁ
గ్రొవ్విరులనఁగ నయథాలఘుత్వంబయ్యెన్. 168

## విసంధి

ఆ॥వె॥ సంహితాఽవివక్షచనునంచుఁ బాదవా
క్యములమధ్యభాగమందు సంధి
పదములకు నొనర్పఁబడకుండుటను విసం
ధ్యాఖ్యదోషమందు రార్యజనులు. 169

ఆ॥వె॥ అలసగతుల తిరుగు అనిలంబుచేతను
పొలతుకల కపోలములను పొడము
ఘర్మమున్ మదంగఘర్మజలమ్మును
నమసిపోయెనన విసంధియగును. 170

## విసంధిదోషముకాకుంట

తే॥గీ॥ ప్రియులయెడ మానమీర్ష్యయుఁ బ్రిదిలిపోవు
ఋతమతివలకు హేమంతఋతువు నిశల

ననఁగ హేమంతవర్ణనం బగునటన్న
నమ్మతములు ఋకారవిసంధు లిట్లు 171

## దేశకాలకలాలోకన్యాయాగమములు

తే॥గీ॥ దేశ మచలరాష్ట్రవిపినాదికమ యగును
రేలును బవళ్ళు ఋతువులు కాలమగును
ఉచితకామార్థసంబంధయుక్తములగు
నృత్తగీతాదులు కలాఖ్య నెగడుచుండు. 172

తే॥గీ॥ తగఁ జరాచరనిఖిలభూతప్రవృత్తి
లోక మనుపేరు గలిగి చెల్లుబడి యగును
న్యాయ మనుపేరు హేతువిద్యలకుఁ జెల్లు
స్మృతులు శ్రుతులు నాగమమని చెప్పఁబడును. 173

తే॥గీ॥ వానిలో నప్రసిద్ధమౌ దానిని గవి
చెప్పెనేనిఁ బ్రమాదమ్ముచేతఁ గనక
దేశకాలాదులకు విరోధి యనుపేర
నచటిదోషంబును వచింతు రార్యులెల్ల. 174

## దే శ వి రో ధ ము

తే॥గీ॥ మలయపవనంబు కర్పూరమహీరుహముల
నొరసికొనుచుండుటం జేసి సురభియగు మ
తంగజము లుద్భవించి కళింగవనము
నందు నవి మృగప్రియంబులై మెలంగు. 175

తే॥గీ॥ లలితకాలాగురుశ్యామలంబు లగుక
పేఁజాతిఁ ధూమముల వెలయుచుండుఁ
జోళదేశములను నిట్టిపోటులఁ గనఁ
జనును దేశవిరోధదోషంబురీతి. 176

## కాలవిరోధము

తే॥గీ॥ నిశలయందునుఁ బద్మిని నిద్రఁదాయు
పగటివేళయందునుఁ గుముద్వతి వికసిలు
సుమశరముల చైత్రమందు పికచయము లగును
గ్రీష్మకాలంబు మేఘమద్దిసతిఁ గాంచు 177

తే॥గీ॥ హర్షకారిహంసనినదమౌ వర్షఋతువు
ప్రమదబర్హిణశాలి శరత్సమయము
సంతతవిమలార్కంబు హేమంతఋతువు
చిత్తహారిచంగసంబగు శిశిరఋతువు. 178

తే॥గీ॥ ఇట్లుకాలవిరోధంబు తేప్పడియెడు
పథము దిట్టిపటంచుఁ జూపంగఁబడియెఁ
దిగుగతిఁ గలావిరోధపద్ధతిని పైత
మించుకంత చూపించెద నెట్లులనిన 179

## కలావిరోధము

తే॥గీ॥ స్థాయిభావముల్ క్రోధవిస్మయము లగుచు
రాజిలున్ వీరశృంగారరసములందుఁ

బూ_ర్తిగా స్వరసప్తకంబు నెగడంగ
మనెడి నాగానమిది భిన్నమార్గము గుమ. 180

కం॥ ఆఱువదినాలుగు కలలన్
విరోధ మిట్లెఱుఁగవలయు, విస్పష్టముగున్
వరుసఁ గలలరూపము పే
ర్మి రహింపఁ గనుఁడు కలాపరిచ్ఛేదమునన్. 181

## లో క వి రో ధ ము

తే॥గీ॥ హస్తి యాఘాతకేసరం బగుచునుండె
శృంగములు తీక్ష్ణములగుఁ దురంగములకు
వతులసారంబ యేరండ మనెడి చెట్టు
ఖదిరతరువున సారంబు గానఁబడదు. 182

ఆ॥వె॥ ఇట్లులౌకికంబ యీవిరోధంబగు
నిఖిలలోకనిత్యనిందితంబు
న్యాయములను పేర నలరారు హేతువి
ద్యల విరోధములను బలుకువాఁడ. 183

## న్యాయవిరోధము

తే॥గీ॥ కలుగదు వినాశనంబు సంస్కారముల క
టంచు సుగతుండుపలికె యథార్థమ యగు
నట్లగుటఁగాదె ? యాచకోరాక్షి నాదు
నెమ్మనంబున నిపుడును నిలిచియుండె. 184

తే॥గీ॥ మాట నసదుద్భవము గనంబడెడిఁ గాన
కాపిలోపవర్ణితమయి కార్యెడి యస
దుద్భవంపు సిద్ధాంతంబు యుక్తమ యగు
ననఁగ న్యాయవిరోధ మిట్లంతటఁ జను. 185

తే॥గీ॥ పుత్రవంతుల్ సదాచారభూషణులును
భూమిదివిజు లగ్న్యాధానమును సలుపని
వారలయ్యు సల్పుదురు వైశ్వానరేష్టి
యనఁగ నిట్లాగమవిరోధ మలరుచుండు. 186

ఆ॥వె॥ అనుపనీతుఁ డయ్యు నామ్నాయముల నెల్ల
నేర్చె నితఁడు గురువునికటమందు
సహజశుద్ధమైన స్ఫటికం బపేక్షింపఁ
జనదుగాదె ? వేఱుసంస్కరణము. 187

తే॥గీ॥ ఈవిరోధంబులెల్ల మేధావియైన
కవి సమర్థతచే నొక్క కాలమందుఁ
దప్పులందునుఁ బరిగణితములు గాక
పరిగణింపంగఁబడు గుణప్రకరమందు. 188

## దేశవిరోధము గుణమగుట

కం॥ అయదిషు ప్రభావంబున
నాయుద్యానంబులెల్ల నాస్పద మయ్యెన్

స్ఫాయత్సారాంశుకకిస
లాయుతయుతసురమహీరుహావళుల కిలన్ 189

## కాలవిరోధము గుణమౌట

తే॥గీ॥ క్షితిపతులనాశనంబు సూచించుచు ఖర
తరముగా గాలి వీచె సప్తచ్ఛదోద్గ
మంబులు కదంబకుసుమరజంబుతోడ
గూడఁ గంపంబుగాంచి గగ్గోలువడగ. 190

## కలావిరోధముగుణమౌట

తే॥గీ॥ ఉయ్యెలల నూచుటన్ భయమొందిన వధు
వుల ముఖంబులయందుండి ప్రోద్గతమగు
లయవిషమమైన గేయంబ నయముకామి
జనుల రాగంబు మిగుల నెసంగఁ జేసె 191

## లోకవిరోధము గుణమౌట

తే॥గీ॥ చాంద్రికిలలయందుండి చల్లని యన
లమును వనితావియోగకష్టములఁ జాల
విహ్వలుండైన యీ కామవివశహృదయుఁ
డురక గణన యొనర్చుచు నున్నవాఁడు. 192

## న్యాయవిరోధము గుణమౌట

తే॥గీ॥ జ్ఞేయుఁ డవునయ్యు నగుదు వజ్ఞేయుఁడవును
సఫలుఁ డవవుచుండియును నిష్ఫలుఁడ వగుదు

వేకతన్ మనియును నీ వనేకమగుదు
విశ్వమూర్తివి నతుల నర్పింతు దేవ! 193

## ఆగమవిరోధము గుణమౌట

తే॥గీ॥ పాండుపుత్రు లైదుగురికిఁ బత్నియైన
రమ్యశుభగాత్రి పాంచాలరాజపుత్రి
యయ్యెను బతివ్రతలలోన నగ్రగణ్య
దైవవిధి యిటువంటిదై తనరుచుండు. 194

తే॥గీ॥ సంగ్రహంబుగఁ జూపితి శబ్దములయు
నర్థములయు నలంకియ లల్లచిత్రి
సుకరదుష్కరమార్గముల్ సూపితి గుణ
దోషముల నెన్నితిన్ గావ్యభాషలందు. 195

తే॥గీ॥ *మనుజుఁ డీవిధి పఠితమార్గమునను
బరఁగ దోషగుణముల వ్యుత్పన్నబుద్ధి
వశ్యవాగభిసృతి1 వశ్యవనిత లభిస
రించు ధన్యునిమాడ్కి రమించు మించు 196

---

* ధన్యుఁ డీవిధిసందర్శితమగు త్రోవఁ బడని

1 మదవతు లభిసృతిఁ దరుణునట్లు రమించు సద్యశముగాంచు.

శ్రీ

# సంస్కృతకావ్యాదర్శస్థవములై తెనుఁగున కుపయోగింపని విమర్శములు

## కథాఽఽఖ్యాయికావివేచనము

(౧) పరిచ్ఛేదము (౨౧) పద్యముతర్వాతఁ గలది.

తే॥గీ॥ కాని యాఖ్యాయికలఁ బెఱలోకథకులొట
నిట్టి నియమంబునకు భంగ మేర్పడియెను
తానయిన లాతియైన వక్తయగు టొప్పు
ననుట భేదలక్షణ మెట్టులగును ? జూడ. 1

తే॥గీ॥ వక్త్రి మపరవక్త్రంబు నుచ్ఛ్వాసయుక్తి
యగును భేదక చిహ్నమాఖ్యాయికకన
వలనుపడదేల ? యనవాక్ప్రపఞ్చకుంయఁ
గథలయందును నది ప్రసక్తమగుఁ గాన. 2

తే॥గీ॥ అపరవక్త్రమ్ము వక్త్ర మార్యాదులవలెఁ
గథలలోఁ జేరవనుచును గలదె నియతి ?
వఱలుచుండు లంభాదు లుచ్ఛ్వాసము లొక
భేదముగ దాన నయ్యెడి దేదిగలదు ? 3

తే॥గీ॥ కాన కథయన నాఖ్యాయిక యన నొక్క
జాతియగును సంజ్ఞాద్వయసహిత మగుచు
వీనిలోన మిగిలిన యాఖ్యానజాతు
లెల్ల నంతర్గతంబులై చెల్లుచుండు. 4

తే॥గీ॥ కన్యకాహరణంబు నాస్కందనమును
విప్రలంభోదయాదులు వెలయుచుండు
సర్గబంధంబునందును సమములగుచు
నివ్వి వైశేషికగుణంబు లెట్టులగును? 5

తే॥గీ॥ ఇతరములనేని గవిభావకృతము చిహ్న
మాకథలఁబోలె నుండు దూష్యంబుగాదు
ఇష్టసిద్ధికై మదిలోన నెత్తికోలు
గలుగువారలకెద్ది ముఖంబుగాదు? 6

## ప్రాచీనవాఙ్మయవిభాగము

(౧) పరిచ్ఛేదము (౨౩) పద్యముతర్వాతఁగలది.

తే॥గీ॥ మఱియునీవాఙ్మయము నాల్గుతెఱఁగులౌచు
జానుమీఱుచునుండును- సంస్కృతంబు
ప్రాకృతము నపభ్రంశమిశ్రములునాఁగ
నంచుఁ బల్కుచునుండెద రార్యజనులు. 7

తే॥గీ॥ అమరభాషను సంస్కృతంబనిరి ఋషులు
సంస్కృతభవంబు సంస్కృతసమము దేశి

యను ననేకభేదంబుల నమరియుండు
ధారుణీతలమునఁ బ్రాకృతక్రమంబు. 8

తే॥గీ॥ ఆర్యులా మహారాష్ట్రాశ్రయమగు బాస
నెంతురు ప్రకృష్టమైన ప్రాకృతమటంచు
నలలితోక్తిరత్నములకు సాగరంబు
సేతుబంధాధికము దానఁ జెలఁగుచుండు. 9

తే॥గీ॥ లాటి శౌరసేనియు గౌడి లాతి తాదృ
శోక్తిసంతతిపైత మీయుర్వియందు
వాగ్విశేషకోవిదులైనవారిచేతఁ
బ్రాకృతంబని వ్యవహరింపంగఁబడును. 10

తే॥గీ॥ కావ్యములను నాభీరముఖ్యజనభాష
లను నపభ్రంశనామంబులని వచింత్రు
సంస్కృతేతరమెల్లను శాస్త్రజాల
మున నపభ్రంశమను నామమునఁ దనరును. 11

తే॥గీ॥ సర్గబంధాదికంబగు సంస్కృతంబు
ప్రాకృతము స్కంధకాదులఁ బరఁగుచుండు
భువినపభ్రంశమాసారముఖ్యములగు
మిశ్రకమునాటకాదుల మెలఁగుచుండు. 12

## ఉపమోత్ప్రేక్షాభేదవిచారము.

(2) పరిచ్ఛేదము (212) పద్యముతర్వాతఁ గలది.

తే॥గీ॥ ఉపమయను భ్రాంతి గలుగుచునుండు విచట
గొందఱు కివత్రుతింజేసి డెందములను

మహిఁదిజ స్త్రముతో నుపమానముంటఁ
*దెలియమనెడి యాప్తోక్తి నతిక్రమించి. 13

తే॥గీ॥ మేదినిని నుపమానోపమేయభావ
సిద్ధి తుల్యధర్మము నపేక్షించియుండుఁ
దమమునకు లింపతికి నిట్టిధర్మమెద్ది
యిట్టిచోటులలోనఁ గన్పట్టుచుండు ? 14

తే॥ గీ॥ లేపనంబె యిష్టంబైన లింపతియను
మఱియొకండేమియుండు ? నున్మత్తుఁడైన
నదియె ధర్మము ధర్మియు నగునటంచు
సంగతిఁబొఱంగి మాటలాడంగఁబోఁడు. 15

తే॥ గీ॥ కర్తయుపమానమన్న నాకర్తయుంగ్రి
♦యాపదంబున న్యగ్భావమంది యుండి
స్వక్రియాసాధనవ్యగ్రభావయుక్తి
నుంట లాతినపేక్షింప నోపకుండు. 16

తే॥ గీ॥ ఏదిలింపతియో దానికెన తమమను
వానికైననంగములను దానికొదవు
నట్టి యయ్యసంబద్ధత యపరిహార్య
మానమానగుణమును మృగ్యమగుచుండు. 17

---

* ద॥ దసెడియాప్తభాషితముల నవలఁద్రోసి

♦ యాపదంబున న్యగ్భూతమై వఱలుచు
స్వక్రియాసాధనంబున వ్యగ్రమగుచు

తే॥గీ॥ చంద్రసమము వక్త్రంబను స్థలమునందుఁ
గాంతియను ధర్మమొకఁడు వ్యంగ్యమగుచుండు
నట్లు లేపంబుకంటె నన్యము ప్రతీయ
మానమగుచుండదయ్యె లింపతివి దీన. 18

తే॥గీ॥ అట్లగుటచే నుపశ్లేషణార్థమంగ
కర్మకంబునునై ధ్వాంతకర్తృకమగు
లింపతివిదీవి నొక్కఁడీలీల రసము
*చిప్పిలంగ నుత్ప్రేక్షించు టొప్పవలయు. 19

## సంస్కృతయతిభ్రంశదోషవిచారణ

(3) పరిచ్ఛేదములో [153, 154, 155] పద్యములు.

శ్లో॥ ప్రీణాంసంగీతవిధిమయ మాదిత్యవంశ్యో నరేంద్రః
పశ్యత్యక్లిష్టరసమిహశిష్టైరమేత్యాది దుష్టం
కార్యాకార్యాణ్యయమవికలాన్యాగమేనైవపశ్యన్
వశ్యాముర్వీం వహతి నృపఇత్యస్తిచైవంప్రయోగః 20

శ్లో॥ లుప్తే పదాన్తే శిష్టస్య పదత్వం నిశ్చితం యథా
తథా సంధివికారాంతం పదమేవేతివర్ణ్యతే. 21

---

* సరస। మైనరీతి నుత్ప్రేక్షించెననఁగవలయు.

తే॥గీ॥ పదము చివఱవర్ణములు లోపంబుగనినఁ
బదత మిగిలినదానికిఁ బరఁగుచుండు
నట్లు సంధివికారాంతమైనది పద
మగును సంస్కృతపద్యాలయతులపట్ల. 22

శ్లో॥ తథాపికటువర్ణానాం కవయోన ప్రయుఞ్జతే
ధ్వజినీ తస్యరాజః కేతూదస్తజలదెత్యదః 23

ఇ ది

కింకవీంద్రఘటాపంచాననేత్యాది బిరుదాంకిత
శతావధానాచార్య ప్రసన్నకవితావతార
తిరుపతి వేంకటేశ్వర కవీశ్వర గురు
కరుణాలబ్ధాశుకవితా శతావధాన
క్రీస్తుశకైకోనవింశశతాబ్దివర్తి
బాపట్లపురీప్రాంతవాసి
అవ్వారి సుబ్రహ్మ
ణ్యాంధ్రీకృత
కావ్యాదర్శము.

శ్రీ

# పాఠాంతరములు

పుట. పద్యము.

1 1 తే.గీ. శ్రీచతుర్ముఖ ముఖ సరసీరుహావనిఁ
దిరుగు హంసవధూటి పదీయమైన
యుల్లమునయందు రమియించు చుండుఁగాత
సర్వశుక్ల సరస్వతి సంతతంబు

1 2 సంగ్రహించి శబ్దములలోన—సంహరించి గ్రంథములలోన

2 6 చక్రిఁగఁ బ్రయుక్తమా గోవు సర్వకామ
దోగ్ధ్రియౌ గోవనుచుఁ బల్కుదురు విబుధులు
తప్పఁగఁ బ్రయుక్తమై ప్రయోక్తయగువాని
గోత్వమును బ్రకటించు నాగోవొకండె.

2 8 సంఘఁ=గే—ఁజీవునకుఁ బ్రవీణతయున్నే

3 12 దగు—బడు

4 14 దానికిదె లక్షణము వచింతు—దానికిది లక్షణము. వచింతు
ఆశిస్సా—దీవనో

5 16 లనతి విస్తృతములు—లనాతి విస్తృతములు

6 26 యందునఁ గానవచ్చు—యందున కానవచ్చు.

27 దారతలను నవియు—దారతాహ్వాయములు

28 లోలాళినీల—లోలాలిలీల

12 42 దానివధియింప—తానువధియింప
మంబరంబునఁగాంచి—యంబరంబునఁ గాంచి

| పుట. | పద్యము. | |
|---|---|---|
| 39 | 58 | పర్యాయ=పదసమూహ—శబ్దములఁ బ్రతినిధిశబ్దముం బ్రతిబింబ శబ్దము ప్రఖ్యపదము బ్రత్యనీక పదముఁ బ్రతిచ్ఛందపదముఁ బ్రతిద్వంద్విపదమును బ్రతిమానపదమును బ్రతిరూపబదింబను రూపపదమ్మును బ్రతియాతనా ప్రతికృతిపదములు ప్రతిమాపదా న్యాన వాచకశబ్దంబులుం బ్రతిచ్ఛాయాపదంబునింకనుపమాన ములఁజెప్ప నుచితజ్ఞులౌ కావ్యవిదులుప్రయోగించు పెఱపదములు సంస్కృత ప్రాకృతసమములఁ దద్భవములునట్టిదేశీయములును, దేశ్య |
| | 53 | గనంబటిచెను—బూనంగరిగెను |
| 41 | 61 | బ్రకటిత—బ్రకటన |
| 43 | 72 | అటుగావున—అటు కావున |
| 44 | 77 | సెట్టిపడి— సెట్టినయి |
| 47 | 85 | నుపచరించిన—నుపకరించిన |
| | 86 | సుతారముగను— మందగతిమునుచు |
| 47 | 88 | ప్రసరముచేత— ప్రచారమునను<br>ప్రసారణమున |
| 49 | 93 | సంచయమును—సంచయంబు |
| 51 | 105 | ఏఱుశుద్ధి=కలుషకుట్మలావశేషుబు వికచములయ్యె |
| 56 | 124 | మొనర్చుచునె— మొనర్చుచున్ |
| | 125 | లాభంబుతోడ—లాభంబుగల్గు<br>గలుగ । దైవఁ—లేదు । ఐన |
| 57 | 127 | బొమ్మ=దీశ—చనఁడలచిశేని జనుమునిల్చిననిలువుము<br>చనినచున్ సరియే నిలిచినను సరియె |
| | 129 | పోవు=నాథ—పోయెడితలంపుదృఢమైనఁ బొమ్మ నాథ! |
| | 131 | నీదు=య్యాది—నీపయన మిప్పుడియ్యది |
| 60 | 141 | వెడలనేవెడలెను— వెడలెనిఁక నీవో నా |
| | 145 | నర్పింపకునికి—నర్పింపఁగోనమి |

పుట. పద్యము.

61 145 నిందీవర — యిందీవరములు

148 లఁగనఁబడుచు — లుగనఁబడుటయు

సాక్షేపకేసి — సాక్షేపించె మొనసిరియొకఁడు

62 154 కలిగినట్టిఁబడెనిది — తగఁగఁ బ్రకాశించు చిత్రముక్ దర్పదర్శ

మైః విరాజిల్లుచుండు దృష్టాంతరమును గనుటచేతనివారించుకొని

నొకఁడిది

63 155 డైనఁగాని — డైననిలను

157 వస్తువుఁ మను చు —

శ్లో॥ ప్రస్తుతార్థంబు నొకదానిఁ బ్రస్తుతించి

దాని సాధించుటకు సమర్థమయినట్టి

యన్యవస్తువిషయంబు నుపన్యసించు

టది యొప్పంగు దృష్టాంతరన్యాసమనుచు.

64 158 మైనదన — మనఁగనుక్

వీనికిని — వాఁడ —

1 వీనికెల్లఁ గ్రమము వెలయునుదాహరణములమాలఁ

జూపువాఁడ రూపవ్యక్తి శోభిలంగ

2 వీనికెల్లఁ దగన దావ్యాప్తిమాలానిదర్శనంబు

సేయువాఁడ రూపవ్యక్తి సేయుకొఱకు.

159 రరయువయ్యాఁతిని — రదికనగొను.

కడకఁ గ్రియుండును దైవగతి నెవండు ?

65 162 ఒరులఁగాదె — ఒక్కులనను గ్రహించుచునుండు గాఁదె

66 164 యనఁదగిఁచుంట — యగుచునుండిదాహాశిలతమనుటు

67 168 నీనిటుఁ మొదలె — భేదమేర్పడెడి నిట్టితావలినమనోజ్ఞగాత్రం

బుచేసిన

69 180 ముందు — మొప్పు

పుట. పద్యము.

70 182 శ్వేతిమ=యొప్పు — తెల్లుమొదలగుసామ్యముల్ దెలియఁబడెడి
ప్రతీతమైన — ప్రసిద్ధమైన

183 భృంగ=లివి — భృంగ నేత్రాదులంసమముల్ భేదకములం
రెంటనగు. సదృశవ్యతిరేకములివి

184 నిరోధకంబయి — మునిరోధించుచుఁద
మైనతమము — మగుతమంబు.

71 185 చీకటిజాతికి — చీఁకటిజాతితో

71 186 తమ=మగును —

కం. తమమియ్యది దృష్టినిరో
ధము సేయుటఁ దుల్యముగను దదితరముల భి
న్నముగను జీఁకటిజాతికి,
నమరుపఁబడుటన్ సజాతివ్యతిరేకమగున్.

187 తేర్చ=లంబు — తేర్పఁబడకశుద్ధంబైన తేటనీరు

188 నీల=దృష్టి — దృష్టి కాటుకలేకయుఁ గృష్ణమగును

72 188 రంజి=మగును — రంగులేకయు నధరంబు రక్తమగును
రాగమంటకయును మోవి రక్తమగును.

189 కంజ=పుండు — కాముఁడును నిర్నిమిత్తంబుగారిపుండు.

72 190 కావు నిది=అట్టులగుట విభావన యగుచునుండు

73 193 పౌష్టిక=మగును. పౌష్టికపద్మ నేత్రాబద్ధ రతివిలాసుఁడైన
రక్తుండు నొకబాలనభిలషించె ననెడు నియ్యది యియ్యుదా
హరణమందు వ్యక్తముగను విభావింపఁబడుచుండు

195 పోషణ సలుపుచుండు — పోషింపఁగలిగియుండు

74 198 ప్రకృతి — సహజ
వార్ధి — జలధి

199 వెనుకఁగల — మునుగలుగు

75 201 పల్లు — పట్టు

పుట. పద్యము.

76 202 నెంచుచుంద్రు — నెంచవలయు

77 208 నేను — మదిని

209 నంబొనర్పు=నొనర్చి — నంబు సేయుచుండె నుత్ప్రేక్షించి చెప్పు సుకవి

212 తంబుగ — తంబయి

79 219 దానియపేక్ష — తత్త్వదపేక్ష

80 228 కమలన — కమములు

83 235 త్రోసి — తోసి

86 246 ఆ — అ

89 257 లిగ=లిగె — లిప్రమోదంబుగలిగె

90 260 బ్బబతే — బ్బబళీ

91 265 ఏ, రాళిమాల=ల్లు — రాళిచిత్తాస్థలి నధిశయించు

92 268 సఖి=వీవు — సఖి! యమానాభిమాన ప్రశస్తవీవు

269 భూష=ణంబు — భూషణములయి పొల్పారు

94 275 స్వేచ్ఛగాను — స్వేచ్ఛవెలయు

276 వంబులు=దోచు — వంబులకు విఘ్న మేర్పడకయుండ

277 దైవవశమునను — దైవగతిదాని

95 282 తమ్మిదంపద్య — తంబయిూపద్య
సువ్యంజితంబు — వ్యంగ్యమగుచుండె

283 ఒక్కదాని=యునఁబడు — దాచియొకదాని లాతియర్థమ్మును
గనఁబడఁగఁజేయుట ధరణియపహ్నుతియగు

96 283 లెక్క=వెయ్యి — అతనిబాణములొక వేయియగుచునుండు
2 వాని బాణములొక వేయిగానవచ్చు

98 287 నన్యుడే=నుకుండు — అర్థమునుబట్టిచూచిన నన్యుఁడయగు
తీక్ష్ణకరశ నిప్యందివీధితి యుతండు

[illegible] [illegible] సహ్నుతమున్ — పహ్నుతినిన్

పుట. పద్యము.

తివిభేద—తులభేద

290 లనుడు=నది—లనుడిత్తను ని కవులువలఁ చెద రది

291 ఉదయా=కాంతియంతుఁడై యుండి రక్తమయినట్టి మండలంబు విరాజిల్లుచుండ సెగడి యుదయమును నధిరోహించి యుర్వి జనుల మృదుకరంబులచేత హరించుచుండె

100 300 కనబడగ=నందు—అరయఁగన్పట్టవచ్చుఁ బహ్మాంతరమున

303 ఒకవిశేషంబు నూపంగ నుద్యమించి యచటఁగల గుణజాతి క్రియాదుల వికలతను గనిపింపఁజేయుటఁ గృతిరసవిదులొప్ప కొనుచుండెదరు విశేషోక్తియనుచు

101 304 చేతనుండెడి—చేతిలోనుండు నా

306 ముఖముమీఁద—మోమునందు

103 311 నన్వయిం—కన్వయిం

103 312 దిరములుగా=ద్యూన్—దిరములుగావు స్వయముగ ఘనరచి తములగుచు విలసిల్లినవియే యద్యూన్

103 313 ఒకవిశేషంబు నూపంగనూహసేసి యతివిరుద్ధంబులైన పదార్థములకు సుకవివరుఁడు సంసర్గంబుఁజూపుచుండు నెచట నది విరోధంబందు రెట్టులనిన

104 315 రాగంబుచేత—రాగసమృద్ధి

105 320 చింతలేక—చింతఁదొఱఁగి

106 324 చీలఁదీసి—కొంచకయెకొనివచ్చి భోగించుచుంటి

107 329 వసుధరాజవిరుద్ధులో వారికెల్ల సద్యమునసౌదురంతతఁ జాటు కొనుచు శీతకిరణాంశువులచే

107 330 ఒక గుణముచేని క్రియచేని యొక్క దానితోడనొకటి వర్ణించుట. వర్ణించుటది యనట్లు పలికిన

పుట. పద్యము.

108 332 మలయగిరినుండి చనుదెంచు మారుతంబు

109 335 నీదుబాహువుసుచిరసంపాదితమును గైరవానులమునునైన వారి
యశముపతిబలాత్కారముగఁ గొనియపహరించె

110 339 వానికయ్యాది దుష్కరంబౌను జగతి

340 సేవకలెను—సేవవోలె

111 343 కలననొకటియ—ప్రాపునొకఁడ

345 వానిగూడ=టందు వాని సేను గణనసేయుదు నొగినలంకార
ములను

114 4 కలసియుం=కలిగియున్నవి సంభేదకారణములు
వానిభేదంబులెన్నియో వాఙ్మయమున

115 6 మదములడఁగె=నుదనుడఁగెను

8 మహి=బహుళచతురంగబలముల
మహితోడన్ వీడ శతృమానవపతుల
బ్లహిరిపునగరికరిగి నా
రహితరహితమయ్యె భూమియవనీపాలా ?

118 13 గాథలేల—కథలికేల

119 20 బడెడి—బడును

21 సకల రవ=సకలసహాకారముకుళసంచయముచేత

22 కుటుకుం=కరుణతాడనముల కొంకుటుకుం జెవికలువను గొని
యూసు మెయిన్
రమణుగొట్టంగది
వురుగర్ణోత్పలమునొంచుఁబోలయలుక మెయిన్.

23 సంగతి=కాలినులయ్యెన్

120 24 గనుంగొనుదోర్కోర్క=నూలోర్క నదోర్కోర్క

122 31 రంబుజాతానల్=రబ్జబింబానల్

123 36 కొనుడ—కొనఁగ

పుట. పద్యము.

121 41 గాంత్రి—సెంత్రి

42 బుద్ధిసెఁగఁదట్ట—తమకుఁదఱఁగమి

125 48 స్మిత వితతిచేత=వితత చేతనా చేతనవితతిచేత నొప్పు సర్గంబు నీచేతనుండి చేతముసఁగెడు నిన్నువాచేత మూర్త్రిచేత ఆది వినుతు నీచేతిరు ననఘుచేత

45 మాన్య=గీ॥ శ్రీనిధీ! మానమాన సేమానమాన పానసీమానమాన సమాన మాన దాన విధిమాన మానరమానమాన మహితతామాన మానసా మానమాన.

గీ. మహితలనమానమానవమానమాన
వానయనమానమా! నవమానమాన
నన్నుబహుమానమానసున్ మానమాన
మనుపు మసమానమాన మానమాన!

126 46 రావసారవాణి—రవాసారసరణి
సార పాణి

47 యామ్యాతపనా—యామ్యాహరణా

127 49 భక్తితత్పరా—భక్తిభావనా
మాస్తగా=మర్థిసంభవద్దయా

50 మతాచ్యుతాంఘ్రిపావమతా సమానమానభీమతా
మతారి భూరిధామతా నమత్ప్రతాపధామతా
మతాబ్జశీతధామతాపమాంద్య వక్త్రధామతా
మతాతిపుణ్యభూమతా ప్రమాణశిష్టసంమతా

127 51 సారసాగర=కలాకలాకలాకలాఢ్య కాంతిహృత్కలాకలా। కలాకలాకలాకలాపకాసువాక్కలాకలా। కలాకలాకలాకలాపకాంతిదాకలాకలాకలాకలాకలాకలా వికస్వరాకలాకలాసన్నిధిలభించు

134 76 నళినదమననయన
జలజవదనవరద

పుట. పద్యము.

హాలకిరసుదయరప

బలమహిమజనిరవ

151 పాతాంతరములో—సన్నిధినిగాంచు—సన్నిధినిలభించు

151 148 యతిశయమ్ము=యతిశయంబు వివక్షితంబయ్యెనేని

156 152 కెడల—నేని

విలసిలఁగలన్ = విలసిలునదియొ

158 16 పాకాలె—పానుగదు

163 181 రూపము—రూపులు

164 185 వంపు—వంబు

187 వేఱు—వేఱ

166 193 మనికూడ—మనియునునిక

167 1 కానియా—కనఁగనా

167 3 దేదిగలదు—దేదితేదు

28 18 దాదృశింబగుచుండి యద్దానిజేయుచుండునట్టిదింకొకఁ డున్న నుండనీయ

29 20 గననగుచునుండె—దృష్టమగుచునుండె

35 44 ఉత్తమునకు=ఉత్తముఁడగు వానితో హీనుసముఁజేసిపల్కుట

28 17 అనుకరించు నీదు ముఖంబు వనరుహంబు

45 78 చంద్రుఁడు సమగ్రుఁడయ్యె నిర్జరులచేత

త్రావఁగాఁ బడు చుండును సంతతంబు

పూర్ణముండఱుఁడగు నీదుముఖశీతరుచి

త్రావఁబడుచుండు నాచేతఁబ్రతిదినంబు.

82 231 తే.గీ. ప్రాగభావాదులైన యభావములకు

భావరూపంబ భావరూపంబులైన

కార్యముఁ గలుగఁ జేయంగఁ గారణత్వ

మీయుదాహృతులన్ వచియింపఁబడియె.

# లఘు వివరణము

పుట. పద్యము.

1 1 బహిరంతస్థాన = జగముల వెలుపలను లోపలను నిలిచియుండు నది. సిత = కురులున్నగు వానియందుఁ దక్క సర్వాంగము లను దెల్లగానుండునది

బహిరంతస్థ్సానసిత = చితశరీరభాగములవైనను మానసమునను నిల్చియుండు తెలుపుగలది.

రజోగుణో రక్తవర్ణః శుక్లవర్ణస్తు సాత్త్వికః తమోగుణః కృష్ణ వర్ణః అని స్కాందశివతత్త్వసుధానిధి

1 8 వ్యాకరణాలు వ్రాసినబాసలు అవిలేనిబాసలు

2 6 వీరశ్చబ్రిసృష్టప్రయుక్తస్స్వర్గేలోకే కామదుగ్భవతి

3 10 వ్యవచ్ఛిన్నమై = విభూషితమై

12 ఛందోవిచితి—దండికృతమందును

5 14 ఫలము, నాయకమ్ము, జయ, యుతి, అను మూఁడును నాల్గవచరణమునఁగల వృత్తమునకు విశేషణములు

6 21 భూతార్థ = సత్యమైనవిషయమును

22 భూతభాష = కొన్ని దేశములలోని బాస.

8 28 శిథిలత = అన్నియుఁ గోమలవర్ణములగుట

9 30 శశక్షగుగమా = తెల్లని కిరణములు గల చంద్రునిబోలియుండు, నాత్యరుజాన మిక్కిలి తెల్లనిగాని, అంబుసంభవ = పల్లవులత లతో, సద్వృత్తము = సమము నాతిరూఢపయ్యాన్ = రూఢి లేనిపదములుగలదయ్యె. ఇందు—శలక్షగుగ నాశ్యోజ్జ్వల అంబు సంభవ పదములకుఁ బ్రోక్తార్థములలో రూఢిలేదు.

10 33 శశాక్షరాలుకాన

పుట. పద్యము.

34 కోమలములును కఠినములును వర్ణములు కలవు కాన

11 37 స్థానసాదృశ్యముగల వర్ణములు

12 40 ప్రాగను = ధ్వానముగల — వెనుకటి యక్షరముమీఁదిపోక పూర్వము మరలనట్టి యక్షరము వినవచ్చుట

41 కొల్లగొనుచు = చంద్రునకు విశేషణము

43 రామా — సమా అను పదములలోని మాలు దూరస్థములు కొన ప్రాసగ నుండును.

13 44 ఒకవియోగినికో దూతికో మాట. పూర్వార్ధమున పారుష్యముఁ ఉత్తరార్థమున శైథిల్యము.

14 50 యథనముఖ్య = దేశభాషలలో నౌచిత్యమును బట్టి యట్టి పదములు మాచుకోవలెను

51 పదసంధానవృత్తి = పదసంధాన = వాక్యమందు వృత్తిచే = ఉంటచే, చెప్పనీము, గుదమును, ముడి, ఇట్టి పదములు కలసి దుష్ప్రతీతిని గూడఁజేయును.

ఇది వాక్యగ్రామ్యత. శబ్దములను మార్పనోపదుగాన వాక్యగతము. గుదమును జెప్పెడి యింకొకమాటవేసి నను యశ్లీలము రాదు

15 52 ఇది వాక్యార్థగ్రామ్యత. శబ్దముల మార్పు సహించుగాన వాక్యార్థగతము.

ఖరముగ = అనుటకుఁ గఠినముగ అన్నను

వీర్య = అనుటకు బల అన్నను ఈ అశ్లీలముపోదు.

54 చాలకోమలవర్ణముల నడుమఁబరుషాక్షరములు వేయుటచేనంత ముగాఢమై హృద్యమగుట సౌకుమార్యము. అల్పప్రాణమహాప్రాణవర్ణములచే ఘటితమై బంధము శిథిలముగాకుంట శ్లేషము

55 కోమలవర్ణముల నడుమ క్ష ంఛ ంత ందు వృత్త్య అనుపరుషాక్షరాలుంటచే నిది నిష్ఠురాక్షరప్రాయముగాదు.

పుట. పద్యము.

16 57 దీప్తంబు = ఉత్సాహమును వర్ధిల్లఁజేసి చిత్తమును విస్తరింపఁజేయునది.

ధృతఘ్నుండు=ధృతరాష్ట్రుఁడు

అథవా

ధృక్ష్వంతి = నీచం గచ్ఛన్తీతి ధృక్ష్వాఃతాన్ స్యతీతి ధృక్షఘ్నః

ధృతఘ్నుఁడు—పరశురాముఁడు.

క్షణమునఁ = స్వల్పకాలమునఁ

58 అనేయము = అధ్యాహార్యము కానిది

17 60 శబ్దనియమము=శబ్దన్యాయము.

శబ్దములవృత్తులచే (అభిధానులచే) వినువారికి గోచరింపఁజేయఁబడఁదగిన పదార్థములే వ్యాఖ్యార్థములో భాసింపవలెనను కట్టుపాటు.

17 61 గుణము = దాక్షిణ్యము శౌర్యము మొదలయినది.

తత్సనాథము = దానితోనిండి, అనుటచే ఔదార్యగుణము వైదర్భగౌడీయమార్గముల రెంటను సమ్మతమనుట ఇదియర్థగత మైన యౌదార్యము.

63 సమన్యాయముగ = సదృశమైన నియమముగల్గునట్లు

67 తిగ్మభాను = సూర్యుని, భాను = కిరణములే

సంస్తరము = ఆచ్ఛాదనము

68 ప్రాచ్యులు = విదర్భదేశస్థులపద్ధతినొప్పువారు ఇతరులు = గౌడీయపద్ధతినొప్పువారు

19 69 వేని = ఎవని

20 78 లోకమర్యాద = లోకప్రసిద్ధి

21 79 నేత్రక్రియ = మూయుట తెఱచుటలతో, అధ్యానము = ప్రకృతములైన ముకుళించుట వికసించుట యను క్రియలను

పుట. పద్యము.

(వానిని జెప్పకుండ) అభేదముగాఁ జెప్పుట. తదభిప్రాయకములగు శబ్దములు నేత్రక్రియలను జెప్పుపదములు.

ఒదవెడిన్ — పుష్పక్రియలైన సంకోచవికాసములను జెప్ప యుక్తములగు.

వాడునపుతమున నిధి యర్థగతము. శబ్దగము వేఱు.

80 చెడ్డవానిని జెప్పుపదాలు కాదని సమాధిలో మంచివగుననుట.

22 81 స్తనితము = ఉఱుము. కుస్థనము (మూల్గు లేక ముక్కు)

23 83 అభియోగము = పట్టుదల

## ద్వితీయ పరిచ్ఛేదము

24 1 వికల్పింపబడెడి = వివిధరూపములతోఁ జెప్పఁబడెడి

2 బీజము = సాదృశ్యముపమ యనుటవంటి సామాన్యలక్షణ రూపమైన మూలము. వికల్పితములకు = భేదములకు, వివిధకల్పనలకు.

3 అలంక్రియలొక్కకొన్ని = శ్రుత్యనుప్రాసము, వృత్త్యనుప్రాసము, యమకప్రసంగము

25 5 బహ్వవస్థల = అనేకదశలయందుండెడి, వస్తు = జాతిగుణక్రియాద్రవ్యములయొక్క, రూపంబు = (వర్ణాత్మకమో, సంస్థానాత్మకమో అయిన) ఆకారమును సాక్షాత్తుగ = ప్రత్యక్షమైనట్లు

27 10 కాంతము = ఇష్టము

27 11 ఎవ్విధంబుననైనన్ = గుణముచేఁగాని క్రియచేఁగాని, ఉద్భూతమై = ప్రస్ఫుటమై (వాచ్యమై)

12 వాచకలుప్తయని యిప్పటిపేరు

13 ధర్మలుప్తయని యిప్పటిపేరు.

28 14 ప్రతీపమని యిప్పటిపేరు.

15 ఉపమేయోపమ యని యిప్పటిపేరు.

33 17 దానియనుకృతి = ముఖముయొక్క అనుకరణమును.

ప్రుట. పద్యము.

పాఠాంతరములో — అర్థానిజేయు = పద్మానుకరణము సలుపు

29 19 ఆశ్రయభేదముచే, భేదముస్పష్టమయ్యెడిఁగాన అభేదప్రతీతి లేదు. కనుక రూపకధ్వనిలేదు. వలెమొదలగు వాచకములు లేవు కావున సాదృశ్యము వ్యంగ్యము ధర్మవాచకలుప్తయనఁదగు.

30 22 భ్రాంతిమదలంకారము.

23 సంశయాలంకారము.

30 25 ఇచట శ్లేషవైచిత్రి అముఖ్యము. సామ్యవైచిత్రము ముఖ్యము. కాన యిది శ్లేషోపమ.

శబ్దములమార్పు సహించునది కాన యిది అర్థశ్లేషము. శిశిరకిరణప్రతిస్పర్ధి అనుదానికి, చంద్రశత్రువు అనినను ఈశ్లేషమునకు హానిలేదు.

25 అభంగశ్లేషోజ్జీవితోపమ. శ్లేషము

31 26 సభంగశ్లేషోజ్జీవితోపమ. సభంగశ్లేషము

31 26 శబ్దముల మార్పుసహింపదు కాన యిదిశబ్దశ్లేషము. సాలకానన అనుదానికి సజ్జవన అనిన నీశ్లేషములేదు.

ఇట శ్లేషములేనప్పుడు సామ్యములేదు కాన శ్లేషముసామ్యమును నిర్వహింపఁజేయుచున్నదికాని సామ్యముశ్లేషమును నిర్వహింపఁ జేయుటలేదు. కాన శ్లేషమంగము, ఉపమాలంకారము అంగి.

31 27 సోత్సేకము — అధికోత్కర్షముగలది

29 అభిఖ్యాసువు=చెప్పఁదలచుకొనినది దోషముగాని గుణముగాని చెప్పదలఁచుకొంటిననుట చమత్కారకారి యగుట నిది యొకభేదముగఁ జెప్పఁబడె.

అభిఖ్యాస=చెప్పఁదలఁచుట. దానికివిషయమైన యుపమ అభిఖ్యాసోపమ.

32 31 చటూపమ — ప్రియోక్తిరూపమైనయుపమ. ఉత్కృష్టకారణ

పుట. పద్యము.

యుండినను జంద్రుఁడుత్కృష్టుఁడుఁ గాఁడనుటచే విశేషోక్తి.
విశేషోక్తిమూలమైనదియే ఏటూపమయగు.

82 సంశయపూర్వకనిర్ణయము నిర్ణయోపమ భ్రాంతిపూర్వక నిర్ణ
యముతత్త్వాఖ్యానోపమ. ఇది నిశ్చయాలంకారమనియునందురు.

33 33 అనన్వయాలంకారము.

34 ఉత్ప్రేక్షయునగు

34 37 ఉత్ప్రేక్షయునగు

34 37 ఉత్కీర్ణము = త్రవ్వఁబడినది ఉద్ధృతము = పైకితీసికొని
రాబడినది.

38 వాసరము = పగలు, లక్ష్మి = లక్ష్మిని

35 43 అనుపమత్వము నీయుక్తియుండదు రెండవదిలేదు.
అని రెండువిధములైన మాటలచేఁజెప్పఁబడెగాన ప్రతివస్తూప
మయును ప్రతీకాలంకారమనియు నందురు

36 45 దీనిని దీపకమని కొందరందురు

37 49 కక్ష్య = సాదృశ్యమనుట.

39 58 తత్ = ఆయుపమానముయొక్క, పదవులన్ = త్రోవలలో,
పదమిడె = అడుగువేసెను. పోలెననుట. తత్ = ఉపమాన
మును, అనుబంధి = అనుసరించునది.
తచ్ఛీలంబు = ఉపమానస్వభావముగలది.

40 58 ఉచితమైనపదము=పద్మముండుటకుఁదగినతావు శిరస్సు అవ
యవములకును అవయవికిని ఆరోపములు గలవు. కాన సకల
రూపకము. దీనినిఁగొందఱు సావయవరూపకమందురు.

43 70 జలమును జెండాగుడ్డగాఁ జెప్పనిచో పాదము జెండాగాఁ జెప్పు
టకుఁగుదురదు. కాన విశేషణరూపకమువలన విశిష్టమైన జెండాను
హరిచరణమున నారోపించుటంజేసి యిది సవిశేషణరూప
కమనఁబడియుండు

పుట. పద్యము.

79 పెఱపని—చంద్రసహజముకాని ప్రాణహారణము.

45 77 ఎదిరించి గర్జించుననుటచే సాదృశ్యము గూడఁదెలియఁబడి గావునను పమారూపకము.

46 82 అపహ్నుతియని నవీనులు. ధర్మిని షేధమైన రూపకమనియు ధర్మనిషేధమైన నపహ్నుతియనియుఁ బ్రాచీనులయాశయము. కావుననే పంచబాణుఁడుగాఁడల్లపంచశరుఁడు అను నుదాహార ణమున నపహ్నుతిలోఁ బంచబాణత్వమను ధర్మము నిషిద్ధము. ఇక్కడ ముఖమనుధర్మి నిషిద్ధము

47 86 వాఁడె అనుపదముచేఁ బరామర్శింపఁబడిన పవనపదార్థము త్తరా ర్థమునఁగూడ నన్వయించు. ఈపదము లేకున్న బాగుండు.

49 94 మూఁడునిద్యావి అనుపదములచేఁ జెప్పఁబడెడి కల్ప, అస్త్రము, మతి, అను వానితో ఉంచఁబడియెనుక్రియ యన్వయించె. మూఁడునిద్యావియని లేకున్న బాగు.

50 97 ధరములు వారిదములు అని యన్వయము.

93 క్రియలతోఁడ = వర్ధిల్లఁజేయుట తగ్గించుట

100 విషధర=మేఘముల

పెక్కుగుపదంబుల=అపహరించు, మ్రింగివేయు, కొను, అను మాటల, ప్రయుక్తిన్ = ప్రయోగముచే, ఒక్కకి9యయె = కన్పట్టునీకుంటయనుపని

51 102 ధర్మ=నట్టి—ఒక్కధర్మముగల

51 103 సంస్కృతభాషలోనే దీపకాలంకారముసహజమనిసూచన.

52 108 ఆక్షేప్యభేదముల్ = నిషేధ్యములైన ధర్మధర్మికార్యకారణా దులు.

53 118 భావినాయికాంతరసంగము నిషేధ్యము.

59 187 పరవశాక్షేపము—నాయిక ప్రేమపరవశగను

పుట. పద్యము.

61 146 అనుక్రోశము=కరుణ. దశ=అవస్థ. అత, అపి, అను వాని ఆద్యకారము పోవచ్చు

63 155 హేత్వాక్షేపము—హేతువుంటు చేతనైన నిషేధము. తమధనమును సూహాయనెడి హేతువులవల్ల నృపమతి నిషేధింపఁబడెను.

హేతువును నిషేధించినఁ గారణాక్షేపము.

64 159 విశ్వవ్యాపి=సామాన్యము అంతటనుండునది. దైవగతి దుర్లంఘ్యమనుట. దీనినే సామాన్యముచే విశేషసమర్థనమందురు.

160 విశేషస్థము—విశేషము. ఇదియు సామాన్యముచే విశేషసమర్థనమే కాని మహనీయులకు మాత్రముసంబంధించినది సామాన్యము కాదు. విశేషము. అందురు.

65 163 ఇదియే కారణముచేఁ గార్యసమర్థనము

66 165 ఇది శ్లేషావిష్టము కూడనగును.

66 166 గృహ్యములు=అధీనములు, పక్షములు.

66 166 వెనుకటివానికన్న వ్యత్యస్తమని యందురు. సమర్థ్య సమర్థకములలో వైపరీత్యముగలదనియు ననవచ్చు.

68 174 కక్ష=సాదృశ్యము. సామ్యమును ఆక్షేపించుటచే సాక్షేపము.

75 207 వృత్తి—గుణక్రియాదులు వర్తిల్లుట

77 210 విలంఘించుట=తనకాంతులచే మీఱుట

78 214 కారకజ్ఞాపకములు=సాధింపఁదలఁచుకొనిన క్రియను సాధించునది కారకము వస్తుజ్ఞానమును సాధించునది జ్ఞాపకము.

హేతుప్రవచనము గల యలంకారముల్=భామహాదులు నిర్హేతుకముగాఁ జెప్పుటదోషముగాన హేతుహేతుమత్తులుగలవాక్యార్థములలో నలంకారము లేదందురు.

వైచిత్రిలేదు కాన సూక్ష్మమును అపహ్నుతిలోఁ జేరునుగాన లవమును, అలంకారము గాదందురు. కావున కారికమతము నిర

పుట. పద్యము.

పించుటకు హేతువైన యలంకారములనుట.
దండిమతమున నీ హేత్వలంకారములోఁ గావ్యలింగమును
అనుమానమును కార్యకారణ సమర్థనార్థాంతరన్యాసమును
అంతర్భూతములు.

79 216 ఉపబృంహణము=చమత్కారముగఁ జెప్పుట.
నివృత్తి—నిషేధము

79 217 అభావముకూడ దానితోఁగూడిన క్రియనుబోధించుఁగాన
సాధ్యమని చూపుటకీ యుదాహరణము.

79 219 దాని—కర్మయొక్క నిర్వర్త్యము, వికార్యము ప్రాప్యము
అని కర్మము త్రివిధము.
నిర్వర్త్యమనఁగా—పూర్వము లేక పుట్టునది కాని పూర్వముం
డియే క్రియచేఁ బ్రకాశించునది కాని.
ఉదా—కొడుకును గన్నది. నాపల్లు చున్నాఁడు.
వికార్యమనఁగా—ఉన్నదే, క్రియచేఁ బూర్వరూపము నశిం
పక యుండఁగనో నశింపఁగనో మఱొకరూపుఁ బొందునది.
ఉదా—కట్టెను గాల్చుచున్నాఁడు. బంగారుకుండలముఁ
జేయుచున్నాఁడు.
ప్రాప్యమనఁగా—కర్త క్రియచే వ్యాపించుటే కాని వికారము
మున్నగు గుణములచే మాఱనిది.
మొదటి రెంటియందును గర్మము నపేక్షించియే హేతువుండు.
మూఁడవదానియందు హేతువు క్రియ నపేక్షించియుండు.

80 220 ఉత్పాద్యమునకు—నిర్వర్త్యమునకు (సంతసమునకు) శేషించి
నట్టి రెంటికి—వికార్యమునకును, ప్రాప్యమునకును

221 ప్రకృతులైన వనవాపీచంద్రులువిషమగుట (విషీభావము)అను
వికారమును పొందినవని ప్రకృతివికృతిభావమును ఆరోపించు
టచేఁ జమత్కారముగల్గుఁగాన హేత్వలంకారము. పూరక

ప్రతి. పద్యము.

బంగారమును గుండలముఁ జేయుచున్నాఁడనుచో నీయలంకారము గల్గును.

222 మానయోగ్యత — మానాభ్యాసమును అభ్యాసః ఖురళీయోగ్యా. ఇట సఖి ప్రియకర్మము — దానిని జూచుట యను క్రియను బట్టి యుబలహేతువు. విశేషణములు కల్పనకు సంబంధించినవి కాన చమత్కారము.

80 223 అస్తమించిన సూర్యుఁడును ఉదయించు చంద్రుఁడును గూళ్ళకేగు పక్షులును జ్ఞాపకములు. జ్ఞాప్యముగు సంధ్యను జెప్పు పదము లేదు కాన పరిశేషానుమానః జ్ఞాప్యము.

వస్థ = అవస్థ

81 224 కామాతురత — జ్ఞాప్యము తాపములు జ్ఞాపకములు పూర్వార్ధములోని విశేషణములచే ఆతపజన్యత్వమును నిషేధించి విరహసాధారణతను జెప్పుటచే విచిత్రత.

226 చటువుదాఁక, ఒనర్పుదాఁక, నిగ్రహించుదాఁక యని యర్థము కాన ప్రాగభావము.

227 ప్రధ్వంసాభావము = నాశము

82 228 అన్యోన్యాభావము = భేదము

229 అత్యంతాభావము = లేమి

83 233 వ్యపాశ్రయ = అవలంబనము

234 లక్ష్యవేధనము కార్యము సమీపస్థము. అలక్ష్యవేధము దూరస్థకార్యము. కావున నస్త్రమను హేతువు దూరకార్యమయ్యె. ఇది యసంభవముగాన చిత్రము కాన దూరకార్యమను చిత్రహేత్వలంకారము

235 యౌవనహేతువు కార్యములగు పుష్పవిభ్రమములతోఁ గూడ నేర్పడినటుచేఁ గార్యసహజహేతువు. కార్యకారణము లొక్కప్పు డేర్పడుటచే చిత్రము. తర్వాతి విభ్రమములు పూర్వజము

పుట. పద్యము.

లనుట యధ్యవసాయముచేఁ గావున నిది యధ్యవసాయ మూలము.

84 236 తర్వాతనగుట పూర్వమగుటగా నధ్యవసాయము సేయఁబడె. కాన యధ్యవసాయమూలము.

85 240 ఇంగిత—అభిప్రాయము: ప్రకటించుచేష్ట.
ఆకార—శరీరవికృతి [చాయమాఱుట మొదలైనది.]

241 లీలాంబుజము కుశీకరణము—ఇంగితము

243 చాయయే ఆకారము.

88 244 ఉద్భిన్నతావిరహిత = స్ఫుటముగాఁ బైకిఁదోఁచుటలేని

86 245 నిగూఢము సేయుట—వ్యాజముతోఁ గప్పుట
దీనినే వ్యాజోక్తి యందురు. చెప్పఁబోయెడి యుపహ్నుతిలో లేశముగఁ బ్రకటమగు దానిని నెపముతోఁ గప్పిచెప్పుటలేదు.

246 కగుర్పాటు చల్లగాలిచేఁ గల్గెనని యనురాగమును దాచెను.

247 ఇక్కడ నానందభాష్పము పుప్పొడి కంటఁబడుటచేఁ గల్గెనను నెపమున రాగమును దాచె.

87 248 స్తోకముగ—వ్యాజముగా

88 255 రసపేశలము=రసము ప్రధానమైన రసధ్వనియగు రసమితరమున కంగమైన రసవదలంకారము. అని కువలయానందములోఁ గలదు.

ఇయ్యుదాహరణములందును శృంగారాదులకంగత్వము సాధించి రసపేశలపదమునకుఁ బూర్వోక్తార్థము చెప్పుకొనవచ్చును. లేక దండి రసమంగియైనను రసవదలంకారమని తలఁచెనేమో! ప్రేయోలంకారమునందును భావమైన ప్రీతి నిట్లే యోజింపవలెను. ఊర్జస్వి రసాభాసభావాభాసము లంగములగునప్పు డనియుఁ గలదు.

పుట. పద్యము.

89 255 సంయుతోత్కృష్టతన్=అలంకారమునకు గావలసిన యతిశయముగల వగుటచే, సముచిత=అలంకారమునకు గావలసిన, ఔత్కృష్టతన్=గొప్పఁదనముగల వగుటచే.

89 257 ఈరెండు పద్యాలలో వక్తకును శ్రోతకును ప్రీతివర్ధితము భగవన్మహిమ వర్ణ్యవనియుఁ ప్రీతియంగమనియూ నను కొనవచ్చు.

258 ఇందు వక్తకు మాత్రము గల్గిన ప్రీతి వర్ణితము.

90 260 చచ్చిపోయిన మదాలసను నాగప్రసాదమువలన మరల బ్రతికినదానిని బడసి కువలయాశ్వుఁడనిన మాటయిది.

అథవా దప్పింపబడెనను వాడుకచే వాసవదత్త చచ్చెనని నిశ్చయించుకొని మరలనామె లభింపఁగా వత్సరాజునకొనుమాటయై నఁగావచ్చును.

ఇది సంభోగశృంగారము=నవినావిప్రలంభేన సంభోగః పుష్టిమశ్నుతే అని పెద్దల నిర్ణయముగాన కరుణవిప్రలంభ పూర్వకముగా వర్ణింపఁబడినది.

261 అనురాగమే గురుదేవతాదులపైఁ బ్రసరించి భక్తియగును. స్త్రీవిషయకమై రతియగు, కాన 256, 258, పద్యములలోఁ జెప్పిన యనురాగమే యిచ్చట స్త్రీవిషయమై రతియగుచు విభావాది పోషణముంటచే శృంగారమయ్యె.

90 260 ఇందద్భుతమునకు శృంగారమంగము కావచ్చు.

262 దుర్వాసన దౌష్ట్యరూపవ్యంగ్య వస్తువునకు రౌద్రమంగము కావచ్చు.

91 264 రాజధర్మమును వివక్షితవస్తువునకు వీరమంగము కావచ్చు.

ఏ 265 నాయికావిషయక రతిభావమునకుఁ గరుణమంగము కావచ్చు.

267 రాజునందు శౌర్యమో రౌద్రవీరములో వర్ణ్యములు. భీభత్సమంగము అనవచ్చు.

ప్రుట. పద్యము.

92 268 మానవిధి వివక్షితము. హాస్యమంగము. అనవచ్చు

269 నందనసమృద్ధి వర్ణ్యము. భయానకమంగము. అనవచ్చు.

92 271 వాక్యపదము పదపదార్థవాక్యవాక్యార్థములను లక్షణచేఁ దెల్పును అట్లుకానిచో మాధుర్యగుణమునఁ జెప్పినవిషయము సరిపోదు. గ్రామ్యతలేక శబ్దాలంకారములు గలుగుటచేఁ జోడము రసమున మాధుర్యగుణమేర్పడుననియు విభావాదులచే సిద్ధించు రసము లెనిమిది గలుటచే రసపదలంకారమగుననియు భావము. అనగా—అగ్రామ్యతాదిజన్యమైన యందమే మాధుర్యగుణ మందలి రసమని భావము.

95 280 అశిక్లబలి మెఱసి = అవ్యాకులుఁడైయుండి

282 అపహ్నుతి = అపలాపము (కప్పిపెట్టుట)

96 287 స్వరూపాపహ్నుతి = అమృతస్యందికిరణత్వధర్మమును నిషేధించె. విషనిష్యందికిరణత్వ ధర్మమారోపింపఁబడెను కాని ధర్మి నిషేధింపఁబడి యన్యధర్మియారోపితము కాలేదు. కనుక తత్త్వాపహ్నవరూపకముకాదు.

93 272 ఇప్పటి వారి యూహ్యాస్వియిదికాదు.

94 277 భావశాంతియంగమై సమాహితమగు ననుటయుఁ గలదు.

96 284 శైత్యనిషేధమును వహ్నిమయత్వారోపమును స్వవిషయమునసే చేయఁబడెఁగాన విషయభేద ప్రయుక్తమైన యపహ్నుతి.

100 302 వృష = వృషభాసురుఁడు. పుణ్యము రాజు = చంద్రుఁడు. ప్రభువు. క్షయ=నాశనము. కళలుతరుగుట. విబుధుఁడు = దేవత. బుధులు లేనివాఁడు, భుజంగ = పాములు. విటులు.

ఇది విరోధాభాసమని కొందఱు.

308 కారణమున్నను గార్యము గల్గమి విశేషోక్తియని దీనికే లక్షణాంతరము.

పుట. పద్యము.

102 810 ఇది సిద్ధయని కొందఱు. దీపకమేయని పలువురు. వర్ణ్యములైన నవర్ణ్యములైన నొకధర్మముతో నొప్పుట తుల్యయోగితయని కొందఱు.

103 812 ఘనవిరచితములు=మేఘములచే నేర్పఱుపఁబడినవి. గొప్పవారిచేఁ జేయఁబడినవి అని రెండర్థములు. తటిద్విలసితములు చాంచల్యములో గొప్పవి కాన వానితోఁ బోల్చుట లక్షణము సమన్వితము.

104 819 కృష్ణ=కృష్ణుఁడు. నలుపు
అర్జున=అర్జునుఁడు. తెలుపు
కర్ణ=కర్ణుఁడు. చెవి.

104 819 శ్లేష్మమిక్కడ విరోధమునకు హేతువు. కాన రెంటికిని సంకరము లేదు. వేఱువేఱు కారణములచే లబ్ధసత్తాకములైనవి రెండుపకార్యోపకారకములుగ నుంట సంకరము.

106 827 దీనిని సంభవద్వస్తు సంబంధనిబంధన నిదర్శన యనికొందఱు. వాక్యార్థవృత్తి పదార్థవృత్తి యని రెండు నిదర్శనముల భేదములు గలవు.

109 837 'అనన్వయము' అనఁగా=ఉపమానత్వము నుపమేయత్వమును ఒకవస్తువునకేయుంట. ఇది యసాధారణోపమయని యీ గ్రంథమునఁ జెప్పఁబడె కొందఱు ససందేహాలంకారమనునది సందేహాలంకారము. అనఁగా—ఉపమేయమందుపమానవిషయకసంశయము. అని చంద్రాలోకమునఁ గలదు. ఇది సంశయోపమ యని యీగ్రంథమునఁ జెప్పఁబడె.

'ఉపమారూపకము' అనఁగా—ఉపమాజన్యరూపకమ్ అని వామనుఁడు 'జయతిచతుర్దశలోకవల్లికందః' అని యుదాహరించె. దీనిని గొందఱు పరంపరిత రూపకమందురు. ఇతరులుపమాసహితరూపకముపమారూపకమందురు. ఉదాహరణము— దివాకరకరస్పర్శమునఁ బ్రాచియొక్కయుదయగిరిపయోధరము

పుట. పద్యము.

నుండిసీలాంబరమువలెఁ జీఁకటి జాఱెడిని. ఈకావ్యాదర్శమున (77)ద్వితీయపరిచ్ఛేదపద్యములో నుపమారూపకమను పేరుతో దనేచెప్పఁబడెను. శ్లేషరూపకోపమాయుక్తముత్ప్రేక్షావయవ మని కొందఱు.

110 838 ఇందు మొదటిసంసృష్టి పరస్పరాపేక్షలేక యొక్కచోనుంట యనునది యిప్పటివారిచే సంసృష్టియనియే చెప్పఁబడు. పరస్పరోపకార్యోపకారకభావముతో నొకచోటనుండుట గాడి యంగాంగిభావ సంసృష్టి నిప్పటివారు సంకరమందురు.

110 841 వక్రోక్తులు—వచనభంగులు. ఉపమాదులు సర్వాలంకారములు వక్రోక్తులనంబడు. జాతి క్రియాగుణద్రవ్యముల స్వభావము వర్ణించుట స్వభావోక్తి.

111 84 ప్రబంధవిషయము = ప్రబంధమంతటను నుండునది
గుణము = చమత్కారమునొసంగుధర్మము.
సిద్ధియగుదాఁక=సమాప్తిపర్యంతము స్థిరముగనుండు కవి యభి ప్రాయము భావము.

843 వస్తువు=ప్రధాననాయకుని కథ. పర్వము=ప్రాసంగికమైన యితివృత్తము. రామాయణములో సుగ్రీవకథవంటిది.
స్థానముల=ప్రకృతమున కుపయోగించు విషయముల.

844 భాషితక్రమ=వచనపరిపాటియొక్క బలమున=సామర్థ్యముచే, గంభీరమైనవస్తువు = నిగూఢార్థము, వ్యక్తమగుట = విశద పడుట. ఇది యెల్ల సుకవులయభిప్రాయమున కధీనముగాన పూర్వోక్త విశేషజాలమెల్ల భావికాలంకారమనఁబడు. కవి భావమునకు విషయముగానను, కవిభావము శ్రోతలలోఁ బ్రతి ఫలించును గానను, భావమన భావన (మరల మనఁలఁజిత్తమున నుంచుట) అదిదీన్నఁగలుమ కానను, భూతభవిష్యద్విషయములు

వ్రుట. పద్యము.

ప్రత్యక్షములుగ నందుఁగావునను, భావికమను పేరు అని వారివారి మతములఁ బలువురు చెప్పుదురు.

111 8-15 సంధి=ముఖ, ప్రతిముఖ, గర్భ, విమర్శ, నిర్వహణములనెడి నాటకసంధుల అంగ=ఉపక్షేపము మొదలయిన (64) అంగములును వృత్తి=కైశికి సాత్వతి భారతి ఆరభటి అనువృత్తులయొక్క అంగ=నవఁ౯మున్నగు నవియు లక్షణ=భూషణము మొదలైనవి (36) అదిపదముచే వీథ్యంగ లాస్యాంగ నాట్యాలంకారాదులును, ఆగమాంతరమున = మఱొకగ్రంథమున వర్ణితములు = కావ్యశోభాకరములని చెప్పఁబడెను. అవి యెల్లవలంకారములని నేనొప్పుకొందునని భావము.

తృతీయ పరిచ్ఛేదము

115 5 మానమున్ = మానన్ = మును వరెన్ వెనుకటివలెను

6 మదన+మద—నవావతార=క్రొత్తగా నావిర్భవించుటకును, మానవినాశమునకును. అస్వపమునైరి = తావునైరి

7 చతుర! చతురబ్ధి = నాల్గుసముద్రములు

నాయ ,, అహితరహితము

116 మధురమైన, మధురసము = తేనెయుచి. అధరభావ = తక్కువయగుట.

10 వారణ = ఏనుగులను, వారణ = అడ్డగించుటకు. జనతా = జనపమూహముయొక్క, మారణము—ఆ రణమున లోకప్రసిద్ధయుద్ధమున.

11 రాజత్ పదము ప్రతాపానికిని,అజరాజత్ పదము అరిన్పృపులకును విశేషణములు. వసుధారా=అవిరతధనదానముచే, జను—పుట్టిన రాజనుతతృప్తిన్ = శ్రేష్ఠులునుతించెడి తృప్తిని.

12 కలికకున్=మొగ్గకు, అలికలాపము=తుమ్మెదసామ్యు. పరభృతశాబకోకిలల, కలవాకల = శ్రవణవ్యాప్తి శేషనోష్టములను

పుట. పద్యము.

117 13 వాత = మలయానిలముచే, హతత = కొట్టఁబడుట, హత = దుష్టుఁడైన, శశధర = చంద్రుని కరదారుణతాపముచు, అసహత = సహింపరామిచే, వియోగదశకు అనుప్రాప్త్ = శరుప్రి వృత్తైన అసు=ప్రాణములను. హృదయుఁడగు=మనస్సునకగిలిగినవన్ను.

117 14 మలయన్-మలయమారుతస్పృశిన్. చల్లగాలి త్రోవలో అలిన్-ఆ నళినము. (పద్మముకానిదేదియు కుమ్మెద సాక్షింపదనుట)

15 సాం=సత్త్వవనిచ్చు, ససారస=కమలసహితమైన జల=జలము గల కాసారగ=కొలఁకులలో నుండు, సారమైన=శ్రేష్టమైన, గళనాదముతో మరాళీవారను=హంసీసమూహమే, వారవిహితవతె.

16 విషమశయుఁడు=దుర్మనుఁడు విషము=గరళమే.

118 17 మానిని, నిరంతరమానమున్, మాని, తాన్, నవ=క్రొత్త, తానవ=కార్శ్యముగల, తను=తనువుగల, వలమాన=చలించు, సుమానను=మంచిడెందముగలవానిని నన్నుగైకొనుగాక

18 నీరజ=పద్మమువలె, నీరజము=నిర్మలము.
మనోహారిణి=మనోజ్ఞురాలా! హారిణి! హారాదిభూషణములుగలదానా! కనులవాయత, చాయతర-వారిజరుచిని గెలువదా?

118 19 పాటలా=పుష్పవిశేషమువలె, పాటల=శ్వేతరక్తమైన అంశుక=చీర. సౌర=సూర్యునివలనఁగలిగిన భా=కాంతికిని సౌరభ=పరిమళమునకును అస్పద=తావైన సారసమువంటి మొఁగముగలది. భావిత=కావింపఁబడిన ఆభా=గొప్పకాంతి [భూషణకాంతి] యను వితాన=మేల్కట్టుగలది సురమణి=చింతామణి

119 21 సకలరవ=మధురధ్వనితోఁగూడిన, పిక=కోయిలలుగల, అహ్లా

పుట. పద్యము.

దనరణి = సంతోషస్థానమైన మాసము ధరణిన్ శాశనమును ఒనర్చెన్.

22 కరము = మిక్కిలి, చెయ్యి

23 కలాపములవిలసనములతోఁ గూడినవై

120 24 మహోకలి = మహోకలహము కామసమృద్ధిచే. కలికా = మొగ్గ యొక్క

25 చంద్రకాంత = మణులు

చంద్రిక = వెమిలికన్నులచే అంతము = సుందరము

26 వరాహీంధరత్ = పండితమైన, వర = మంచి అహి = పాము (అది శేషుడు)

27 కరము = చెయ్యి, నికరము = సమూహము కర్కమును = మిక్కిలియు

112 28 పరాగతతి = దుమ్ము పరాగతము=పాటిపోయినది.

29 సదాన = మదసహితమైన వరదంతి = కువలయాపీడమను కంసుని యేనుగు

సదా. ననఘునాఘున = క్రొత్తమేఘమువలె దానవ వినాశన ప్రథితముతోఁ గూడియుండు, ప్రథితము = ప్రథ

30 కమల=లక్ష్మి కమలభవ=బ్రహ్మ, కమలనిభము=పద్మసమము అలకావళి, అళి గర్వాపారకము.

31 ముదా=సంతోషముచే రచితములును విభ్రమస్ఫురితములును ఐన భూషణకాంతులచే, తాము ఉదారులైవరమణుల అంతరంగములను. మదముచేతనైన భ్రమణము = విలాసగమనము గోము=సౌందర్యము అదభ్రము గొప్పది.

122 32 పికము - అరుతములు.

33 సురయు=మద్యమే మహిళల = స్త్రీలయొక్క

పుట. పద్యము.

మనసు+రయమహిమన్=గొప్ప తొందరతో. సుతనుమధ్యలు=మిక్కిలిసన్నని నడుములుగల. సుతనుమధ్య = సుందరులనడుము, గణ్యుండు=పరిగణింపఁదగ్గవాఁడు

123— 35 బాలమృణాళాంగి. బాల = జాలయై, = కలికాళిన్, చూడఁజాలదు. అల్లబాలను పాలనసేత నీపాలఁబడినది.
అలసాలసములైన ఆలోకనజాలములతోఁ గూడికొనినదై రసాలసాల=మామిడిచెట్టుయొక్క, బాల=స్త్రీ, బాలమృణాళ = లేతబిసములవంటి

36 కాలక=నల్లని, అలక=ముంగురులుకలది
తార=స్వచ్ఛములైన ముత్యాలగంటి, తారకలు=చుక్కలు. తారతా=గొప్పధ్వనియగుటచే, రమ్యమైన, రసిత=ఉరుముల విస్తారములగల వర్షకాలమందని, కాలపయోదముల్ = నల్ల మేఘములు.

123 37 యమయ=ప్రేయసియే. నిశ, అనంతమగును, అపాయమయమే అయ్యెను.
యమ=ప్రియురాలు, అమరపురికి=స్వర్గమునకు అరిగెను.
యమనము = మనస్సును నియమించుకొనుట, అశక్యమగుటచే యమపురిగతియు న్యాయమే

124 40 స్థిరమై, ఆయతాయత=మిక్కిలి విశాలమైన, ఆశయా = మతి గలవాఁడా.

పర=శత్రువులచే, అయుత = దండితులుగాని, ఆయత = బల విశాలమైన అరిరాడ్వరా శత్రురాజవర్యులుగలవాఁడా.
అయుతా ! ఇతరులచే దండితుడవు కానివాఁడా !
యత, యమముగలయోగులు ఆశ్రియా ! తావుగాఁగలవాఁడా
యత=నియతమైన, ఆయతా=శుభావహవిధిగలవాఁడవు అగుటచే అద్భుతా ! ఆశ్చర్యకరా !

పుట. పద్యము.

124 41 కామధేనువును వర్ణించుచున్నారు కాన దాని గుణమైన సురభిత్వము వారు వర్ణింపఁదలఁచుకొనని నీయందుఁ గన్పట్టుటచే నీపై వారికసూయ గల్గెనని యాశయము.

42 పాండిమదము = పాండుత్వమునొసఁగు. = బాధ = అగ్గలమయ్యె = అధికమయ్యెనుగోపన ప్రౌఢిమన్=ఆకారగుప్తినై పుణ్యముచే, తమకెవరెఱుంగరని మీబోంట్లు మదము బుద్ధికెక్కఁగదట్టఁగా కొంతురు. (అది తగదు) అని అధ్యాహారము. పక్షికిఁ బ్రమదముఁగూర్పుము రమ్మనిభావము.

పా, మదము=సంతోషము, తమకుఁ దఱిగియుండమిచే నాయికాంతరాసంగముచేఁ దమసంతోషమునకు భంగములేమిచేతనని భావము.

125 43 కృతీ=నేర్పరీ! కృత=చేయఁబడిన ఆనతి = నమస్కారము గల, ఇన=ప్రభువుల, తీవ్ర=అధికమైన, తుష్టి=సంతోషమును, దా=ఇచ్చువాఁడా

అనతి=వంగని, ఇన=ప్రభువుల, తీక్ష్ణతాభర=ప్రతాపాతిశయముయొక్క, అనతి=వంగుటయెవనివలననగునో అట్టివాఁడా! నతీకృత=నమ్రులుఁగాఁ జేయబడిన, అసుర = రాక్షసులుగలవాఁడా; అనతీ! ఇతరులకువంగనివాఁడా! నతీ = ఇతరులు నమస్కరించువాఁడా!

44 ఇది, అశివచేఁత=ప్రేయసిపని. అనఁగాఁ బ్రేయసీహాసభావాదుల చేతనే నాకు మరణావస్థ యాసన్నమనుట. పాఠాంతరము = అనఘు=నిర్మలులను, చేత=ప్రోగుచేయువాఁడా!

సర్గంబు=సృష్టి. నీ చేతనుండి, నీయధీనమై, కలుప్పు.

అవాచేత=మాటలతోఁ జెప్పశక్యముకాని, ముద్ = ఆనందమైనట్టియు, ప్రచేత ఆది=వరుణుఁడు మున్నగువారిచే వినుతు =

పుట. పద్యము.

నతింపఁబడిన, నీచేతరు=గొప్పవానిని, నిన్, చేతమున = మన మున, కనెద = ధ్యానించెద.

45 మాన్య=పూజ్యులైన. భజమాన = భజించువారి, మానస = మనమున, మాన=ఇముడుటగల, మాన=పరిమాణముగలవాఁడా అమానమాన=అప్రమేయా! మానమాన=శాస్త్రయోనీ! = శాస్త్రయోనిత్వాత్ అని బ్రహ్మసూత్రము. మహిత! పూజితా. బహుమానమానస=గౌరవము మొదలైన యైహికాముష్మికము లందు మనస్సుగలవారి (అనఁగా ధ్యానము వానిపైఁ గలవారి) మానసములకు, అమాన = ఇముడని, మాన = పరిమాణముగల వాఁడా! గతమాన = సాధువులయిన, మానవ = నరుల, అమానమాన = అఖండజ్ఞానమైనవాఁడా! అథవా అమానః అమితః మానః యస్యాత్సః చలమానమానసు=చలచిత్తుని నన్ను మనుపుము = రక్షించుము.

126 45 మసార=ఇంద్రనీలములవంటి, వేణి=జడగలది సారఘు = తేనెయుక్క, ఘనోజ్ఝధారాప్రసారమువంటి వాణి = మాటలుగలది. సారస=హంసలచే అనుకృత = అనుసరింపఁబడు ఆరవాసార=జడివానవంటి ఝుణత్కారముగల (అథవా— రావముగల సార=శ్రేష్ఠమైన పాణి=చెయ్యిగలది. సంసార ఘనకు తరణి=ఓడవలె, దాటించునది. సంసారములెస్సగా నీరుగలది=జలధి, సంసారమనెడి సంసారమని శ్లిష్టరూపకము.

126 47 నయానయాలోకధనా!=న్యాయాన్యాయజ్ఞానమను ధనము గలవాఁడా! అనయ=నీతిలేనివారికి అనయ=అనభావహావిధు లను అనయ!=తెచ్చువాఁడా!, అనయ=దుర్నీతిని అనాశన= నశింపఁజేసికొనని, యాన=జ్ఞానముగల, యాతుధాన=రాక్షసుల యాన=ప్రచారమను, యామ్యా=రాత్రికి, తపనా! సూర్యుఁడా! నయానయ=నీతిని మతికిసూర్యుకొను చుండువారికి, అనయ =

వృుటు. పద్యము.

అశుభవిధులను, అనయ=దూర్వృరుంటయును, అకల్ప=సామ్య్మ
గల (అథవా కల్పాంతస్థాయియగు) నయ=న్యాయమును,
అనయా! మనస్సునఁ జేర్చుకొనుచుండుట గలవాఁడా!

48 రవాఢ్య భేరిచే రాజగాంభీర్యము వ్యక్తమగుచుండువారయ్యును,
అరవాధికత్రస్యత్ = నోటిమెదల్పక మిక్కిలిభయపడుచున్న
ఆరాతి=శత్రువులుగలవాఁడా! అథవా, రవ=సింహనాదముచే
అధికత్రస్యత్=భీతులగు అరాతి=శత్రువులుగల వీరవార=
శూరసమూహములను వారణ=వారించు,ఔద్ధత్యముచే కరాళా!
ఘోరవారవ=నక్కలయుఱుఫులచే ఆకులమైన ఆయోధవరంగ=
యుద్ధభూమిపై భైరవా=భయానకరసము యెవనివలనఁ గల్గునో
అట్టివాఁడా (లేక) శివుఁడా!

49 పర=గొప్ప, అపరాధ = తప్పులుగల. అపర=అధికులుగాని
అపర=ఇతరులు గలవాఁడా. పర=అన్యులనియు అపర=స్వీయు
లనియు భేదములేని భావనయందు పరా=తత్పరుఁడా! పరా!
శ్రేష్ఠుఁడా!అథవా భేదభావనలేనివారి కన్యుఁడవు కానివాఁడా!
పరా! పరాత్పరుఁడా! పరాపరాద్వయ=పరాప్రకృతి అపరా
ప్రకృతి యను రెంటిని, అతిరిక్త! అతిక్రమించినవాఁడా! భక్తి
తత్పరులకు, అపరా! పరాయివాడవు కానివాఁడా! పరా! అవ
స్థాత్రయాతీతా! పరాత్పర=దేవా! దయాపరా! పరా! తత్త్వా
తీతా! గుణాతీతా!

127 50 శిష్టసంమతమైఅచ్యుతమైనఅభిరామతతోడను అనమత్=వంగని
మహారి=గొప్పశత్రువులయెడ. భీమతా=భయంకరతతోడను
అమత=ఇష్టముగాని, అఘబృందభూమతా=పాపజాలబాహు
ళ్యముగలవాడగుటచేతను అమతః-అఘబృందభూమాయస్యస,
అమతాఘబృందభూమాతస్యభావః.అసమమైనప్రతాపమునకుఁ
దావగుటచేతను, మత=ఇష్టమైన ఆశ్రితుల యాప్తకామతచేత

పుట. పద్యము.

ను, నమత్ నమస్కరించువారిని గూర్చిన, దయార్ద్ర=దయా శీయములయొక్క సీమతా = పరమావధియగుటచేతను, సతి = సాధువులచే మననము చేయఁబడిన, ఆర్యగీత=పెద్దలురచించిన, నామతా = నామములుగలవాఁడవగుటచేతను, సమాశ్రితా! ఆశ్రయింపఁబడినవాఁడా, ఓసుధీమతా!

51 సార = జలమే సార = ధనముగాఁగల, సముద్రమువలె గంభీరుఁడా! అరినృపుల, సాహస = స్వసాహసమున అరస=అరుచిని అరచన=చేయువాఁడా! దోస్సార = బాహుబలముచే సార= శ్రేష్ఠుఁడవగువాఁడా! సారస = పద్మములకు, అరతికర= అప్రియుఁడైన చంద్రునివంటి ఆస్య = మొగముయొక్క ప్రభా=కాంతి భూషణ=సొమ్ముగాఁగలవాఁడా! సారసారమణ=సూర్యుని, ప్రిసార=ప్రసరించు, సార=సారమవగువాఁడా! సారం! = బలముగలవాఁడా! సారఘు = తేనెతో, తుల్యమైన, ధీర=పండితుల, సుభాషిత = సూక్తుల ఆసార= జడివానలోని సారస్యసంసార = సరసత్వప్రచారమునందలి, సార=చేవ యెవనివలనఁగల్గునో. అట్టివాఁడా! సార=శ్రేష్ఠమైన సారస్వతసంచారమును, పూర=ప్రవాహమున, విసార=చేపలైన సారజ్ఞ = వేత్తల 'అనుసార = అనుసరణముగల' సార=తత్త్వముగలవాఁడా! (లేక) సార! వేగముగల గమనముగలవాఁడా!

128 53 హృదభీష్టకామ = చిత్తకోరికలను సాధ = సిద్ధింపఁజేయునివాఁడా! కామసాశాదిసుర = శివుఁడుమున్నగువేల్పుల, నికర = సమూహముచే కృత = చేయఁబడిన అర్చ = పూజగలవాఁడా! కర = చేతిచే, కృత=చేయఁబడిన అర్చనగల భక్తుల సుఖమును

---

"=" ఈ గుర్తు పదమునకెడమవైపుననుండి యింకఁ గొంత ఆపదములో — నదిగ్యక్తమని తెలుపును.

పుట. పద్యము.

ప్రకాశింపఁజేయువాఁడా! ఖప్రకాశమార్తాండ = నట్టమ
ధ్యాహ్నపు సూర్యునితో.

55 ధీర = ధీరుఁడును అదరపూరిత = భయము నెఱుఁగనివాఁడు
నగు భావజాత = మన్మథుని దమ=పరదమునకమూలలని ముదిత=
సంతసమును హరా! నశింపఁజేసినవాఁడా!
ధీర = జ్ఞానుల ఆదరపూరిత = భక్తిగల గల భావ = మనమున
జాత = గల్గిన దమ = ఇంద్రియనిగ్రహముచే ముదిత=సంతో
షించువాఁడా! హరా! శివా!

129 56 తార=అత్యుచ్చమైన వి=గరుడుని రావ=ధ్వనిచే (శేకపింఛా
నాదముచే) విజితులయిన సుకాయులుకలవాఁడా! శ్రీ = శోభ
గల తార=వజ్రముయొక్క విరావ=చప్పుడుచే విజితులయిన
సురలును అరులునుగలవాసవ, దేవేంద్రుఁడు ఆది = మున్నగు
వారి వాచా = వాక్కులచే స్పృష్ట = స్పృశింపబడిన (అనగా
నుతింపబడిన). విజితమేహామ స్త్రీతివిజితాఅని సురపక్షము వాది=
వాదించువారి వాచా=మాటలచే అస్పృష్ట=స్పృశింప బడని
(అనఁగా వాక్కులకందని) వాఁడా!

57 వి=పక్షులకు నాయక = నేతయగు గరుడునిచే, ఊహ్యమాన
=మోయఁబడు పాలితులైన, అమృతా=వేల్పుగలవాఁడా!
వినాయక=ఇంద్రియవిషయన మొనర్చినజ్ఞానులచేఊహ్యమాన=
ఊహింపఁబడు పాద=త్రిపాద్విభూతిపీఠముచే పాలితమైన
అమృతము మోక్షము గలవాఁడా!
వినాయక=గణపతిచే, ఊహ్యమాన=పాదపీఠుఁడైనశివునియొక్క
పాలనము గలవాఁడా? అమృతా! అనినాశా! పాలితమని
భావార్థక క్తప్రత్యయము, అథవా, శివునిచేఁ బాలింపజేయఁబడిన
దేవతలో మోక్షమోకలవాఁడా! అథవా, పాలిత=ధ్వజముచే

ఘుటు. పద్యము.

సేకొనఁబడిన అమృత = మృత్యుంజయుత యౌవనిచేతనో అట్టి వాఁడా!

ఘనాఘన = మేఘముల యొక్క, ప్రభా = కాంతికి, అవలోప = లుప్తిని. కారి = చేయు, కాంతిగల, విగ్రహ = దేహము గలవాఁడా! ఘన = పెద్దలకు, అఘన = నీచులకు, ప్రభావలోప = వయసగా గొప్పను లుప్తిని కారి = సేయు, కాంతి = ఇచ్చునట్టి, విగ్రహ = విరోధమును గలవాఁడా! ఘనా! ఘనప్రభావులకు, లోపకారికాంతి—లోప మొనరించు వారికాంతితో, విగ్రహ = విరోధము కలవాఁడా!

180 59 శ్రితమనస్కుఁడైనహారుఁడు గలవాఁడా! ] శ్రితులకు మనోహర మైన రూపున, విధృత = ధరింపఁబడిన, కలాప = నెమిలిపించెము గలవాఁడా! అనోహర! శకటాసురభంజనా! రూప = రూపమే శ్రితము = నిన్నాశ్రయించినది. శ్రిత = సర్వాశ్రితా! మనో = మానసమైన, హర = లాప—చంద్రుడు గలవాఁడా! విధృత భూషణుఁడా!

60 సుధర్మ = మంచిధనస్సున అధిరూఢ = ఎక్కుపెట్టబడిన అతి శుధ్యత్ = తెల్లని, గుణ—ఆదిశేషరూపమైన నారిచే సుధర్మ = దేవసభయందు [మంచిధర్మముచే] అధిరూఢ = ప్రసిద్ధములైన అతిశుధ్యత్ = నిర్మలము లయిన, గుణ = దయాసత్యాది గుణములు కల, ఆఢ్యా = ఈశా!

180 61 విజిత = జయింపఁబడిన విషమ = దుష్టుఁడైన అంబకాభిఖ్య = బాణుఁడు గలవాఁడా!

విజిత = జయింపఁబడిన, విషమాంబక = మన్మథుఁడు గల [కామ వికృతిగల) అభిఖ్య = నామావళిగలవాఁడా!
మన్మథశోభనుమించిన శోభ గలవాఁడా!
విమలం సౌఖ్యం యస్మాత్సః విమలః

పుట. పద్యము.

విమలులయందలి యానందమైనవాఁడా! నిత్యానందముగల వాఁడా! విజితములైన విషముల నేత్రములుఁగల కాంతిగలవాఁడా! దేవుని కాంతులుచూడఁగనే దుష్టులకనులు మూతపడి బాణములు ప్రసరించవని భావము. లేక బాణనామ శ్రవణముచే దుష్టులు జితులైరనియు.

62 ఓరాజా! దిశల్=దిక్కులను [స్త్రీలనని స్త్రీలింగసారస్యముచే ధ్వని] రాగముతో ఖ్యాతి స్పృశించెడిని అనుచిత్రవార్త విల సిల్ల నీఖ్యాతి యుద్ధభూధూళి లేచినప్పుడు దిక్కులవ్యాపించెడి. ఖ్యాతి పదముచే స్త్రీలింగసారస్యమున స్త్రీప్రతీతియగునుగాన స్త్రీకి స్త్రీలను స్పృశింప రాగము గల్గెనని చిత్రము.

181 63 శేషభుజగ=ఆదిశేషుని శక్తి=సమర్థత గర్వపూర్తిచే నెగడును. భవదీయభుజగ=భుజముల గల, శక్తి=బలము గర్వపూర్తి నెగడు.

64 చంద్రఖండ=అర్ధచంద్రరూపమైన ఉత్తమాంగభూషణ= శిరోభూషణముయొక్క సితరుచి= తెల్లకాంతిగలవాఁడు. చంద్రఖండ=కర్పూరమువలె ఉత్తమమై అంగభూషణమై సితమైన రుచి—శరీరకాంతిగలవాఁడు. [అంగముయొక్కయు భూషణసర్పములయు]

65 బంధువులనెడి రాజీవములకు రవిభానుభావ=రవికిరణమువగుటచే రమ్యుఁడవగువాఁడా! బంధురమైన=అభీష్టముల వరవితరణ=గరుడుఁడు గర్మిచే రమ్యుఁడా బంధురమైన అభీవరవిత్రా రవికాంతినిజీవింపజేయు అనుభావ=మహాత్మ్యముగలవాఁడా!

66 జన్యవసుమతీ=యుద్ధభూమియందు శరభ=శరభమృగమైన వాఁడా! రజస్స్వభావ=రజోగుణముచే జన్య=కలిగిన వసుమతి=ధనమును గూర్చినధ్యానముగల ఈశ=ప్రభువులయొక్క,

పుటు. పద్యము.

ర—రక్తముయొక్క, భర = అతిశయమునందు జ—పుట్టినట్టి=జ్ఞాతులైన పితృదేవతలనుగూర్చిన భావా = భక్తిభావము గలవాఁడా! అథవా స్వభావా=పితృవిభూతి [పితృతర్పణము] గలవాఁడా! [రాజులనెత్తుటఁబరశురాముడు పితృతర్పణముఁ జేసెననుట.]

భవత్=ఉద్భవించుచుండెడి ఉదార=గొప్ప మనీష=బుద్ధిగల వాఁడా! భూపా! భూప్రజలను రక్షించువాఁడా! అథవా శ్రీరామావతారమున క్షత్రియుఁడా! ప్రభావ = శక్తివలన, జని—పుట్టుకగల. అవసు గతి=ధనాదులపై విరక్తిగలవాఁడా! (జ్ఞానులను భగవత్స్వభావముచేతనే వైరాగ్యము గల్గుననుట. శంభరజ=కుమారస్వామియందు స్వభావ = శత్రుభావము గల వాఁడా! ఈశ—క్షత్రియుల, రభర—భయాతిశయమున జ—పుట్టిన, స్వభావ—స్వచేష్టయగు యుద్ధముగలవాఁడా! అని పరశురామస్తుతి అనచిపేతిద్విత్వము.

67 అనవహితభావ—చంచలచిత్తులగు దుష్టులను, నాశన—నశింపఁ జేయువాఁడా! వినయకరణ! వినీతికి సాధనమైనవాఁడా! నవమును హితమునుగాని భావమును నశింపచేయుటచే, వినయ కరణ—భక్తులకు శిక్షనొసఁగువాఁడా!

అనవ!—పురాణపురుషా! హితమైన భావనగలవారికి, అశన—భోగసామగ్రిని, వినయ—నీతిని, కరణ—జేయుట కలవాఁడా

68 హరి—సూర్యుని, కర—కిరణముల, ఆస్పర్శన—కొంచెము స్పర్శమే. హత—నశింపఁజేయబడిన, తమో—చీఁకటియను వనంబు—అడవికలది.

హరి, విష్ణుమూర్తిని, కర—చేతులతో, ఆస్పర్శను=స్పృశించుటచే హతమైన, తమో—తమోగుణముయొక్క, అవనము—పోషణము గలది.

పుట. పద్యము.

హరి-విష్ణువుయొక్క, కరమందు, అ-బలియాగమున. స్పర్శన -ఈవియే, హత—చంపఁబడిన, తమోవనంబు—రాక్షసులు గలదియ్యెనది.

హరి-కోతులయొక్క, కర-హస్తములయొక్క, అస్పర్శన — కొంచెముతాకుటే, హత—చంపఁబడిన, తమోవనంబు— తామసులైనరాక్షసులు గలది. హరి, చంద్రుని, కర-కిరణముల అస్పర్శన-స్పర్శమే, హతమైన, తమః, చీకటి యను, వనము—నీడ్గుగలది. తమః—రాహువుయొక్క అవనము— రక్షణము గలది.

70 ఉద్ధృత—ఉత్పాతసంహరింపఁబడిన, సు అమిత్ర—గొప్ప శత్రువులు గలవాఁడా!

ఉపచిత—చితలమీఁదఁజేర్పఁబడిన, అసుర—రాక్షసులు గల వాఁడా! జైత్రి—జిష్ణూ!

పర—ఉత్కృష్టుఁడైన, వి నాయక—గరుఁడునిచే ఊఢ— మోయఁబడు పాదములుగలవాఁడా!

వృష—పుణ్యముచే వరేణ్య—శ్రేష్ఠులైనవారియొక్క, వాహ —యోగక్షేమములు వహించువాఁడా!—యోగక్షేమా వహా మ్యహం. విషధర = మేఘమువలె, అసిత నల్లని అద్రిజా— గౌరియొక్క మనః ప్రియకరమైన, అభిఖ్య—శారకనాదము గలవాఁడా!

71 ఉద్ధృత-ఉద్ధరింపఁబడిన,అధోగతికిఁబోకుండఁ గాపాడఁబడిన స్వమిత్ర-సొంతమిత్రులుగలవాఁడా! ఉపచిత-వర్ధిల్లఁజేయఁ బడిన అసురజైత్ర—దేవతలుగలవాఁడా విషధర—సర్పముల, అసిత-ఉనికిగల, దేహముగలాఁడ!—అభిఖ్య-కాంతిగలవాఁడా!

78 సు అసార—మిక్కిలిదీనులయిన, మ—జనుల. అసు—ప్రాణ ములు, అసార—తుచ్ఛమైన, మా—మేధయునవెడి స్వ—

పుట. పద్యము.

ధనమున్, సార—శీఘ్రముగా, మా—వృద్ధినందించువాఁడా! స్వ—స్వీయులైన సార—శ్రేష్ఠులుగలవాఁడా! మా—లక్ష్మికి, స్వ=స్వీయుఁడా! సార—త్వరగలవాఁడా! మాస్వ—లక్ష్మికి, ధనమైన సార—శ్రేష్ఠుఁడా! మా—మేధను, స్వసార—ఆత్మయైన జలముగల సముద్రుఁడా! స్వసారఱసముద్రముయొక్క, మా=మధ్యమున, స్వ=ఆత్మగలవాఁడే! సారమా=బలమైవాఁడా! మా-మా-అ-అ=మా—లక్ష్మికి అ—అంతఃపురమైన నీ వాఁడా! బలంబలవత్తాస్మి అనిభగవద్గీత.

స్వ—స్వీయమైన, సార—చక్రము గలవాఁడా మా—బంధమునకు, స్వ—జ్ఞాతియైన [వైరియనుట] సార=స్థిరాంశము గలవాఁడా? మా—వృత్తికి, అస్వ—స్వీయుఁడవు కానివాఁడా! సార—సౌభాగ్యరాలైన, మా—లక్ష్మికి, స్వ—స్వీయుఁడా! సార—ఉదకముయొక్క, మా—నడుమను, స్వ—ఆత్మగల గలవాఁడా! సా—దేహకాంతికి. ర=శాలయైనవాఁడా! మా—తల్లియైన యశోదయొక్క స్వసార—తనబలముకుఁదగిన మ—బంధమునకు ఆ—స్థానమైన, స్వ-స్వీయమైన, సార—బలమైన మా—నడుముగలవాఁడా!

స్వ—తాను, తనది, ధనము జ్ఞాతి. సార—జలము, ధనము న్యాయము, బలము, చేవ, శ్రేష్ఠము.

| | |
|---|---|
| స్వసారమా స్వపా | సు—మిక్కిలి, అసార—తుచ్ఛమైన మా=లక్ష్మిగలవారి, అసు—ప్రాణాలను అ సా, పోఁగొట్టువాఁడా! |
| రమాస్వసార | రమా—లక్ష్మిదేవికి, స్వ—ధనమైన, సారమా—సారాతిశయముగలవాఁడా! |
| మాస్వపా రమా | మాలక్ష్మిని సు-అస—స్వప—చక్కఁగా నిరసించినవారిలో అరమా—క్రీడించివాఁడా! |

వృత. పద్యము.

స్వసారమా | స్వ, తనదైన, సార, జలముయొక్క, మా—అతిశయమును, స్వ—ధనముయొక్క, సార—న్యాయమైన, మా—అతిశయముకొఱకు.

స్వసార—మేఘముయొక్క, మా—కాంతివంటి కాంతిగలవాఁడా!

74 ధరాధర—గిరిశలె, ధీరతాధరా! ధరా—భూమికి, వరా—భర్తయైనవాఁడా! వరా—శ్రేష్ఠుఁడా! మహీయః—గొప్పవారి ఆదర—భక్తికి, ఆస్పదుఁడా! నత—నమస్కరించువారి ఆజ్ఞ శేఖరా! చంద్రమౌళీ! అతిమూఢుల భావములలో, లీన—దాఁగికొనిన కల్మషములను హరించువాఁడా!

76 మనసు! ఓ చిత్తమా! కలక—స్వప్నమునకే [స్వప్నసదృశప్రపంచ దృష్టికే,] కనక—జ్ఞానశక్తులను వినియోగింపక మహిమ—గొప్పఁదనము తగన్—తగునట్లు మనుమ—మనుము కనకకల—బంగారుశోభ, కమనము—కమనీయమా! గతమహిమము-అనుము—గొప్పదిగాదనుకొనుము. కలికను-మొగ్గను, అలి-తుమ్మెదయొక్క, కలనల—వాలియుండుటలచేతనైన, ములుకు-శృంగారపురుదిలిక కలిమె-సంపదయగునా? [నైసర్గికముగాక ఆగంతుకమైన విలాసము కలిమి కాదనుట.]

అలకలిక—ఆ మొగ్గయొక్క కలిక-స్వల్పకళ, మెలికములుకుల కలను-ఎక్కడనుండియోవచ్చి పెనవేసికొనిన [నైసర్గికము కాదనుట] విలాసములకు స్థానము. [అది నిల్చెడి విలాసము కాదనుట.]

అథవా, ములుకుల కలను—భీతిస్థానమైన, ఆ కలికకలిక—ఆ మొగ్గయొక్క యనిత్యమైనశోభ, మెలికను—లేనిపోని రుచితోఁ జూపఁబడు మెలివడుటకు.

ములుకులకలను—భీతిస్థానమైన అలకలిక—ఆలకలిక, మెలికను—

పుట. పద్యము.

చూపఱను బంధించుటకు, అకళిక—కళ్లేములేనిది [అడ్డు లేదనుట].

77 జలజనమన—చంద్రునకు, దర—భయమెవనివలనఁగలుగునో, అట్టివానిని, దమన—శిక్షించిన వాఁడా! వినుతి—నుతింపఁబడువాఁడా! వినుతి—స్తోత్రి పాత్రమైన [విశిష్టా నుతిర్యస్యతత్] మిసిమిన్—నూత్న కాంతిచే లలిన్—ఉత్సాహముచే హాసనగ—నవ్వును బొందియుండు, రుచిన్—కాంతిచే, సహచరులు—తనతోఁగూడితిరుగుపిల్లలు, గమిన్—తెఱచుగా [సమూహమై] ఇలన్—నేలమీఁద, మిగత—తానుతినఁగా మిగిలిక్రిందపడిన వెన్నను, కనన్—వెదకికొనుచుండ. మిసిమి—వెన్నను, తిను—ఉట్టికెక్కి తినుచుండు, వినమత్—నమస్కరించు భక్తులకు, అరద—తొందఱనిచ్చు దుష్టులను, నమన—వంచువాఁడా! జలజనయన! పుండరీకాక్షా! నళిన=పద్మముబొడ్డునఁ గలవాఁడా అథవా, వినమత్—సూర్యనమస్కారములు చేయువారికి అరద—తొందఱగ్గించు దుష్టులను, నమన—వంచు సూర్యుడును, జలజ—చంద్రుడును, నయననళిన—నేత్రకమలములుగాఁ గలవాఁడా!

78 కనక—బంగారమును, నమన—వంచెడు [అనగా బంగారుఁబోలు] తను—శరీరముగల, సుతను—స్త్రీలచే, వినుత—నుతింపఁబడినవాఁడా [రసికుఁడా అనితాత్పర్యము] జవన!—వేగముగలవాఁడా! నళిన—పద్మములకు, దరద—భీతిగలిగించునట్టిదియు, సరస—ప్రియమైనదియునైన [అనఁగా సూర్యచంద్రాత్మకములైన] నయన! కనులుగలవాఁడా? మద—మదముగలవారిని [అర్శఆదిభ్యోచ్] నమన—వంచువాఁడా! [లేక] మదమునువంచువాఁడా! వరదయ! మంచిదయగలవాఁడా! భయ—భయములందు, చర—తిరుగుచుండువానికి [అనఁగా

శ్రుతు. పద్యము.

భీరువు యొక్క] పద—త్రాణము గల, రక్షకురాలగు, మ—లక్ష్మి గలవాడా! వరద—భయంకరమయిన, సమయ—సిద్ధాంతాచారక పథములలో నేదేని గలవాడా! భీషా౽స్మాత్—అని శ్రుతి, సరసత మ—సాధువులను, భిత్—భేదించు, అసరసవిసర—అసాధుసంతతియనెడి, హిమ—మంచునకు, రవి—సూర్యుడా!

79 విర—గరుడుని, వాహనముగాఁగొనువాడా, మహీ—భూదేవిపై, రస—అనురాగముగలవాడా! వి—ఆకాశమున రస—తిరుగువాడా సత్—సాధువులకు అభిమత—ఇష్టుడా సరస—రసికుడా! యమ—యమునినుండి, సదర—భీతులగు వారికి దమ—ఇంద్రియనిగ్రహము ను ద—ఇచ్చువాడా! పర చయ—శత్రుతతికి భయద—భీకరమైన రవ—సింహనాదము గలవాడా! నమన—నతులచే దమ—మనోదండనమును నయన—కూర్చుకొనువారియెడ సరస—ప్రేమగలవాడా! దమ—క్లేశములను—ద—ఛేదించువాడా!

నలిననవజతను—శ్రోత్రబ్రహ్మచే వినుత—నుతింపబడిన వాడా! సునుతినమన—మంచిస్తోత్రములు గలవాడా! మంచి నమస్కారములు గలవాడా!

[నీకు నుతులును నతులును శ్రేయస్కరములనుట. క=విష్ణూ! అథవా పరమాత్మా! న—జ్ఞానమునకు, క=సముద్రుడా! అథవా] న=సూక్ష్మమైన, క=బుద్ధిగలవాడా!

81 హృదయనుతము. అతానవముదము—తనుత్వములేని యానందము [బ్రహ్మానందము]

84 తాత—తండ్రి దశరథుని, అనుజ్ఞకు బాధకుడవు కానివాడా! [తండ్రి పంపు నడపితివనుట]

86 రామా! అమానా!—అప్రమేయా, అనామా—నామరహితా, మా—లక్ష్మిని, రా—పరిగ్రహించువాడా, అథవా, మా—

పుట. పద్యములు.

లక్ష్మికి. ఆరామా—విహారస్థానమా! అమాపా! దగ్ధఅలక్ష్మి గలవాఁడా? అమ—దరిద్రులు అమా—దారిద్ర్యమునకు, మా—మృతిగల్గించువాఁడా, మా—మేధచేత, అమా—అపరిమితా, [నిర్వేలా] మా—లక్ష్మిని, మా—ఉరమున బంధించుకొనిన వాఁడా, నాథ—ప్రభువులను ఆధానా—పోషించువాఁడా, మామా, మధ్యమందు పీతాంబరము పచ్చవస్త్ర గలవాఁడా, [మామా—మామకుమామగాన ప్రత్యేకముగ నీవరుసతో భక్తుఁడు పిల్చుచున్నాడు]।

నామాధానా—నామకర్తా, నామానిశ్చితా—అనిశ్చితి. నాథా—ప్రభూ! అమానా, అపరిమితా.

86 దుష్కారంబులందిఁకఁ దత్త్వర్ధనము దుష్కరములలోఁ బరిగణితమయ్యె. నకారాదికముగ=నాల్గు మొదలు.

87 రామా! సామ=సామవేదము ఆరామ=విహారస్థానముగాఁగల వాఁడా, కీ, సుఖముగలవాఁడా, మా, లక్ష్మిగలవాఁడా, భీతి=భీ = గాంతిగలవారియొక్క ఇతీ = పొందుటగలవాఁడా, అథవాభీ = కాంతిగలవాఁడా, ఇతీ = జ్ఞానముగలవాఁడా [యేగత్యర్థాస్తే జ్ఞానార్థకాః] నీశ్రీ. రోమోద్వోధ=రోమాంచముయొక్క, ఉద్యోగ=ఎక్కువగాఁగూర్చుటగల [రోమాంచము గల్గించు] ఉత్త్వేమ=గొప్పభక్తిగల, ఇభేంద్ర=గజేంద్రుని చే, ఈడ్య = స్తుతింపదగ్గ, ఈశ్టే = ప్రభవిష్ణువే - నీశోభ కీర్త్యాఖ్యముగు దురితవారణ సమర్థమునను.

88 శ్యామా=యువతులైన ఆభీరి=గొల్లభామల ధీ=బుద్ధులను వీధీ=బజారుకు శ్రీ=శోభయైన, కీర్తి=యశస్సుగలవాఁడా, నీకీర్తిని గొల్లభామలు కీర్తించుకొనుచుందురనుట, మా=లక్ష్మి యొక్క ఉరః=వక్షమందలి రాగ=ఉనికిచేతనైన ఉద్యోత. ప్రకాశమును ఉల్లోచ = మేల్కట్టుగలట్టియు ఉత్స్వర=

పుట. పద్యము.

చిఱునవ్వుగల ఈక్ష=చూపుగలవాఁడును ఈట్టు=ఈశుఁడు నైనవిష్ణువే, తేపేన్=తేపుగాని నేడేన్=ఈదినమునఁగాని ఉండునని [యధ్యాహారము]

89 కురువంశజుల పాలనము వర్ణము.

విజిత = జయించుట. (సర్వోత్కృష్టులౌట) స్థితివిహితి = లోకస్థితివిధానము అనెడివ్రతమునరతులు, పరతర మహత్త్వ కరులకుహాస్యకరములైన స్వవిషయస్తుతులు గలవారు. గురువులు= ఉపదేష్టలు. కురువులు=కురురాజులు.

90 శ్రీ = [సంపత్తికి] శోభకు, వీధీ = సంచారస్థానమైన ధీ = బుద్ధియొక్క రీతీ=విధముగలవాఁడా! శ్రీశ! సౌందర్యముగల వాఁడా! భీ = భయముయొక్క, నీతీ = వ్యయముయొక్క, నీవీ=మూలధనముయొక్క, ఇతీ = ప్రాప్తిగలవాఁడా! నీతి = న్యాయమునకు, ఇ=అంతఃపురమైనవాఁడా!

నేన్=నేను, వేఱే=అన్యుఁడనా? ఏదేమేల్=నీయాదరణము కంటె వేఱైన మేలు, మేలే=శ్రేష్ఠమా?

కేలే=కరమునే, తేవే=తెమ్మా (కరాలంబ మిమ్మనుట)

ఏవేన్=నీసన్నిధి దక్క నితరైహికాముష్మికములెవ్వి యైనను నేఁడే ఇప్పుడే [నిత్యములు కావనుట].

91 నామ=నీనామావళిని, ఆధ్యాన=ధ్యానించువారికిని, అఖ్యాన= కీర్తించువారికిని అవామా! అనుకూలుఁడా! సర్వాత్మ్య = సర్వాత్మతయొక్క, అభ్యాసా=అభ్యాసముగలవాఁడా!

92 సిద్ధజాల = సిద్ధపురుషసమూహమైన కలశజాది=అగస్త్యుఁడు మున్నగాఁగలవారిచే, అధిగత=తెలిసికొనఁబడిన, లీల=విలాసముగలవాఁడా! ఖంజన = దుష్టుల, నికార=నిగ్రహముగల వాఁడా!

పుట. పద్యము.

142 93 సఖా! ఓమిత్రమా! అళిలీల = తుమ్మెదలవలెఁగదలు, అలక
లతికా = తీఁగలవంటిముంగురులతో, కలిత = కూడుకొన్నట్టియు,
కలాలయ = చంద్రుని, జయ చయ = పలుమాఱు జయించుటలను,
కథక = సూచించు, ఆస్యముచేఁ బ్రకాశించు, జలజదళ = తామర
సదళములవలె, లలిత = సుందరమైన, కాయతన్ = నెమ్మేను
గలుగుటచే, లాలితమైన యాతి = నడకతో, సహిత = కూడు
కొనిన, చెలి = ప్రేయసి, లలిన్ = ప్రేమతో; చెలఁగెన్ =
ఒప్పెను.

94 తత్ = అఖిలులయొక్క, అసు = పాపములచే, హతములైన,
సత్ = సాధువులకు, అగద = ఆరోగ్యమును దా = ఇచ్చువాఁడా!
దళత్ = భేదిల్లు అగత్ = కొండలవలెనుండు అఘ =
పాపాలుగలవాఁడా గదగలధాతా = గదపట్టుకొని పోషించు
వాఁడా! హోతా = త్యాగీ! దదత్ = దాతలను ఆదాతా =
సన్నిధికిఁజేర్చుకొనువాఁడా! గతాగత = భూతభవిష్యత్తులను
గతా = ఎఱిఁగినవాఁడా! తాతా! తండ్రీ! అథవా అతాతా!
తండ్రిలేనివాఁడా!

95 ఖగగ = గరుడుని ఎక్కువాఁడా! ఖగగ = కాంతిని బొందిన
వారిలో నుండువాఁడా! ఖగగ = సూర్యునిలో నుండువాఁడా!
కగ = కగ, బ్రహ్మ వాయు అగ్ని సముద్రయములలోనుండు
వాఁడా! కాక! రామావతారములో సముద్రమును శోషింపఁ
జేసినవాఁడా! కాక, కామునకు దుఃఖమిచ్చిన శివునకు క =
సుఖము ఎవనివలననో అట్టివాఁడా! అక, బుద్ధిలేనివారిని, గ,
పొందిన అకక దుఃఖమునకు, క = బ్రహ్మయైన వాఁడా! స్రష్ట
అనుట క = సుఖముగలవాఁడా! ఖగ, దయగలవాఁడా! ఖగ,
దేవతల అఘ దుఃఖము ఆనెడి, క, నీటికి, కక, వాయుసహి
తాగ్ని! కాక = కాకాసురునికి అక దుఃఖమొసఁగువాఁడా! క,

పుట. పద్యము.

బ్రహ్మయొక్క అక, దుఃఖముయొక్క అ=గొప్పదనమును ఘు=ఓరియువాఁడా! క=సుఖమునెడి జలమునకు, ఘు=మేఘుమైన వాఁడా! గ=వినాయకుని గ=పొందియున్న అకక దుఃఖమును క=జలానికి క=అగ్నివలె ఘూ=భయంకరుఁడైనవాఁడా! గ= గానమువలని ఖ=సుఖమునకు గ=గంధర్వుఁడైనవాఁడా! ఖగక! ఇంద్రసుఖదా! క=పరమాత్మా.

748 97 దీనదీన=మిక్కిలిదీనుఁడై విదూన=పరితాపమందిన నదీన= సముద్రుఁడు గలవాఁడా! వనదని తవదనా! మేఘధ్వనిగల భాషణముగలవాఁడా! అనవీన-పురాణపురుషా! వందనవదవన= నమస్కరించువారిని రక్షించువాఁడా! నందనవన=స్వర్గమందలి గొప్పయుద్యానమును అవన=రక్షించువారిని [దేవతలను] అవనా రక్షించువాఁడా!

98 సార=బలవంతులకు, అసుర=రాక్షసులకు, సౌరీ=శనీ! సుర= వేల్పులను, సారస=కమలాలకు, సూరా! సూర్యుఁడా! రస= విషమున, రస=రక్తిగలశివునిపై సరసా! ప్రేమగలవాఁడా! సారా! తొందఱగాఁగృత్యముల నిర్వర్తించువాఁడా! సీరరస= బలరామునిపై, సరస=భ్రాతృభక్తిగలవాఁడా! రససార= శృంగారమను జలమునకు, అథవా సర్వరసములనిగ్గునకు సరసీ= కాసారమైనవాఁడా! రాస=రాసక్రీడపై, సరస=ఇచ్ఛగల వాఁడా! సరస=బ్రహ్మానందముగలజ్ఞానులలో, రిరంసా= రమించుకోర్కిగలవాఁడా!

99 నేను, అనినుని=ప్రభువులేనివాఁడవైన, నిన్=నిన్ను ఊని నాను. పొందినాను [లేక] వహించినాను [మనసులో నిల్పితి ననుట] నిన్నున్=నీయంతటివానినిగూడ, నేనును=పాపినైన నేనుగూడ, ఊనన్=మనస్సునవహించుటకు. నానన్=లజ్జను, ఊనన్=పొందను. అన్నన్న! ఎంతటి చిత్రము! అన్నన్=

పుటు. పద్యము.

కేనిట్లనఁగా, న=సూక్ష్మముకంటె, న=భిన్నమైన, న=జ్ఞానము
గలవాఁడా! (గొప్పజ్ఞానముగలవాఁడనుట), అన్న!=అన్నా!
నన్న! వామనావతారమునఁగుఱుచనైనవాఁడా! (అథవా,
జ్ఞానమునఁగుఱుచనైన) నన్నున్, ఏనోఘమానన్=పాపముల
చేఁదక్కువ గాని వానిని, ఆననునిన్=ఆనన=నోటు, ను=
స్తోత్రముగల వానిని, ఎన్ననౌనె? లెక్కఁబెట్టఁదగునా?

160 నాల్గవపాదము

భ=శివునకు, ఇభ=గజేంద్రునకు, భ=స్వభావసంబంధమైన
భా=కాంతికి. భా=సాధనమైన, భ=కాంతిగలవాఁడా!
భాభ=మేఘాభుఁడైయదముగార్భ, భీభ=భీతగజేంద్రునికి
అభూభా=భూమిలోలేనికాంతిశాలివైనవాఁడా!
మొదటిపాదము.

భాభా=శివునితోసముఁడా! భాభా=మేఘుకాంతీ, భాభా=
భూమివలెసహనముగలవాఁడా! అథవా, అలంకారముల
కొంచెము కాంతిగలవాఁడా! సొమ్ములకన్న నీకాంతియే మిన్న
యని యాశయము. భీ=కాంతిగలవాఁడా భీ=భయముగల,
ఇభీ=గజేంద్రరక్షణమునప్పటియాడుయేన్గుల, భీ=భయమునకు,
భు=ప్రష్టయగు నశనము యొక్క, భీ=భీతికి, భు=బ్రహ్మ
(అనగా ప్రష్టయగు, భీ=గరుడుని, భీ=భీతికి, భీ=భయమును
గల్గించువాఁడా! భీ భూ=భయస్థానములైన, భూ భూ=
ప్రజలకును భూ=భువికిని. భూభూ=చంద్రునియునికియైన
వాఁడా! రంజకుఁడాయనుట.

భా=కాంతిచేత, భాభా=నక్షత్రమువంటిదైన లక్ష్మియొక్క
భా=భాంతికి, భా=కాంతినొసఁగు, భా=కాంతిగలవాఁడా?
[శత్రుమువిూఁదలక్ష్మికి వెన్నినిలుపగన్నఁదెచ్చెడివనుట) వక్షీ

పుట. పద్యము.

తత్పురుషవ్యధికరణబహువ్రీహ్యాదులాశ్రయణీయములు. భ=నక్షత్రములుగలగగనము [ఆర్యఆద్యచ్] దానితోసదృశుఁడు=భాభా! యనఁబడు. "గగనసదృశం" అని ఆర్యోక్తి, భూభూ=సీత, భూ=స్థానముగాఁగల రాగమునకు, భూ=విషయమైన వాఁడా! భూభూ=భూమ్యాదులకుఁ గారణమైనవాఁడా!

— గూఢార్థము —

145 106 ఆగోరసము=ఆగః = అపరాధపు [కాంతాంతరసంగము] యొక్క రస=రుచిని, ఎఱుగను.

— బాహ్యార్థము —

ఆ=గోరసము. ఆ ఆవుపాలు మొదలైనవి

108 కుబ్జా=కుంటిదానిని అని బాహ్యార్థము కాన్యకుబ్జపురిని అథవా ఆదేశపుస్త్రీని అని గూఢార్థము.

110 కాడయందంగములను సరిచేసికొనుచుఁ గమలినినిముఖమువముక్కుఁ చేర్చి ముద్దిడుకొని అను వాక్యమువ్యవహితపదముగా బ్రయోగింపబడె.

146 112 కనిరో! కన్యరో! నీకాలమున=నీపాదమున స్వాతి=బహుసంఖ్యాకములైన, ఖాతి=ఖ=ఆకాశగుణమైనశబ్దమును, అతి=పొందినసొమ్ములయొక్క, గణములు=సమూహములు స్ఫాస్ఫీతతకు, అహాత్ = తగిన, వల్లుత = చలనమువలనఁగలిగిన ధ్వనులుగలదగుటతో, క్రాంచుచుండును.

దంద్ర = పాదముయొక్క చదిధాతువునకాహ్లాదమర్థముకాన ఆహ్లాదకమయిన పాదముచంద్రపదముచె జెప్పఁబడెఁషి నాప్రాణ

పుట. పద్యము.

సమూహము దారి నిలిచినది. ధృతఅవస్థానే అనుధాతువునకని, స్థాతి, ఖాతి. స్థాస్నోర్గ్లా, చంద్ర. దారిపదములు దురోక్తార్థములు.

147 114 ఉపవనపదముచే = స్త్రీ = లక్షితము.
వల్లరిపదమును = చెయ్యి = లక్షితము.
చిగురుటాకులు పదముచే = వ్రేళ్ళు = లక్షితములు.
పూలగుత్తిపదముచే = గోరు—లక్షితము.

147 116 సుర=మద్యము తయారుచేయువారియొక్క [నాయణిజ స్త్రమైన సురాశబ్దముమీద డపు ప్రత్యయము] మద్యముకలవారు
(ఆర్యఆదిభోష్ణ్)
సు = గొప్పగా, రాః+అరచునాగు. [రైశబ్దే]
సురాలయమున = మద్యాగారమున సౌరకాసారమున = కల్లు కొలంకున
ఇచట దేవవాచకసురశబ్దము అప్రసిద్ధార్థముల నుపయోగింపఁబడి కవి పౌరుష్యముఁ దెల్పుఁగాన యిది పరుష.

148 118 కాఞ్చి. దీనిలోనడుమ 'ఞ' కలదు ఒకపార్శ్వమున 'క, 'ఆ', కలవు.
మఱియొకపార్శ్వమున 'చ 'ఇ', కలవు.
అక్షరాష్టకాఖ్యాయతులు=పుణ్డరీక' నామయతులు. అని కొందఱు, "పల్లవ" నాములనికొందఱు.

148 120 1వృద్ధురాల! ఓముదుసలిదానా!=మాటలతో=కలతో చూపుతో వర్తిలుచు నీవు [భీతితో] వడఁకు పెరుగుసకుగరుసింపవు.
2 ఓ వృద్ధురాల! ఓమహాలక్ష్మి, బుద్ధిసిద్ధిల స్త్రీవృద్ధవేరహ్యావ్యా

తుట. పద్యము.

యథా ఇత్యమరః పూర్వోక్తములగువానితో వర్తిలుచు వడఁకు పెరుగునను నీవు కరుణింపవు. ప్రస్తుతార్థాంతరకల్పనగాన ప్రకల్పిత.

149 122 పార్థివవ్యక్తి=యొకఁడు పరి ప్రథమమందు = పేరుమొదట, రాజ = కలి = రాజపదవాచ్యుఁడై, మటియుతనసహితతన్— ఒప్పును. అవ్యక్తియందు రాజత యతన సహితతోఁ జెలఁగడు= ఎవరు? అని ప్రశ్నము. ఉత్తరము—రాజాతనవృక్షము. రాజాత నం ప్రియాలస్స్యాత్ అని అమరము.

పార్థివవ్యక్తి=పృథివినుండి పుట్టిన పదార్థము [వృక్షము]ఒకఁడు= ఒకటి, మొదటు రాజయనియు, తర్వాత అతన యనియు, కల్పి పల్కఁబడును, అవ్యక్తియందు=ఆచెట్టున. రాజతయు= రాకార జకారములు గల్గుటయే, తనసహితతోఁ జెలఁగడు. అతనసహితతతోఁ జెలఁగునుట. అ, త, న, వర్ణములతో నొప్పును. అచెట్టున, రాజత్వము యతనయు క్తమైలేదని యుత్త రార్థములోని యర్థము పూర్వార్థములో—రాజశబ్దాభిధేయుమై యతనసహితమై యొప్పనదను విరోధస్ఫూర్తినిఁ జెప్పకోక, విరోధపరిహారమునకు రాకార జకారములు మొదటుగల్గి అ, త, న, వర్ణములు చివరఁగల్గియుండునని చెప్పికొనవలెను.

149 124 నదులు అని యుత్తరము.

బహు = అనేకములగు, భంగి=తరంగములుగలజలములచే, ఆక్షింపఁబడిన [స్నానానికి) జనులు కలదై దుర్ధరలై = కొండనుండి క్లేశముతోదిగి, హృత=అపహరింపఁబడిన, ద్రవ్యద్రు= వృక్షసంబంధిపల్లవాదులుగల కొండనువదలి, బహు—తు=

ప్రుటు. పద్యము.

రత్నాకరుని చేరుచును. సుస్థిరలు=అవశ్యాలు, ద్రవ్య = ధనము అని వేశ్యార్థము.

149 126 ప్రత్యుప్తకేశసాహాయ్యము=ప్రవాళము. [పగడము] పృథివి లేని దాని పేరు—అధరము.

150 128 అట్టులే=అటులె మొగమగుచునే. [మొదటఁ బరాఙ్ముఖులైన వారు మరలఁ బరాఙ్ముఖులైన నభిముఖులగుదురు].

129 వి=గరుడునిచేఁ జితుఁడయిన యింద్రుని, పుత్ర = కొడుకైన అర్జునుని, శత్రువయిన కర్ణుని తండ్రియైన సూర్యుని పాద=కిరణములచే, నిహతుండు=ఎండదెబ్బతిన్నవాఁడు హిమ=చల్లఁదనమును, హార=హరించువహ్నియొక్క అరి = శత్రువయిన జలమును, ధర=ధరించిన మేఘముచే పరీతమగు=వ్యాప్తమైన నభోంగణమును=ఆకాశమధ్యమును.

151 131 గంధర్వహస్తము [ఆముదపుఁజెట్టు] ఆమణ్డపంచాంగులతర్కమా నా గంధర్వహస్తస్త్రీ పుటీఫలంచ = అని హారావళిలోఁ జెప్పబడెఁగాన ఆశ్రితమైన ఫలము స్ఫుటము. ఆశ్రయము గుప్తము. కాన యేకచ్ఛన్న.

133 శిరముతోఁగూడి వెంట్రుక మాన్యమగు. శిరమును విడవాడి నిరసింపఁడు. కస్యాయం కః=కశబ్దాదిదమర్థేణ ప్రత్యయః కాన కము = అనఁగా = శిరము. వెంట్రుక. ఏకము = ఏ వెంట్రుక ఏకముతో=ఏశిరముతో. ఏకమువిడనాడి = ఏశిరము విడచి.

152 135 శ్లో॥ మాత్రం త్వపదృతా స్వార్థే
కార్త్స్న్యేఽవధౌ మాత్రాపరిచ్ఛదే
అక్షరావయవే మాత్రద్రవ్యే, మానేఽల్పేకర్ణభూషణే

ప్రతి. పద్యము.

మాత్రా=ద్రవ్యం తామస్తీతి మాత్రికః. మాత్రా=స్వ
రాదివర్ణోచ్చారణకాలః తాం వేత్తీతి మాత్రికః
అట్టివాఁడు కానివాఁ డమాత్రికుఁడు.

ఒక యర్థము.

గజాశ్వభటయుతమైన యీ సేన జితము కానిచో అమాత్రికుం

డౌటఁజేసి = స్వార్థసాధకుఁడు కాఁడు కాన అక్షరజ్ఞుండయ్యును = బ్రహ్మ
వేత్తయయ్యు నథవా, చదువుకొనినవాఁడయ్యును, అస్మదాత్మ
జుఁడు=నాకొడుకు, మూఢుఁడన నెగడును. లోకములో మూఢుఁ
డన నొప్పును అని తండ్రి కొడుకునుగూర్చి యనుకొనుమాట.

2 వయర్థము.

గ, జ, హ, య, భట వర్ణములుగలదౌచు, ఇత్యాది-యీవర్ణమాల
సేన=అధిష్ఠానదేవతలతోఁగూడినదై, జితము కాదేని = ఉపా
సనచేఁ బ్రసన్నముగఁ [వశ్యముగఁ] జేసికొనబడనిచో అమా
త్రికుండు=మాతృకానుగ్రహమునకుఁ దగనివాఁడౌటచే, అక్ష
రజ్ఞుఁడయ్యు వ్రాయను జదువను నేర్చిన వాడయ్యు మూఢుఁ
డనఁబడు. అథవా—అక్షరములు వచ్చినను వర్ణోచ్చారణ
కాలాదులు వివరముగాఁ దెలియనివాడు మూఢుఁడనుట.

186 సేనయను పేరున శర్థభేదము సేయఁబడుట నామాంతరిత.
గజహయభట పదములకుఁ బ్రసిద్ధార్థము విడచి వర్ణపరమైన
యర్థముఁ జెప్పుకొనుట వంచిత.

పుట. పద్యము.

## పాఠాంతరములలోని పద్యముల టీక.

125 45 సమాన ! జ్ఞానయుతా !

1 శ్రీనిధీ ! మానమాన ! శాస్త్రపరిచ్ఛేద్యా ! సేమానన్ నియమముతో, మానసానన్=మనముచే నీమానము=నీచిత్తసమున్నతిని, అనన్ మానన్ = ఊతగొనుటమానను. మానదాన=గొప్పదనము నిచ్చువాఁడా! విధిమాన! విధియందు బ్రామాణ్యముగల, మానవుల మాన = జ్ఞానము, మాన = పరిచ్ఛేదకముగాఁ గలవాఁడా! [వృత్త్యతేత్వగ్రాహ్యమానాధ్యా] మహితతా = పూజితత్వముచే, అమాన=పరిమితిలేని మానస! చిత్తముగలవాడా! అమానమాన = అప్రమేయా ! మాన—దాన! అనియు.

2 మహిత—మా=మహిత యుగ లసమానయుతైన,మా=లక్ష్మి గలవాఁడా! అనవమాన! అవమానములేనివాఁడా! మానవ=నరుల అనయ=కీర్తి అని, సమాన = అవమానించువాఁడా ! మా ! లక్ష్మిగలవాఁడా! అనవమాన మాన! అనవ=ప్రాచీనమైన, మాన = ఔపనిషదజ్ఞానము మాన ! పరిచ్ఛేదకముగాఁగలవాఁడా ! [అథవా] అనవ=పురాణపురుషా ! మాన = ఇంద్రియముల, మాన= తెలివికిఁ గారణమైనవాఁడా! అసమాన మానసా ! మాన మాన! మా=లక్ష్మికిని అన=స్థూలమైన, మా=మేధకును మాన మాన ! మా=లక్ష్మికిని, అన=స్థూలమైన, మా = మేధకును అ=అంతఃపురమైనవాఁడా! న=జ్ఞానముగలవాఁడా !

127 50 మత=ధ్యానింపబడిన, అఘ్రి=విష్ణుపాదముల, నామతా-సౌందర్యముచేతను, అసమాసమాన=నిరుమానగర్వముగలవారికి భీమతా = భయంకరుఁడగుటచేతను, అమత = లెక్కగొనని, అరి=శత్రువుల, భూరిధామతా = గొప్ప తేజముగల్గుటచేతను. అనమత్ =తగ్గిపోని, ప్రతాపధామతా-శౌర్యస్థానమగుటచేతను

పుట. పద్యము.

అమతా=ఒప్పుకొనఁబడని, అబ్జ శీతధామతా=పద్మచంద్రులు కలదగుటచే, అపమాంద్య=జాడ్యములేకకళకళలాడు, వక్త్రధామతా—ముఖకాంతిగల్గుటచేతను, మతా—లోకులకిష్టుఁడైనవాఁడా! అతిపుణ్యభూమతా—అతిశయితమైనపుణ్యాధిక్యము గలవాఁడౌటచే ప్రమాణ—ఇతరులు నిన్ను జూచి కేర్పుకొందగిన ప్రమాణపురుషుఁడవుగా, శిష్ట—పెద్దలచే, సమ్మతా—ఒప్పుకోఁబడినవాఁడా!

ల=ఖండితము. త్రి—చంద్రుఁడు. పుం—గ్రహించుట. త్రీ
కలా=అంశము, శిల్పము, కూడుట, కాలవిశేషము, చంద్రకళ. వడ్డి, కలము=అవ్యక్తమధురము.

127 51 క=సుఖము, లా=ఆకర్షించువాఁడా!

కలా! కళాస్వరూపా! అకలా=నిరంశా! కలాఢ్య=చంద్రునివలె, కాంత = మనోజ్ఞమైన, స్వాంత = మనస్సుయొక్క, కలా=శోభగలవాఁడా! క—బుద్ధిని, లా—ఆకర్షించువాఁడా కలా=చంద్రకళలను, అక—దుఃఖమును, ల—ఆకర్షించువాఁడా!

క—సుఖమను సముద్రమునకు, లా—చంద్రుఁడా! క—బ్రహ్మను, లా—దగ్గఱకుఁదీసికొనువాఁడా!

క—వాయువును. క—అగ్నిని. క—సూర్యుని క—యముని, క—సుఖమును,

కలా—శోభయే, కలాపకా! సొమ్ముగాఁగలవాఁడా!

కలాప—సొమ్ములకు, కాంతిదా—శోభనిచ్చువాఁడా

కలా—శోభలచే—వికస్వరా — వికసించియుండువాఁడా!

సు—మంచి, వాక్ లా—వాక్కుయొక్క శోభగలవాఁడా!

పాఠాంతరములటీక సమాప్తము.

పుట. పద్యము.

## దోషప్రకరణము టీక.

152 137 కొరసులు = తప్పులు, దోషములు.

153 138 ఏదైన నొక విషయమును జెప్పఁదలఁచినవాని వాక్యమందైదవ యవయములుండును.

ప్రతిజ్ఞ, హేతువు, దృష్టాంతము. ఉపనయము. నిగమనము. అని వాని పేరు. మొదటిమూఁడు ముఖ్యములు.

జీవనహేతువుకాన నీటివలెమనుజునకు ధనమావశ్యకము. అను వాక్యములో మనుజునకు ధన మావశ్యకము అనునది ప్రతిజ్ఞ. జీవనహేతువుకాన అనునది హేతువు. 'నీటివలె' అనునది దృష్టాంతము. వీనికిహానియనఁగా—విరోధముగాని, యభావము గాని యగును. ఇది కావ్యదోషమగునా? కాదా? అను విచారము కర్కశము—నీరసము. ఆలీఢమాట యనఁ స్వల్పముగా విమర్శించుట యనియు సమగ్రముగా విమర్శించుట యనియు నర్థములు. కొంచెము విమర్శించినవది తేలదనియు ఎక్కువగా విమర్శించుట యనావశ్యకమనియు భావము. గౌతముఁడు ప్రతి దృష్టాంధర్మాభ్య నుజ్ఞా స్వదృష్టాంతే ప్రతిజ్ఞాహానిః' ప్రజ్ఞా హానిః ప్రతిజ్ఞాంతరం ప్రతిజ్ఞావిరోధః అనియు, భోజుఁడు యావజ్జీవమహం మౌనీ, బ్రహ్మచారీ పితా మమ మాతా చ మమ వంధ్యాసీదపుత్రశ్చ పితామహః అనియు వీనికి దోషత్వము నంగీకరించిరి.

భామహాదులు ప్రతిజ్ఞాహేతుదృష్టాంతహీనం దుష్టంచ నేష్యతే. అవి వీనిదోషత్వము నొప్పుకొనలేదు. కాన దండి తన యాశయము ను జెప్పినాఁడు.

పుట. పద్యము.

153—139 సముదాయార్థశూన్యము=వాక్యఘటకపదములకుఁగాని మహా వాక్యమును గూర్చువాక్యములకుఁ గాని పరస్పరసంబంధము యోగ్యముగ లేనిది. దీనినే యోగ్యతాకాంక్షా సన్నిధి రహిత మందురు.

154 142 విరుద్ధములైన యర్థములుగలుగుట వ్యర్థతయనంబడు. ప్రాదిభ్యో ధాతుజస్యవాచ్యోవాచ్ ఉత్తర పదలోపః అని సంస్కృత వ్యాకరణము పరాహతి=సంగతములు కాకుంట.
ఈయర్థవిరోధము శాబ్దబోధము కలిగిన పిమ్మట నాలోచనచేఁ దోచునది. అపార్థమున నాకాంక్ష మొదలైనవి లేవుకాన శాబ్ద బోధమే కల్గదు. విరుద్ధమతికారిత్వ ప్రకాశితవిరుద్ధత్వామత పరార్థత్వాదిదోషములనో వ్యర్థములు దీననంతర్భవించు.

148 శత్రువులు లేరనుటకు శత్రువులఁజంపుచునుటయు, సర్వభూత దయగలుగుటకు భూమిని జయించుటయు విరుద్ధములు.

144 అభిషంగము=వియోగాదులచే విచారణశక్తి తగ్గియుండుట విరుద్ధములను బాధ్యములుగాఁ జెప్పుటచే దోషముకాదని నవీను లందురు.

156 151 కనుంగొనలేదు + ఆదూరవర్తిని కనుంగొనలేద—దూరవర్తిని అని రెండుపదచ్ఛేదములు. లేదు—అ=లేద.

153 అనంగ=మన్మథునివలన, జనిత్రిన, ఆతంక=రోగముచే, లంఘిత—అతిక్రమింపఁబడ్డది. కఠోర—కఠినుఁడైన, కాలహతిక —దుష్టమృత్యువుచే, గ్రస్త—గ్రమింగఁబడినది. అనియొక యర్థము. అనంగజాతంక—శరీరమునఁబుట్టినదిగాని రోగముచే. కాలహతిక—చెడ్డదియగు గ్రీష్మకాలముచే అనియర్థాంతరము. కాన, ఇదియర్థమా? అదియర్థమా? అని సంశయము

157 155 ఉద్దేశించినరీతికి—మొదటఁజెప్పిన విధమునకు. అనూద్దేశము= తర్వాతఁజెప్పుట. అనుగుణముగన్—వరుస సరిపోవునట్లు.

పుట. పద్యము.

153 160 శకన్య—మేఖల కాశ్యపిని—భూమిని నీ భుజము, అనుటకు, నీకు భుజము, అనుట దోషము.

చేసికొను అనుటకు చేసుకొను అనుట దోషము.

మహారాజుశబ్దము సంబోధనము మహారాజ! అనుట దోషము.

161 మలయగిరి యనుపదము ప్రథమావిభక్తిగఁ దోచి దుష్టముగ నాభాసించెడి. పదచ్ఛేదము చేసిన గిరిన్ అని తెలుయు. సప్తమ్యర్థమందు ద్వితీయకాన నిర్దోషము. మొల్కలు ప్రథమార్థము దెల్పు ప్రథమగ భాసించి దుష్టముగఁ దోచును. ద్వితీయార్థమందలి ప్రథమకాన దోషముకాదు.

లలితమహాశిల ఇటువిశేషణము విశేష్యమువలె బహువచనము కామిచే దోషమాభాసించును. వ్యాకరణవిశేషజ్ఞానమున నిర్దోషమగును.

160 167 శీతలముచంద్రకిరణ చూతకిసలయములెల్లఁ బ్ర అనినవో నక్కారములు సరిపోవును.

171 పోవు ఋతము అనుటకుఁ బదాద్యంబులు ఋ ఌ వర్ణంబులు రలతుల్యంబులు. అనుసూత్రము ప్రమాణము. హేమంత ఋతువు అనుటకు ఋత్వకః అనుసూత్రము ప్రమాణము. ఇట్లు శాస్త్రీయమగు సంధిగాన దోసముకాదు.

161 172 కామార్థసంబంధయుక్తములు—కోరిక దీర్చునవియు డబ్బు సంపాదించు సాధనములు.

161 175 మలయశైలమునఁ గర్పూరపుటనఁటి చెట్లుపుట్టుట విరుద్ధము. శిలింగవనముల మతంగజములు పుట్టి మృగపాళియములగుట విరుద్ధము

పుట. పద్యము.

168 176 చోళదేశములఁ గావేరీతీరములఁగాలాగురూత్పత్తి విరుద్ధము.

178 శరదృతువున హంసములును వానకాలమున నెమిళ్లును నుండును గాని హంసలు వానకాలమునను నెమిళ్లు శరదృతువునను నుండవు. హేమంతమునఁ జంద్రుడు మంచుచేఁ గప్పఁబడు. శిశిరమునఁ జలిచేఁ జందన మిష్టము కాదు.

168 180 భిన్న—ఆయాకాలముల నిషిద్ధములైన స్వరములం చేరని, మార్గము—ప్రయోగమార్గము గలదగుచు నీగానము, స్వరసప్తకంబు పూర్తిగా నెగడంగన్—ఏడుస్వరములు సంపూర్ణముగ వచ్చుచుండ నొప్పెడి.

—భరతుఁడిట్లు చెప్పె—

ప్రభాతే సురతో నింద్యః ఋషభః పంచమోపిచ జనయేత్ప్రిథ నంహ్యాక్షాపంచత్వం పంచమోఽపిచ పంచమస్య విశేషోయం కథితః పూర్వసూరిభిః ప్రిగే ప్రిగీతో జనయేత్ దర్శవిపర్యయమ్.

168 184 సుగతుఁడు = బుద్ధుఁడు. బౌద్ధులుసర్వపదార్థములకును క్షణికత్వము నొప్పుకొనువారు. కాన సంస్కారములను సుగతుఁడు నశింపవలెననుట విరుద్ధము. సంస్కారములు (3) వేగము, స్థితిస్థాపకము, స్మృతిహేతుభావన. ఒక దానిని దెలిసికొనిన పిమ్మట నాజ్ఞానము సూక్ష్మముగ లోపలనుండి స్మృతిని గలిగించునందురు.

164 185 కపిలమతమగు సాంఖ్యము నొప్పుకొనువారు సత్కార్యవాదులు. సత్తేపుట్టునందురు. అసదుద్భవంపు సిద్ధాంతము కాపిలోపకల్పిత

పుట. పద్యము.

మనుట విరుద్ధము. అసదుద్భవంపునిద్ధాంతమనగా-లేనిదిపుట్టు మన్నదనుట. దీనినే అసత్కార్యవాదమందురు. అసదుద్భవము= దుష్టులుపుట్టుట, లేనిదిపుట్టుట.

అసదకరణాదుపాదానగ్రహణాత్ సర్వసంభవాభావాత్।
శక్తస్యశక్యకరణాత్ । కారణభావాచ్చసత్కార్యమ్.

164 186 ఆహితాగ్నులు కానివారు వైశ్వానరేష్టి నొనర్చుట శ్రుతి విరుద్ధము.

భూతసమూహాత్మకుఁడగు విరాట్పురుషుఁడు విశ్వానరుఁడు. అతఁడధిదేవతగాఁగల యాగము వైశ్వానరేష్టి—విశ్వానరము పాస్తే విద్యుదాదిత్యవాయ్వాకాశోదకపృథివ్యాత్మకైః షడ్భిరుపేతమ్ = అనిశ్రుతి.

187 ఉపనయనములేనివాఁడు వేదములు చదువుట విరుద్ధము.

165 189 కల్పవృక్షములు నరులయుద్యానముల నుండుట విరుద్ధమయ్యును రాజుప్రభావమును కవిప్రౌఢోక్తికౌశలమును దెలివెడినిగాన నిర్దోషము.

190 అకాలేఫలపుష్పాణి దేశోపద్రవకారణమ్=శరత్కాలమున యుద్ధయాత్రలును సప్తపర్ణపుష్పములు నుండును కదంబపుష్పములు వానకాలమునందుగాని యుండవు ఐన నివి యకాలమునఁ బూచెననుట యుత్పాతముగా వివక్షితముగాన నిర్దోషము.

165 191 లయతప్పిన కీర్తనరాగముఁ బెంచుట విరుద్ధము. ఐనను వారి యన్యోన్యానురాగమహిమను సూచించుచు రాగశబ్దశక్తిమూల ధ్వని నేర్పఱిచెడినిగాన నిర్దోషము.

పుట. పద్యములు.

164 192 అగ్ని చల్లనిదగుట విరుద్ధము. కాముకుని కట్టిగపడుట విరుద్ధము కాదు.

193 జ్ఞేయత్వము అజ్ఞేయత్వము మున్నగు పరస్పరవిరుద్ధము లొక యాధారమున నుండవని న్యాయశాస్త్రము. ఇక్కడఁ బరమాత్మ యచింత్యమహిమమని తెల్పుచునవిరుద్ధము గుచుండె.

66 194 దైవవిధి కావున శాస్త్రవిరుద్ధమయ్యు బహుపతిత్వమవిరుద్ధము.

168 198 విధి=లక్షణములచేత, దర్శిత=చూపబడిన. వ్యుత్పన్న=జ్ఞానము గల, బుద్ధి=మతిగలవాఁడై, వశ్య—స్వాధీనములైన, వాక్—మాటల, అభిస్రుతిన్—స్వయముగ వచ్చుచుంటచేత మదవతులభిస్రుతిన్—మదవతుల—యువతుల అభిస్రుతిన్—తమంతతాము వలచివచ్చుటచే రమించు—ఆనందించు

168 6 ముఖంబు కాదు—ప్రారంభము కాదు? ఎదియేని వారాదినుంతురు. సుఖంబు—అనిపాఠాంతరము గలదు.

# పాఠాంతరములు

72 పుటలో 188 పద్యము తర్వాతిపద్యము

తే. గీ. ఇతరహేతుభవంబు నహేతుకంబు
నైనమదము మున్నగునది పానముఖ్య
భవముగానిది యిచ్చోవివక్షితంబు
గావున విరోధమనునది గానరాదు.

లేక

తే. గీ. ఇటు లపానాదిజన్యమై యితరహేతు
భవమును నహేతుకంబునై వఱలునట్టి
క్షీబతాదిక మిటవివక్షింపఁబడెఁ
గావునన్ విరుద్ధతయిటుఁ గానరాదు.

82 పుటలో 231 పద్యము నిట్లు మార్పవలెను

తే. గీ. ప్రాగభావాదులైన యభావములకు
భావరూపం బభావరూపంబునైన
కార్యమును గలిగింపంగఁ గారణత్వ
మీయుదాహృతులన్ వచియింపఁబడియె.

88 పుటలో 284 పద్యమునిట్లు మార్చితి.

తే. గీ. తాపకాపాంగమను మన్మథప్రదరము
జైత్రమగుఁజెలి! లాతిలక్ష్యమునవదలఁ
బడియెనీచేత, దానిచేవాఁడుగాక
నేనునున్ గూడ దెబ్బదింటి హృదయమున.

అథవా

తే. గీ. తాపకాపాంగమను మన్మథప్రదరము
జైత్రమగుఁజెలి! పెఱదెసజనునిమీఁద
వదలఁబడియెనునీచేత, వానితోడ
నేనునున్ దాని దెబ్బదింటి నెదయందు.

109 పుటలో 337 పద్యము నిట్లు మార్చవలె.

తే. గీ. ఆసనం దేహము నవన్వయమునుగూడ
నుపమలంకున నేఁజూపియున్న వాఁడ
రూపకాలంకృతులలోన చూపితిని ని
రూపణమ్ముగాఁగ నుపమారూపకమును.

తే. గీ. అరసిచూడ నుత్ప్రేక్షావయవముగూడ
వెలయుచుండు నుత్ప్రేక్షావిభేదమగుచు
బహ్వలంకార సంసృష్టి పండితులగు
వారు సంకీర్ణముగఁగఁ బొల్పారుచుండు.

125 పేజీ ఆఖరునఁగల యనతారిక 126 పుట మొదటఁ జదువవలె.
165 పుటలో 192 పద్యమిట్లు మార్చవలె.

తే. గీ. చంద్రునర్చిస్సుకంతెను జల్లదనము
హవ్యవాహనునందుఁ బొల్పారు మిగుల
నంచు నబలావియోగ శ్రమార్తి లేక
నిరత విహ్వలుఁ డితఁడు గణించుచుండె.

189 పుట 21 బంతితర్వాత నిదిచదువుఁడు.

దీపకస్థానమందు—దీపకము సంభవించుచుండఁగనే. ఒక వాక్యములోని పదమును మఱొక వాక్యములోని కధ్యాహారముగాఁ దీసికొనవలసినచో దీపకమును, ఒక వాక్యములోని పదమునో పదార్థమునో మరలఁ జెప్పుట యావృత్తియుఁ గాన యీపద్భేదమును

పుట. పద్యము.

190 పుట 17 పంక్తి తర్వాత నిది చేర్చుకొనవలె.

76—206 ఏకమాపరాయణము—ముఖ్యాధారము. సర్వా లంకారములనేదే సతిశయము దోచుఁగాన. ఇతర వైచిత్ర్యములు ముఖ్యములైన నితరాలంకారములు. అట్లుకానిచో నిది. కావుననే యీలక్ష్యములఁగూడ వరుసగా, సామాన్య, సందేహ, నిశ్చయాధికాలంకారములఁ గొందఱభిమానింతురు.

226 పుట చివర. అనులోమము.

134—76 నళినదమ = పద్మములను శిక్షించు (పద్మములఁ బోలెడి) నయన=కన్నులుగలవాఁడా! జలజవదన! వరద! హాలకర = బలరామునియొక్క, సుదయ= మంచిదయగలవాఁడా (దయకుభాజనమా!) రస రసరూపా!—రసోవైసః=అనిశ్రుతి. బలమహిమ= బలాతిశయముచే, జని-పుట్టుకగల, రవ-సింహ నాదములుగలవాఁడా।

## ప్రతిలోమము

వరనిజమహిమలవ - వర -బ్రహ్మదిదత్తవరసంభవమైన, నిజమహిమలేశముచే, నరయత్ - తొందఱ గలవాండ్రవలెఁ దిరుగు, అసురులతోఁ గలహించువాఁడా! దర-భయమును, వన - అడవులకు, దవ-కార్చిచ్చువైనవాఁడా! జలజకరక-పద్మములవంటి కేల్దోయిగలవాఁడా! నమద-నమస్కరించు భక్తులకంతఃపురమువంటివాఁడా! నళిన-నళినము గలవాఁడా! అనఁగా - పద్మనాభా! యనుట.

# సమర్థనలు

| | | | |
|---|---|---|---|
| ౩ | ౧౨ | చూపంగఁబడియె / ఇట్టివి చాలకలవు | వినంగఁబడియెన్ / అనిపారిజాతాపహరణము |
| ౬ | ౭ | చేర్చినాను / ఇట్టివి చాలకలవు | మోదినావేమిరా / అని హరిశ్చంద్రచరిత్ర |
| ౯ | ౧౦ | వళిక్షసుగము | ద్వప్రకరణె అన్వేష్య పిదృశ్య తే అని వ్యాకరణము. ఆద్యగన్య ఆదిగాః అవసానగన్య అని యథ ర్వాణకారికలలోఁ బ్రయుక్తము. |

౧౯౪ పుట ౨౦ బంతి మొదలు ౧౯౫ పుట ౨ బంతివఱకును "అంగము కావచ్చు"ననుట యితరాలింకారికులు రసవదలంకారములను సాధించుపద్ధతి రసము ముఖ్యముగ వ్యక్తమగుచున్నను రసవదలంకారములనియె దండిమతమనితోఁచెడి.

విషయసూచికలో :

౭ పుట ౧౧ బంతి. వామనుఁడు శబ్దగతములు నర్థగతములు నని గుణాలంకారములని విభజించి చక్కగాఁ జూపెను. అక్కడఁగూడ లక్ష్యలక్షణ సమన్వయము క్లేశకరమ. దండి గుణ విభజన శబ్దార్థములద్వారా లేదు. శ్లేషసౌకుమార్యములకు భేదముకన్పట్టదు. సమాసబాహుళ్యమోజోగుణమనుట తగదు. 'నళనాళీకమృణాళనాళలతికా నవ్యప్రణాళీ మిళల్లలనాలాప' "కిసలయాకులకోకిల కాకు కాకలీకలకలరావముల్" అను నిట్టి మృదువర్ణమయములైన సమాసములు.

"రణాత్కరణఝుంఝణాత్క్వణితకింకిణీ "చంచద్భుజభ్రమితచండగదాభిఘాత"అనునట్టి సమాసములవలె రౌద్రాది దీప్తివ్యంజకములు కాలేవుకదా.